*Shajarha-e-Sayadar*
*(Telugu)*

# మహా వృక్షాలు

*( మౌలానా మౌదూది గృహస్థ జీవితం )*

మూలం

సయ్యిదా హుమైరా మౌదూదీ

అనువాదం

**అబుల్ ఫౌజాన్**

**M.A. (Islamic std.), M.A. (Urdu)**

## విషయసూచిక

*అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో*

# పరిచయం

మనుషులతో నిండివున్న ఈ ప్రపంచంలో కొందరు మరణించి నప్పటికీ అమరులుగానే ఉంటారు. తమకు లభించిన జీవిత వ్యవధిని ముగించుకొని వారీ ప్రపంచాన్ని వీడినప్పటికీ, తాము చేసిన సేవలు, ఘన కార్యాల వల్ల ఎల్లప్పుడూ ప్రజల హృదయాల్లో మెదులుతూ తమ ఉనికిని చాటుకుంటూనే ఉంటారు. శాఖోపశాఖలుగావిస్తరించి చల్లటి నీడనిచ్చే మహావృక్షాల్లాంటి వారు వీరు. మనం చదవబోయే ఈ పుస్తకం విశ్వవిఖ్యాత ఇస్లామీయ తత్వవేత్త మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ(రహ్మ) (1903- 1979)గారి పుత్రిక సయ్యదా హుమైరా మౌదూదీ వ్రాసిన మనోహర, మనోజ్ఞమైన రచన. ఇందులో ఆమె 'రెండు మహావృక్షాల' వ్యక్తిగత, కౌటుంబిక జీవనానికి సంబంధించిన కొన్ని కోణాలను మనముందుకు తీసుకురావడం జరిగింది. ఇందులో మొదటి వ్యక్తిత్వం మౌలానా సయ్యద్ అబుల్ఆలా మౌదూదీ(రహ్మ)గారిది. ఆయన తన కుటుంబీకులు, అనుయాయులు, సంబంధీకులకే కాకుండా తనవారు, పరాయివారు అందరికీ చల్లని నీడను, విశ్రాంతినిచ్చే మహావృక్షంలాంటివారు. నిజం చెప్పాలంటే, తన పర అనే బేధభావమే ఆయనకు లేదు. ఆయన మానవాళినందరినీ ఒకే సముదాయంగా సోదరులుగా చూసేవారు. వారి ఇహపరాల సాఫల్యానికి సతతం చింతాక్రాంతులై ఉండేవారు. ఆ చింతన ప్రతిరూపంగానే ఇస్లామీయ ఉద్యమం ఉనికిలోకి వచ్చింది.

ఇక రెండవ మహావృక్షం, ఆయనగారి సతీమణి స్వర్గీయ మహ్మూదా బేగం(రహ్మ) స్వయాన రచయిత్రి తల్లిగారు. ఎలాంటి ఆర్భాటం లేకుండా మౌనంగానే తన సత్ప్రవర్తన త్యాగనిరతి, విద్యాశిక్షణల ద్వారా ఇస్లామీయ ఉద్యమాన్నంతటినీ (పరోక్షంగా) ప్రభావితం చేసిన ఆదర్శ వనిత ఆమె.

మౌలానా మౌదూదీగారి ధార్మిక, ఉద్యమ, సాహిత్యపరమైన కార్యకలాపాల్లో ఆమె నిర్వహించిన పాత్ర ఎలాంటిదో, ముస్లిం సముదాయానికి ఆమె చేసిన సేవలు, అందించిన కానుకలేవో ఈ పుస్తకం చదివిన తరువాతగాని మీరు తెలుసుకోలేరు.

ఆదరణీయమైన రచయిత్రి 'సయ్యదా హుమైరా మౌదూదీ' మౌలానా మౌదూది(రహ్మ)గారి జ్యేష్ఠ పుత్రిక. ఆమె ఆంగ్ల సాహిత్యంలో పోస్ట్ గ్రాడ్యుయేట్. సౌది అరేబియాకు చెందిన జిద్దా నగరంలోని ఒక బాలికల కళాశాలలో ఆంగ్ల సాహిత్య అధ్యాపకురాలిగా పనిచేశారు. అయితే సొంత అభిలాష, పట్టుదలతో అరబిక్, ఇస్లామిక్ స్టడీస్‌లో కూడా అసామాన్యమైన ప్రావీణ్యాన్ని సంపాదించు కోగలిగారు. ఖుర్‌ఆన్ హదీసుల దర్స్‌లు, దైవమార్గపు హితోపదేశం, ఖుర్‌ఆన్ పారాయణం, ఉపన్యాసాలు, ప్రసంగాలే ప్రస్తుతం ఆమె దైనందిన చర్య. మౌలానా మౌదూదిగారి జీవితాన్ని ఆయన అందించిన సేవల్ని అర్థం చేసుకోవడంలో ఈ పుస్తకం అత్యధికంగా తోడ్పడుతుందని ఆశిస్తున్నాము.

'మర్కజి మక్తబా ఇస్లామీ పబ్లిషర్స్'వారు ప్రచురించిన ఈ పుస్తకం పాఠకుల ఆదరణను, మన్నల్ని అందుకుంటుందని మా ప్రగాఢ విశ్వాసం.

- పబ్లిషర్స్

# మనవి

2003వ సంవత్సరం మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూదిగారికి సంబంధించిన ఓ సంస్మరణ సంవత్సరంగా పేర్కొనవచ్చు. ఆయన జన్మ దినాన్ని పురస్కరించుకొని ఒక శతాబ్దం పూర్తవుతున్నందున ఈ సంవత్సరం ఆసాంతం ఆయన జన్మదిన వేడుకలు జరిగాయి. ఇందులో పాకిస్తాన్‌లోనే కాకుండా విదేశాలలోని వివిధ విద్యాలయాలు ఆయనగారిపై ఇష్టాగోష్టులు, సెమినార్లు ఏర్పాటు చేశాయి. ఆయన గారి జ్ఞాపకాలను మననం చేసు కోవడం జరిగింది. దీనితోపాటు సైద్ధాంతికంగాను, ధార్మికపరంగాను ఆయన చేసిన సేవల్ని కొనియాడుతూ వ్యాసాలు, ప్రత్యేక సంచికలు వెలువరించడం జరిగింది. ఈ ఇష్టాగోష్టులు, సింపోజియంలు ఆయనలోని విశ్వాసాభిమా నానికి, అనుపమ ధైర్యస్థైర్యాలకు, జ్ఞానపరిపక్వతకు గుర్తింపుగా, జనామో దానికి ప్రత్యక్ష నిదర్శనాలుగా పేర్కొనవచ్చు.

లాహోర్ నుండి వెలువడే 'తర్జుమానుల్ ఖుర్‌ఆన్' రెండు ప్రత్యేక సంచికలు (మొదటిభాగం 2003 అక్టోబర్, రెండవ భాగం 2004, ఏప్రిల్) పూర్తిగా దీనికోసమే కేటాయించబడ్డాయి. ఈ ప్రత్యేక సంచికల్లో ప్రచురితమైన శీర్షికలు, వ్యాసాలు ఇంద్రధనస్సులోని వివిధ రంగుల్లా, మౌలానా గారి జీవితపు వివిధ కోణాలపై దృష్టిని మళ్ళిస్తాయి. మౌలానాగారి జ్యేష్ఠపుత్రిక హుమైరా మౌదూది (జననం: 1940, జులై22, ఢిల్లీ)గారు రచించిన షజర్ హాయెె సాయె దార్ ఆ కోవకు చెందిన రచనే. అందులో ఒక నిజమైన దైవదాసుడు, ప్రవక్త మహనీయుల(స) నిజమైన అనుచరుని జీవితంలో ఎదురయిన అవాంతరాలు, ప్రమాదాలే కాదు, ఒళ్ళు గగుర్పొడిచే సందర్భాలను ఆ ధైర్యశాలి ఎలా ఎదుర్కొన్నారో మనోజ్ఞంగా హృదయాలను ఆకట్టుకునే రీతిలో వివరించడం జరిగింది.

అయితే పత్రికలోని పరిమిత పేజీలు కొంతమేరకే సమాచారాన్ని అందించగలుగుతాయి. ఆ పరిమిత సమాచారం పాఠకులకు తృప్తినెలా

కలిగిస్తుంది? పాఠకులు మరీ మరీ కోరడం, వారి తీవ్రమైన ఒత్తిడి మూలంగా ఆ సమాచారం పెరుగుతూ, పెరుగుతూ ఒక పుస్తక రూపాన్ని సంతరించు కుంది. ప్రస్తుతం దాన్నే పాఠకులకు అందిస్తున్నాం.

గౌరవనీయులైన సయ్యిద్ మౌదూది, ఆదరణీయమైన ఆయన కుటుంబ సభ్యుల వ్యక్తిగత జీవితపు వివిధ కోణాలపై బయటివారు ఎరుగని విషయాలపై ఈ పుస్తకం దృష్టిని మళ్ళిస్తోంది. దైవచిత్తమైతే వీరి జీవితాలతో పాఠకులు గుణపాఠం నేర్చుకుని, తమ జీవితాల్ని సైతం దైవం, దైవప్రవక్త(స) నిర్దేశించిన మార్గంలో గడుపుతారని ఆశిస్తున్నాము.

అనేక కిస్తుల్లో రాయబడిన ఈ వ్యాసాలను ఆనవాయితీకి విరుద్ధంగా, వినూత్న రీతిలో సమీకరించిన తరువాత దానిపై ప్రొఫెసర్ రఫియుద్దీన్ హాష్మి'గారు ఒక దృష్టివేసి, సముచిత సవరణలు చేశారు.

నిరంతర పుణ్యాన్ని ప్రసాదించే ఈ కృషిని దైవం స్వీకరించుగాక!

సయ్యిద్ మౌదూదిగారు తన జీవితంలోని ప్రతి క్షణాన్ని, సర్వ సంబం ధాల్ని, సర్వ ఆలోచనా అనుభూతుల్ని ఏ జీవిత లక్ష్యం కోసం వెచ్చించారో, ఆ లక్ష్యాన్ని దైవం నెరవేర్చుగాక! ఈ లక్ష్యసాధన కోసం ఆయన ఏ వర్గాన్నైతే రూపొందించారో, సన్మార్గగామియైె ఆ వర్గం తన గమ్యాన్ని చేరుకోవడంలో ఈ చిరురచన దోహదపడుగాక! ఆమీన్!!

- సలీమ్ మన్సూర్ ఖాలిద్

# ముందుమాట

అబ్బాజాన్, 'సయ్యద్ అబుల్ ఆలా మౌదూది- ఇస్లామీయ ఉమ్మత్‌కు ఒక పెన్నిధిలాంటివారు. ఆయనగారి జ్ఞాపకాలను నెమరు వేసుకునేందుకు కొన్ని రచనల్ని తర్జుమానుల్ ఖుర్ఆన్ ప్రత్యేక సంచిక (మే, 2004) కోసం పంపించాను.

ఓర్పు, సహనాల గురించి ఇతరులకు బోధించటం సులువే- కాని వాటిని స్వయంగా భరించడం, సహించడం కష్టతరమైన విషయం. సహనం అనేది చేదు రసం లాంటిది. కాని ఈ చేదునే 'దాదీఅమ్మా', 'అబ్బాజాన్', 'అమ్మీజాన్'లు జీవితాంతం ఒక్కొక్క గుక్కగా త్రాగుతూ అసామాన్యమైన ఓర్పు, సహనాలతో జీవితం గడపగా నేను కళ్ళారా చూశాను. అందుకని దీన్ని ఓర్పు, సహనాలనబడే చేదు గుటకల గాథగా భావించాలి. 'అశ్రువుల్ని రాలనివ్వకు అవి కళ్ళలోనే ఇంకిపోవాలి' అనేది దాదిఅమ్మా సిద్ధాంతం.

ఏడ్చేవారితోకలిసి ఎవ్వరూ ఏడ్వరు, పైగా నవ్వేవారితోపాటు అందరూ నవ్వుతారు. ఏడ్చేవారిని లోకం తమాషాగా చూస్తుంది. అని దాదీమా తరచూ అంటూ ఉండేవారు.

ఇరవయ్యో శతాబ్దం మౌలానా మౌదూది శతాబ్దంగా నేడు అందరూ చెప్పుకోవడం యదార్థమైనదే. ఆయన తన రచనల ద్వారా సైద్ధాంతిక ప్రపంచంలో ఒక విప్లవాన్ని తెచ్చారు. ఇస్లామీయ ప్రపంచంలోని అత్యధిక ఉద్యమాలు ఆయన ద్వారా తెచ్చిన ఉద్యమంతోనే ప్రభావితమయ్యాయి. ఆయన సైద్ధాంతిక రచనలు ఆ ఉద్యమాలకు కొత్త జీవం పోశాయి. వాటికి ఆహారంగా పనిచేశాయి. అయితే ఒక విషయాన్ని మనమిక్కడ మరువరాదు. ఒక రచయిత ద్వారా మహోన్నత కృతులు ఉనికిలోకి రావాలంటే, అతని సమీపబంధువులు అతనికి మానసిక ప్రశాంతత, నిమ్మళాన్ని సమకూర్చాల్సి ఉంటుంది.

ఇవి కేవలం జ్ఞాపకాలు మాత్రమే కావు, తఫ్సీర్ ఫీ జిలాలుల్ ఖుర్ఆన్ వ్యాఖ్యాత, సుప్రసిద్ధుడు అయిన సయ్యద్ ఖుతుబ్ (రహ్మాలై)గారి దృష్టిలో ఆయన ఓ మహోన్నత ముస్లిమ్.

ఒక మహోన్నత పుత్రుని ఆదర్శనీయులైన తల్లిదండ్రులు, మహోన్నత మైన ఆయన జీవిత భాగస్వామిని యొక్క ఓరిమి పరిచయం ఇది. వీరంతా అసామాన్యమైన ఓర్పు, సహనాలను ప్రదర్శించి హృదయాల్ని పిండిచేసే ఘట్టాల్ని సైతం అత్యంత శక్తిసామర్థ్యాలతో అధికమించారు.

నేటి మహోన్నత ఇస్లామీయ ఉద్యమం ఏ ఇంటినుండైతే ప్రారంభ మయిందో ఆ ఇంటి పరిస్థితులెలాగుండేవి? తొమ్మండుగురు చిన్నచిన్న పిల్లలు, వృద్ధురాలైన తల్లి, అత్యంత బలహీన ఆరోగ్యం, ఉబ్బసం వ్యాధితో బాధపడుతున్న జీవిత సహచరిణి. ఈ కుటుంబీకులే గనుక ఒక్క క్షణమైనా ఓర్పు, సహనాల్ని విడనాడి ఉంటే, నేడు మనం చూస్తున్న ఈ పరిణామాలు, ఈ వాస్తవాలు అసలు కనిపించకనేపోయేవి. ఒక ఉద్యమంలో పాలుపంచు కునే కార్యకర్తలైనా, నాయకులైనా వీరంతా మనుషులే. వీరందరి ఆచరణ, దీక్షల మీదనే ఉద్యమ జయాపజయాలు ఆధారపడి ఉంటాయి. ఈ ఉద్యమంలో కొందరు మొదటి వరుసలో ఉంటే ఇంకొందరు చివరి వరుసలో ఉంటారు. మరికొందరైతే అందులో ఉన్నట్లే కనిపించరు. కాని ఉద్యమంలో వారికో పాత్ర అంటూ తప్పక ఉంటుంది. ప్రత్యక్షంగా వారి పాత్ర కనిపించక పోయినా, జీవితాంతం వారు చేసిన త్యాగం, నిరహంకారత, ఆత్మాభిమానానికి ప్రతీక ఈ జీవిత చరిత్ర. ఒకసారి తెరలేపి 'ఆ ఇంటి' పరిస్థితులేమిటో చూపించే ప్రయత్నమే మీ చేతుల్లో ఉన్న ఈ పుస్తకం.

మేలిముత్యం విలువైనదే, సందేహంలేదు. కాని అది ముత్యంగా రూపుదాల్చటానికి ఎన్నెన్ని ఘట్టాలను అధిగమించిందో, ఎన్నెన్ని అవాంతరా లను, మరెన్నెన్ని ప్రమాదాలను ఎదుర్కొన్నదో ప్రపంచానికేం తెలుసు?

పత్రికలోని పరిమిత పేజీల కారణంగా, 'మహావృక్షాలు' (అనగా దాది అమ్మ, అబ్బాజాన్, అమ్మీజాన్)ల గురించి అప్పట్లో వివరంగా రాయలేక పోయాను... కాని ఇప్పుడు అవసరమైన సవరణలు, మార్పులు, చేర్పులతో దీన్ని పాఠకులకు సమర్పిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని చదువుతున్న కొద్దీ, ఈ మహావ్యక్తుల రూపాల్ని పాఠకులు స్పష్టంగాను, ప్రకాశవంతంగాను చూడగలుగుతారని ఆశిస్తున్నాను.

- హుమైరా మౌదూది

# 1. అబ్బాజాన్

ఎవరి చేతనైతే దైవం గొప్ప కార్యాలు చేయించదలుస్తాడో, చిన్నప్పటి నుండే వారికి సముచిత అవకాశాలను కల్పించి, తమకో నిర్దిష్టమైన గమ్యాన్ని ఏర్పర్చుకొని, దానిపై పయనించే ఏర్పాట్లు చేస్తాడు. ప్రవక్త మహనీయుల(స) పరివారంతో సంబంధమున్న ఒక కుటుంబానికి చెందిన తనయుడు అబ్బాజాన్. ఈ కుటుంబం తొలుత 'హిరాత్'వైపుకు, ఆ తరువాత తన పూర్వీకుడైన ఖుతుబుద్దీన్ మౌదూదీ చిష్తి (1039- 1133) కాలంలో భారతదేశానికి హిజ్రత్ చేసి వచ్చింది. సయ్యద్ ఖుతుబుద్దీన్ పేరుగల ఈ మహామనిషి 'చిష్తియా' వంశపరంపరలో అందరిలోకెల్లా గొప్ప వ్యక్తిత్వం. ఈ పరంపరలోనివారు దివ్య ఖుర్ఆన్ ఆదేశాల్ని, ప్రవక్త మహనీయుల(స) ఆచరణను (సున్నత్) తు.చ తప్పకుండా పాటించేవారు. మా తాతగారు సయ్యద్ అహ్మద్ హుస్సేన్ (1855-1920) వృత్తిరీత్యా న్యాయవాది అయినప్పటికీ, దైవారాధన, ధర్మనిష్టల్లో ఆయన అత్యధికంగా అభిరుచి కలిగి ఉండేవారు. ఈ కారణంగా న్యాయవాది వృత్తికి ఎక్కువ సమయం కేటాయించలేకపోయేవారు. ఇక కేసులు తీసుకున్నా, అవి సత్యం, న్యాయంగా ఉన్నాయని తృప్తిచెందితే తప్ప తీసుకునేవారు కాదు. అలాంటి కేసుల్లో మాత్రమే వాదించేవారు.

హైదరాబాద్ దక్కన్ (ఇప్పుడు మహారాష్ట్ర)కు చెందిన ఒక నగరం ఔరంగాబాద్‌లో 1903 సెప్టెంబర్ 25వ తేదీన అబ్బాజాన్ జన్మించారు. అక్కడ్నే ఆయన పెరగసాగారు. అబ్బాజాన్, ఆయన నాన్నగారి అంటే మా తాతగారి వ్యక్తిత్వంతోనే అత్యధికంగా ప్రభావితమయ్యారు. ఈ పిల్లవాడిని ఆయన తనతోపాటుగా మస్జిద్‌కు తీసుకెళ్ళేవారు. తమ సమకాలీన ఉద్దండులైన పండితుల సభల్లో కూడా తనతోపాటుగా తీసుకెళ్ళేవారు. దివ్యఖుర్ఆన్‌లోని సూరాలను కంఠస్థం చేయించేవారు. అరబిక్, స్వచ్ఛమైన ఉర్దూ మాట్లాడే శిక్షణ అబ్బాజాన్‌కు తాతగారి ద్వారానే అబ్బింది.

రాత్రి సమయాల్లో ఆయన అబ్బాజాన్‌కు ప్రవక్తల గాథలు, ధార్మిక గురువుల జీవిత విశేషాలు, ఇస్లామీయ చరిత్రకు సంబంధించిన వివిధ సంఘటనలను వినిపించేవారు. ఇస్లామీయ విశ్వాసాల్ని మనోమస్తిష్కాల్లో గాఢంగా నాటుకుపోయేలా విభిన్న కోణాల్లో మనోజ్ఞంగా బోధించేవారు. ఆయనలో ధార్మిక స్వభావం మొలకెత్తాలని రకరకాలుగా ప్రయత్నించేవారు. ఇంట్లో కూడా ఆయనలో సభ్యతా సంస్కారాల్ని, నైతిక విలువల్ని నూరిపోయడానికి సతతం ఆరాటపడేవారు. ఉర్దూభాష పట్ల కూడా ఆయన ప్రత్యేక శ్రద్ధచూపేవారు. అబ్బాజాన్ ఇలా అంటుండేవారు. 'నాలో ఏదైనా చెడు అలవాటు కనబడితే అబ్బాజాన్ దాన్ని వెంటనే దూరం చేయడానికి ప్రయత్నించేవారు. ఒకసారి నేను మా పనిమనిషి అబ్బాయిని కొట్టాను. అది తెలిసిన వెంటనే అబ్బాజాన్ ఆ పిల్లవాడ్ని పిలిచి, 'ఇతను నిన్నెలా కొట్టాడో, నీవు కూడా అతన్ని అలాగే కొట్టు' అంటూ ఆదేశించారు. ఈ సంఘటన నాకెలాంటి గుణపాఠం నేర్పిందంటే, ఇక జీవితాంతం నాకంటే క్రిందివాళ్ళపై చేయిలేపే సాహసం చేయలేకపోయాను.

బడికి పంపబడకమునుపే అబ్బాజాన్‌కు విద్యాభ్యాసానికి ఇంట్లోనే ఏర్పాట్లు జరిగాయి. వాటిగురించి ఆయన ఒకచోట ఇలా వ్రాశారు. "పదమూడు వందల సంవత్సరాల నుండి మా కుటుంబం ప్రజల విద్యాశిక్షణ, హితోపదేశం, నిగ్రహం, ధర్మనిష్ట, దైవభీతికి ఆలవాలంగా ఉంటూవచ్చింది. ఈ వంశానికి చెందిన ఒక ప్రముఖుడు మౌలానా 'అబూఅహ్మద్ అబ్దాల్ చిష్తి' (నిర్యా: 965), హజ్రత్ 'ఇమాం హసన్(రజి)'కు కుమారుడైన 'హజ్రత్ హసన్ ముసన్నా(రహ్మ)' గారి సంతానం. 'ఖాజా నాసిరుద్దీన్ అబూ యూసుఫ్ (రహ్మ)' జ్యేష్ట కుమారుడైన 'ఖాజా ఖుతుబుద్దీన్' మౌదూదీ చిష్తి(రహ్మ) భారత దేశంలోని 'చిష్తియా' పరంపరలోని గురువులకు గురువు, మౌదూదీ కుటుంబానికి మూలపురుషుడు. ఆ కాలంలో ఆంగ్లభాష, ఆంగ్ల సంస్కృతి పట్ల ముస్లింలలో పొడసూపిన తీవ్ర అసహ్యత అందరికీ తెలిసిన విషయమే. అయితే ఈ

విషయంలో తక్కిన సామాన్య ముస్లింలకన్నా మా కుటుంబం ఒకడుగు ముందే ఉండేది. దీనికి కారణం ఏమిటంటే ఈ ఇల్లు ధార్మికతనే కాదు, ధార్మిక పెత్తనాన్ని కూడా కలిగి ఉండేది. నాన్నగారు, అమ్మీజాన్ ఇద్దరూ ధార్మికంగా ఒకే మూసనుండి బయటపడినవాళ్ళు. ధార్మిక ఆచారాలను, నియమ నిబంధనల్ని తు.చ తప్పక పాటించడం వీరిద్దరిలోనూ ఆనవాయితీగా వస్తున్నదే. వీరి శిక్షణ, ప్రత్యక్షంగా వీరి జీవితాల్లో కనబడుతున్న ధార్మికత కారణంగా చిన్నప్పటినుండే నాలో ధర్మంపట్ల ఆసక్తి పెరగడానికి దోహదపడింది. ప్రారంభంనుండే నా మనోమస్తిష్కాల్లో ధార్మిక భావనలు తమ స్థానాన్ని పదిలపర్చుకోసాగాయి. మొదటిరోజు నుండే అబ్బాజాన్, ఉర్దూ, పారశీకముతోపాటు అరబిక్ భాష, ధార్మిక శాస్త్రం (ఫిఖహ్), హదీస్ అధ్యయనానికి బాటవేశారు."

తమ ప్రఖ్యాత గురువు ఒకరి గురించి అబ్బాజాన్ ఇలా చెప్పారు:

"ఆ కాలంలో ఢిల్లీలో మౌలానా అబ్దుస్సలాం నియాజీ గారు (నిర్యా: 1954) ఫిలాసఫీ, విజ్ఞాన శాస్త్రాల్లో (విజ్ఞాన శాస్త్రాలంటే ఆ కాలంలో గణితం, తర్కశాస్త్రాలు) ప్రవీణులని ప్రఖ్యాతిగాంచినవారు. ఆయనలోని వర్ణనాపద్ధతి, వాక్చాతుర్యం భాషపై ఉండేపట్టు కారణంగా గంటల కొద్ది ఆయన మాటలు విన్నప్పటికీ, మనిషికి తృప్తి కలిగేది కాదు, ఇంకా వినాలనిపించేది. మా నాన్నగారి పట్ల అత్యంత గౌరవభావం కలిగిఉండేవారాయన. నాకు ఆయనే అరబ్బీ నేర్పాలని నాన్నగారు చిన్నప్పుడే ఒకమాట ఆయన చెవిలో వేసి ఉన్నారు. అందుకని చిన్నతనంలోనే నేనాయన దగ్గర చదవడం ప్రారంభించాను. నాన్నగారు కాస్త జంకుతూనే, 'చదువు చెప్పినందుకు మీకు గురుదక్షిణగా ఏమివ్వాలి?'అని అడిగినప్పుడాయన 'నేను విద్యను అమ్ముకొనే వాణ్ణికాను' అని నిష్కర్షగా సమాధానమిచ్చారు. (ఆహా! ఎలాంటి కాలమది! నేడు ట్యూషన్ల పేరుతో ప్రతి వీధిలో అధ్యాపకులు దుకాణాలు తెరిచి విద్యను అమ్ముకుంటున్నారు) క్లుప్తంగా చెప్పొచ్చిందేమంటే ఆయన విద్య నేర్పినందుకు గురుదక్షిణగా ఎలాంటి ప్రతిఫలాన్ని స్వీకరించేవారు కాదు. ఆ

తరువాత నేను ఢిల్లీలో 'అల్ జమియత్' పత్రిక సంపాదకునిగా పనిచేస్తున్న కాలంలో "ఇంకొన్ని పుస్తకాలు చదవకుండా ఉండిపోయాయి, వాటిని తమవద్ద చదవాలను కుంటున్నాను" అని చెప్పగానే 'సరే'నన్నారు. ప్రాత:కాలం అజాన్ సమయానికి మా ఇంటికొచ్చెయ్'అంటూ సమయం కూడా నిర్ధారించారు. ఆయనగారి ఇల్లు మా ఇంటికి చాలా దూరంలో దాదాపు ఒకటిన్నర మైళ్ళు (రెండు కిలోమీటర్లు). తుర్క్‌మాన్ గేటుదగ్గర గానుగవారి వీధిలో ఉండేది. నేను క్రమం తప్పకుండా, ప్రాతఃకాలం అజాన్ సమయానికల్లా ఆయన ఇంటికి చేరుకునేవాణ్ణి. ఏదో ఒకరోజు ఆయన మూడ్ బాగా లేనప్పుడు (చదివించటానికి ఇష్టం లేనప్పుడు) లోపలినుండే, సయ్యద్ బాద్‌షా! నేడు పాఠం చెప్పటానికి మనసొప్పడం లేదు. రేపురా!' అని చెప్పేవారు.

దాదాపు అదే కాలంలో ఢిల్లీకి చెందిన ఒక 'కర్‌ఖందార్' (పారిశ్రామిక వేత్త) తన కుమారులకు కూడా చదువు చెప్పాలని మౌలానా అబ్దుస్సలాం నియాజీగారిని కోరాడు' మీరు అందరికీ చదువుజెబుతారు, కాని నా కుమారులకే చదువు చెప్పరేంటి?' అని అడిగాడు. దానికి మౌలానా గారు 'నీ కొడుకుల బుర్రలో అసలు మెదడే లేకపోతే నేనేం చేసేది? వారిని కిరాయి తొత్తుల (ట్యూషన్ చెప్పేవారి) దగ్గరికి పంపు. నేనైతే వారికి చదువు చెప్పలేను' అంటూ నిర్మొహమాటంగా సమాధానమిచ్చారు.

మౌలానా గారు 'చిష్తియా' పరంపరతో సంబంధాలు కలిగి ఉండేవారు. తన పేరుచివర 'నియాజీ' అనే పేరును కూడా 'బరేలీ'కి చెందిన నియాజ్ అహ్మద్ బరేల్వీ(రహ్మ)పట్ల గల భక్తిభావంతో పెట్టుకున్నదే. భారతదేశంలోని 'చిష్తియా' పరంపరకు మా కుటుంబం పురోగామి కనుక వయస్సులో పెద్ద వారు, గురువు అయినా కూడా ఆయన నన్ను అత్యధికంగా గౌరవించేవారు. ఈ కారణంగానే నన్ను పేరుబెట్టి పిలువకుండా 'సయ్యద్ బాద్‌షా' అంటూ సంబోధించేవారు."

ఇది 1924నాటి విషయం. అబ్బాజాన్ రాత్రి మూడవజామున మేల్కొని, మొగలు చక్రవర్తి షాజహాన్ కాలంనుండి ఉంటూ వస్తున్న ఢిల్లీలోని ప్రాచీన వీధి అయిన 'కోచయె- పండిట్'నుండి నడిచి, మౌలానా నియాజీ గారింటికి వెళుతుండేవారు. ఆ కాలపు భారతదేశంలో, విజ్ఞాన శాస్త్రం (అనగా ఫిలాసఫీ, తర్కం మరియు గణితం)లో ఆయనకు సరితూగ గల వ్యక్తి వేరె వ్వరూ లేరని ప్రతీతి. స్వతంత్ర భావాలు కలిగిన వ్యక్తి. జీవితంలో ఎవరివద్దనూ ఉద్యోగం చేయలేదాయన. అత్తరు తయారుచేసి, తమ భుక్తిని సమకూర్చు కునేవారు. ఖాన్‌ఖాహ్‌లలో ఖవాలీలు వింటుండేవారు. విద్యాబోధనకు ఎలాంటి ప్రతిఫలాన్ని స్వీకరించేవారు కాదు. దైవం ఇలాంటి అపురూపమైన గురువును అబ్బాజాన్ విద్యాసంస్కరణలకోసం ఉపయోగించాడు. అబ్బా జాన్‌కు దేవ్‌బంద్‌లోగాని, నద్వతుల్ ఉలమాలోగాని, 'మజహరుల్ ఉలూం'లోగాని విద్యనభ్యసించే అవకాశం లభించలేదు. దాదాజాన్ (తాత గారు) పరమపదించిన కారణంగా ఆయన అలీగఢ్ ముస్లిం యూనివర్శిటీకి కూడా వెళ్ళలేకపోయారు. ఆయన ఏ ధార్మిక విద్యాలయంలోగాని, ఏ యూనివర్శిటీలోగాని విద్యనభ్యసించలేదనే కారణంగా అనేకమంది ఉల మాలు ఆయన్ను ధార్మికవేత్తగా స్వీకరించటానికి నిరాకరించారు. కాని ఆ దైవలీల ఏమిటో చూడండి! ఎవరినైతే ధార్మికవేత్తగా గుర్తించటానికి కూడా నిరాకరించడం జరిగిందో, నేడు ప్రపంచంలోని గొప్పగొప్ప యూనివర్శిటీల్లో ఆయన రచించిన గ్రంథాలపై, ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతాలపై, ఆయన తెచ్చిన 'ఉద్యమం'పై రీసెర్చిలు జరుగుతున్నాయి. పరిశోధనాత్మక వ్యాసాలూ వ్రాయబడుతున్నాయి.

పాకిస్తాన్ ఏర్పడిన తరువాత మౌలానా అబ్దుస్సలాం నియాజి శిష్యు డొకరు పాకిస్తాన్‌కు వెళ్ళేముందు తన గురువు గారైన మౌలానా అబ్దుస్సలాం నియాజి గారి వద్దకు ఢిల్లీ వచ్చి ఆశీర్వాదం పొందారు. అప్పుడు మౌలానా నియాజి తన శిష్యున్ని సాగనంపుతూ ఇలా అన్నారు:

'లాహోర్ వెళితే అక్కడ నాకు శిష్యులైన ఇద్దరు సోదరులున్నారని జ్ఞాపకముంచుకో. సయ్యద్ అబుల్ ఖైర్ మౌదూది (25.12.1899 - 28.8.1979) పెద్దవాడు, సయ్యద్ అబుల్ ఆలా మౌదూది చిన్నవాడు. వారిని తప్పకుండా కలుసుకో. మొదట చిన్నవాని దగ్గరికి, ఆ తరువాత పెద్దవాని వద్దకు వెళ్ళు. ఆ తరువాత 'లా ఇలాహ ఇల్లల్లాహ్' అనేపదానికి అర్థం ఏమిటో ఆలోచించు.

మౌలానా నియాజి మాట్లాడే తీరే అది.

ఇక రండి! ఆ ఇంటిలోనికి ప్రవేశించి ఆ ఇంటివాసులెలాంటి వారు, వారెలా జీవిస్తున్నారో కాస్త పరిశీలిద్దాం. ఆ ఇంటి యజమాని గురించి సమకాలీన ఓ గొప్ప వ్యక్తిత్వం వెల్లడించిన అభిప్రాయం ఏమిటో చెవులారా ఇదివరకే విని ఉన్నాం. ఇక మహాకవి 'అల్లామా ఇక్బాల్' పలికిన ఈ కవితా భావాన్ని కూడా అర్థం చేసుకోండి.

'సతతం ఒక విశ్వాసి యొక్క ఠీవి, దర్పాలు మారుతూ ఉంటాయి అనే రహస్యం ఎవరికెరుక? మాటల్లోనైనా, చేతల్లోనైనా అతను దేవుని ఒక దృష్టాంతమే. అనగా అతను ఖుర్ఆన్ పాఠకుడుగా కనబడినప్పటికీ యదార్థంగా మూర్తీభవించిన ఖుర్ఆనే, ఈ సత్యం ఎవరికి తెలుస్తుంది?'.

1926 డిసెంబర్ నెల చివరితేదీల్లో 'శుద్ధి ఉద్యమ' వ్యవస్థాపకుడైన స్వామీ శ్రద్ధానంద్, ఒక ముస్లిం (ఖాజీ అబ్దురషీద్ రహ్మ) చేతిలో వధించబడ్డాడు. ఈ హత్యపై కొందరు హిందూ సోదరులు ఓ దుమారమే లేవదీశారు. ఇస్లాం కేవలం రక్తపాతాన్నే ప్రోత్సహిస్తుందని ప్రచారం చేయసాగారు. అయితే మహాత్మాగాంధీ కూడా ఈ హత్యపట్ల తమ తీవ్ర నిరసనను తెలుపుతూ ఇస్లాంను సైతం విమర్శించారు.

ఈ విషయాన్ని అబ్బాజాన్ ఇలా వ్రాశారు.

"ఈ అల్లకల్లోలం కారణంగా ఒక సుదర్ఘీకాలం వరకు అనిశ్చిత పరిస్థితి ఏర్పడింది. చివరికి ఈ కలకలానికి, విమర్శలకు విసుగెత్తిన మౌలానా ముహమ్మద్ అలీ జౌహర్(రహ్మ) (నిర్యా 4-1-1931) ఢిల్లీలోని జామా మస్జిద్‌లో

జుమా ప్రసంగం ఇస్తూ, గద్గద స్వరంతో 'వీరు చేస్తున్న ఈ విమర్శలకు జవాబుగా ఇస్లాంలో 'జిహాద్'కు నిజమైన భావన ఏమిటో, జిహాద్‌పై లేవనెత్తిన అభ్యంతరాలకు ధీటైన, సముచితమైన, సైద్ధాంతిక పంథాలో సమాధాన మివ్వడానికి ఎవరైనా నడుము బిగిస్తే ఎంత బాగుండేది' అని తన ఆవేదనను వ్యక్తం చేశారు. ఆ ప్రసంగాన్ని వింటున్నవారిలో నేనూ ఒకణ్ణి. నమాజ్ ముగిసిన తరువాత జామ మస్జిద్ మెట్లు దిగుతూ, ఇంకెవరైనా ఈ పనికి ముందుకు వస్తారో లేదో తెలియదు. కనీసం నేనైనా అల్లాహ్ నామం పలికి ఆ పనికి ఎందుకు ఉపక్రమించకూడదు? అని ఆలోచించసాగాను."

ఢిల్లీనుండి వెలువడే 'అల్ జామియత్' పత్రికలో 1927నుండి అబ్బాజాన్ 'అల్‌జిహాద్ ఫిల్ ఇస్లామ్' అనే శీర్షికతో వ్యాసాల పరంపరను ప్రారంభించారు. ఎప్పుడైతే సుదీర్ఘమైన ఈ చర్చకు పత్రిక పరిమిత పుటలు చాలవనే నిర్ణయానికి రావటం జరిగిందో, ఈ చర్చకోసం ప్రత్యేకంగా ఒక పుస్తకాన్నే రూపొందించటం జరిగింది. ఆ సమయంలో అబ్బాజాన్ వయస్సు కేవలం 24సంవత్సరాలు. ఈ ఉద్గ్రంథంలో జిహాద్ వాస్తవికత ఏమిటి? దీని అవసరమేమిటి? దీనికిగల ప్రాముఖ్యత ఏమిటి? ఇత్యాది విషయాల్ని పరిశోధనాత్మకంగా విశదీకరించి తేటతెల్లం చేశారు. ఈగ్రంథంలో ఆయన వివిధ ధర్మాల్లో గల యుద్ధభావనల తులనాత్మక అధ్యయనాన్ని కూడా సమర్పించారు.[1] ఇస్లామీయ జిహాద్ అనేది దైవమార్గంలో సత్యం, న్యాయం కోసం క్రమబద్ధీకరించిన, కట్టుదిట్టమైన నిరంతర ప్రయత్నమేనని నిరాకరించ లేని దృష్టాంతాల ద్వారా నిరూపించారు. ఇది దురాక్రమణ చేసి దోపిడీకి పాల్పడుతూ, హింసా దౌర్జన్యాలతో కూడిన సర్వసంహారం ఎంత మాత్రం కాదు. ఇది పీడితుల విముక్తి, వారి రక్షణకోసం చేపట్టే చర్య. రహస్య విచ్ఛిన్నకర

---

*1. అల్‌జిహాద్ ఫిల్ ఇస్లామ్- రచన : సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ, ప్రకాశకులు: దారుల్ ముసన్నిఫీన్, ఆజంగఢ్ (యు.పి) ప్రథమ ప్రచురణ : 1930)*

కార్యం కాదు, ఇది అండర్ గ్రౌండ్‌లో నడిచే రహస్య ఉద్యమం కాదు. ప్రగతి, నిర్మాణాల కోసం చేపట్టే చివరి ప్రయత్నం. ఇది యుద్ధం, శాంతికి సంబంధించిన ఇస్లామీయ చట్టం. ఒక ముస్లిమ్ ముజాహిద్ శత్రువుకు కూడా రక్షకుడుగా, శరణమిచ్చువాడుగా శత్రు ప్రదేశంలోకి అడుగు పెడతాడు. అతను పట్టుబడిన వారిపట్ల కూడా మానవత్వంతో వ్యవహరిస్తాడు. పిల్లలు, స్త్రీలు, వృద్ధులు, రోగులపై చేయి లేపడు. ఇంకా ఆరాధనాలయాల్ని అన్నివిధాలుగా సంరక్షిస్తాడు.

ఇస్లామీయ జిహాద్‌కు సంబంధించిన ఈ నిజమైన భావన, ఆ కాలంనాటి అగ్రరాజ్యాలకు సభ్యత, మానవీయ విలువల్ని నేర్పి ఎలా సంస్కరించిందో, నేటి ఆధునిక అగ్రరాజ్యాలకు కూడా మానవత్వాన్ని, మానవీయ విలువల్ని ప్రసాదించగలుగుతుంది. యుద్ధం, శాంతికి సంబంధించి జెనీవా కన్వెన్షన్‌గాని, ఐక్యరాజ్యసమితిలోని భద్రతా సంఘం గాని సభ్యతా, మానవీయ విలువలకు సంబంధించి ఏ చట్టాలనైతే ఆమోదించాయో అవన్నీ కూడా ఈ ఇస్లామీయ జిహాద్ నియమాలు, సూత్రాల నుండే గ్రహించబడ్డాయనేది నిరాకరించలేని వాస్తవం.

ఇస్లామీయ జిహాద్‌కు వ్యతిరేకంగా యూదులు, క్రైస్తవులు ఇంకా ఇతర ముస్లిమేతరులు లేవదీసిన అసత్య, ద్వేష దౌర్జన్యపూరితమైన ప్రచారానికి ధీటైన జవాబు ఇవ్వబడిందీ పుస్తకంలో. వాస్తవం ఏమిటంటే గడిచిన కాలంలోనూ ఇది చర్చనీయాంశంగా ఉండేది. నేటి మనకాలంలో కూడా ఈ అంశం గురించే అత్యధికంగా చర్చించడం జరుగుతున్నది. కాని విచారించదగ్గ విషయం ఏమిటంటే దీని అసలు వాస్తవికతను ముస్లింలు, ముస్లిమేతరులు ఉభయులూ సంపూర్ణంగా అర్థం చేసుకోలేకపోయారు. 'అల్‌జిహాద్ ఫిల్ ఇస్లామ్' పుస్తక రూపంలో ప్రచురించబడి ఎప్పుడైతే ప్రజల చేతుల్లోకి వచ్చిందో, 'ఇక్బాల్ కవీశ్వరుని'లాంటి విద్వాంసులు సైతం ప్రభావితం కాకుండా ఉండలేకపోయారు. ఈ పుస్తకంపై ఆయనిలా వ్యాఖ్యానించారు.

"ఇస్లాంలోని జిహాద్ సిద్ధాంతం ఏమిటో యుద్ధం- శాంతికి సంబం ధించిన సూత్రాలేమిటో తెలిపే ఇదో చక్కని గ్రంథం. విద్యాజ్ఞానాల పట్ల అభిరుచిగల ప్రతి వ్యక్తి దీన్ని చదవాలని నేను సలహా ఇస్తున్నాను."

అనుపమానమైన తత్వవేత్త, కవి, ఇస్లామీయ విధ్వాంసుడు అయిన అల్లామా ఇక్బాల్‌తో 'అబ్బాజాన్'కు పరిచయం ఏర్పడడానికి ఈగ్రంథం దోహద పడింది. ఇద్దరి నడుమ సంబంధాలు ఏర్పడ్డాయి. చివరికి అబ్బాజాన్‌ను, లగ్న మనస్సుతో, ఏకాగ్రతతో, జిహాద్, ఇజ్‌తెహాద్ మరియు విద్యాశిక్షణలకు సంబంధించిన సర్వ కార్యక్రమాలను ప్రశాంతంగా నడుపుకోవడానికి లాహోర్ రావాల్సిందిగా అల్లామా ఇక్బాల్ ఆహ్వానించడమూ జరిగింది.[2]

ఈ పిలుపులోని మర్మం గురించి ఆలోచించినప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. ఒక సంవత్సరం తరువాత అల్లామా ఇక్బాల్ పరమపదించారు. (తేది 21-4-1938) ఆవిధంగా ఏర్పడబోయే ఖాళీని భర్తీచేసే భాగ్యాన్ని దైవం ముందే అబ్బాజాన్‌కు కేటాయించి ఉంచాడా? అనిపించకమానదు.

ఈ లాహోర్ నేల కూడా అత్యంత విచిత్రమైనది. అదెప్పుడూ సూఫీలు, పుణ్యపురుషులు, సన్మార్గులు, ధర్మనిష్టులు లేకుండా ఒట్టిపోలేదు. సయ్యద్ అలీ హుజ్‌వేరి(రహ్మ) (1009- 1072) పేరుమోసిన ప్రఖ్యాత ధార్మిక గురువుల్లో లెక్కింపబడతారు. ఈ దేశంలోని ఓ పెద్దసంఖ్య ఆయనపట్ల భక్తిశ్రద్ధలు కలిగి

---

❖ *2. డాక్టర్ జావీద్ ఇక్బాల్ రచించిన 'జిందహ్‌రూద్' 3వ భాగం పేజి. 613*

❖ *సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ : మౌదూదీ గారి ఉత్తరాలు- రెండవ భాగం (నియాజ్ అలిఖాన్ పేర, పేజి.41, 154 మరియు సయ్యద్ నజీర్ నియాజి పేర, పేజి.180-192 సంకలనం - రఫీయుద్దీన్ హాష్మి మరియు సలీమ్ మన్సూర్ ఖాలిద్)*

❖ *జమాఅతె ఇస్లామీ చరిత్ర మొదటి భాగం, రచన : ఆబాద్ షాపూరి*

❖ *ఇక్బాల్, దారుల్ ఇస్లాం మరియు మౌదూదీ, రచన : అసద్ గీలాని*

ఉన్నారు. ఖాజా నిజాముద్దీన్ ఔలియా(రహ్మ) నిర్యా: 1335) ఇలా ఉల్లేఖిస్తున్నారు : 'సయ్యద్ హుజ్‌వేరి తన గురువుగారి ఆదేశానుసారం దైవధర్మ ప్రచార నిమిత్తం సుల్తాన్ మహ్‌మూద్ గజ్‌నవి (నిర్యా: 8-4-1030) కుమారుడైన నాసిరుద్దీన్ మస్‌ఊద్ (నిర్యా: 1040) కాలంలో లాహోర్ వచ్చారు. ఆయనకంటే ముందే ధార్మికపంథాలో సోదరుడు, ఆయన గురువు గారి ప్రియశిష్యుడు అయిన హుసేన్ జన్జానీ(రహ్మ) ఇక్కడ ధార్మిక సేవకు నియుక్తులై ఉన్నారు. ఎప్పుడైతే సయ్యద్ అలిహుజ్‌వేరీ (రహ్మ)ని లాహోర్ వెళ్ళటానికి ఆదేశించటం జరిగిందో, ఆయన తమ గురువుగారితో అక్కడైతే హుసేన్ జజ్జానీ (రహ్మ) ఉండనే ఉన్నారు కదా! నా అవసరమేముంటుందని' గురువు గారిని అడిగారు.

"లేదు. నీవు వెళ్ళాల్సిందే" అంటూ గురువుగారు తిరిగి ఆదేశించారు. గురువు ఆదేశానుసారం ఆయన లాహోర్‌కు చేరుకున్నారు. అయితే అప్పటికే చీకటిపడినందు వల్ల కోటద్వారాలు మూసివేశారు. అందుకని ఆయన కోటవెలువల, పట్టణం బయటనే రాత్రి గడపాల్సి వచ్చింది. తెల్లారగానే కోట తలుపులు తెరువబడ్డాయి. ఆ ద్వారంనుండి మొట్టమొదటగా బయటికి వచ్చింది హుసేన్ జన్జానీ(రహ్మ) శవపేటిక. సయ్యద్ అలిహుజ్‌వే(రహ్మ)గారు లాహోర్‌ను ప్రజల శిక్షణ, హితోపదేశాల కేంద్రంగా మార్చుకున్నారు. చివరికి ఆయనగారు అక్కడే ఖననమయ్యారు కూడా.

ఇదేవిధంగా ఎన్నో శతాబ్దాలు గడిచిన తరువాత ఇదే లాహోర్‌లో ఇంకొక దైవభక్తుడు, దైవదాసుడు అరుదెంచాడు. ఆ వ్యక్తి ధర్మనిష్ఠాపరుడు, దైవోపాసకుడు, నిర్భయుడు, మృత్యుంజయుడై ప్రతి హృదయంలో దేవుని నిజధర్మం పట్ల పేరుకుపోయిన శంకలు, అనుమానాలు, అసంతృప్తుల పెను భూతాన్ని పారద్రోలేవాడు. వారిలోతృప్తిని, మమకారాన్ని, ఆత్మవిశ్వాసాన్ని ప్రేరేపిస్తూ, ఇస్లామీయ ధర్మాన్ని ఒక సజీవ జీవనవిధానంగా వ్యాపింప జేయడానికి కంకణం కట్టుకున్నవాడు. బహుముఖమైన ఒక ఉద్యమాన్ని లేపుతాడు. ఇక్కడి ప్రజల జీవన రంగాలన్నింటినీ ప్రభావితం చేసిన పాశ్చాత్య

విషసంస్కృతిని, దాని బహుముఖమైన ప్రభావాల్ని, పరిణామాల్ని దూరపర్చ డానికి నడుం బిగించినవాడు. ఇక్కడి సామాజిక, రాజకీయ, విద్యాపరమైన అన్నిరంగాల్లో సకారాత్మక విధానంలో పనిచేస్తూ ఒక నీతివంతమైన, శాంతి పూర్వకమైన విప్లవానికి నాందివాచకం పలికినవాడు. ఇదే విషయం గురించి అబ్బాజాన్ ఇలా అనేవారు.

"పాశ్చాత్య దేశాలతో ముస్లింలు రాజకీయంగా, సైనికపరంగా ఓడి పోయారంటే ఫరవాలేదు, కాని వారు పాశ్చాత్య సభ్యతా సంస్కృతులకు, పాశ్చాత్య ఆలోచనాసరళికి వారి ఫిలాసఫీకి కూడా దాసోహమనడం అత్యంత ప్రమాదకర పరిణామం. పాశ్చాత్యుల రాజకీయ పెత్తనం కేవలం వారి శరీరాల్ని మాత్రమే వశపరుచుకోగలిగింది. కాని వారి సాంస్కృతిక, సైద్ధాంతిక దాడివల్ల ముస్లింల మనోమస్తిష్కాల్లోనూ, ఆలోచనా సరళిలోనూ తీవ్రమైన పరివర్తన, సంచలనం ఏర్పడింది. ఆంగ్లేయుల విద్యాసాహిత్యం, ఫిలాసఫీ, సభ్యతా సంస్కృతుల కారణంగా, ముస్లింలలో వారిని సంపూర్ణంగా అనుకరించే ఒక వర్గం ఏర్పడింది. పాశ్చాత్యులు గీసిన గీతను దాటి తాము స్వతంత్రంగా జీవించగలం అనే కనీస ఊహకైనా నోచుకోని మానసిక దాస్యానికి గురై పోయిన వర్గం వీరిది."

ఉస్మానియా యూనివర్శిటీలో తనను నియామకం చేస్తామని వచ్చిన అవకాశాన్ని 'అబ్బాజాన్' కేవలం తన సిద్ధాంతాల కారణంగా తృణీకరించారు. నిజం చెప్పాలంటే అప్పుడు ఆయన ఆర్థికంగా ఎంతో ఇబ్బందిని ఎదుర్కొం టున్న కాలం.

'అల్ జిహాద్ ఫిల్ఇస్లామ్' రచనకు పూర్వం ఆయన భగవద్గీత, రామాయణం, మహాభారతాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. బైబిల్ మరియు తల్మూద్ గ్రంథాల్ని కూడా చదివారు. ఆ కాలంలోనే మౌలానా అష్ఫాఖుర్ రహ్మాన్ కాన్ధల్వి(రహ్మ)గారి వద్ద 'జామయె తిర్మిజి', 'ముఅత్తా ఇమాం మాలిక్' గ్రంథాల అధ్యయనం కూడా కొనసాగింది. కాబట్టే ఇంత విజ్ఞానాన్ని ఆర్జించిన ఆయన బహుముఖమైన అనేకగ్రంథాల రచయితగా

పేరుప్రఖ్యాతులను గాంచారు. ఖుర్ఆన్, హదీస్, ఫిఖహ్ (ధార్మిక విష యాలు), ఇస్లామీయ చరిత్ర, రాజకీయాలు, ఆర్థికాలు, సామాజికంలాంటి రకరకాలైన విభిన్న అంశాలపై 'అబ్బాజాన్' కలాన్ని ఎత్తారు. అత్యధిక సంఖ్యలో పుస్తకాలు వెలువరించినా, ఒకే స్థాయిని, ప్రమాణాన్ని కాపాడుతూ వచ్చారు. దీనితోపాటుగా అరబిక్ కవితా సాహిత్యంపై తత్వ, తర్కశాస్త్రాలపై కూడా గట్టి పట్టుగలిగి ఉండేవారాయన. ఇవన్నీ ఒక ఎత్తైతే ఆత్మసంతృప్తి, దైవనిర్ణయానికి రాజీపడడం, ప్రశాంత హృదయంలాంటివి దైవం ఆయనకు ప్రసాదించిన ప్రత్యేక వరాలు.

అవిశ్వాసం, నాస్తికత్వపు పెనుతుఫానులో, నమ్మకం, విశ్వాసాల ఒక్కొక్క దీపం ఆరిపోతూఉంటే, అబ్బాజాన్ అచంచల విశ్వాసంతో తన విశ్వాస దీపికను ఆరిపోకుండా కాపాడుకోవడమొక్కటే కాదు, ఆధునిక విద్యావంతుల పాశ్చాత్య ఆలోచనాసరళిని, భావదాస్యాన్ని సంపూర్ణంగా మార్చి వేశారు. పాశ్చాత్య సభ్యతా సంస్కృతులకు అత్యధికంగా ప్రభావితులై మానసిక దాస్యానికిలోనై ఉన్న విద్యాధికులను దాన్నుండి విముక్తి కలిగించారు. యువతరానికి తమ ధర్మం పట్ల గర్వపడేటట్లు చేసి వారిలో ఆత్మసంతృప్తిని నింపారు. నేటి యువతరం తన ధర్మాన్ని గురించి సిగ్గుపడడం లేదు, సంజా యిషి ఇచ్చుకోవడం లేదు. దానికి బదులు వారిలో ఆత్మవిశ్వాసం పెరిగి పోయింది. తమ ధర్మాన్ని తార్కికంగాను, వైజ్ఞానికంగాను సాక్ష్యాధారా లతో సమర్థించే ఆత్మవిశ్వాసం, ధైర్యం, ధీరత్వం వారిలో వచ్చాయంటే అవన్నీ అబ్బాజాన్ రచనల ప్రభావమే. విద్యాధికులైన యువకుల్ని తమ ధర్మంపై గర్వపడడం నేర్పారాయన. 'తఫ్హీముల్ ఖుర్ఆన్' ద్వారా యువ తరాన్ని ఖుర్ఆన్‌తో పరిచయం చేసి దానితో దృఢసంబంధాన్ని ఏర్పరిచి వారి జీవితాల్లో ఓ విప్లవాన్ని సృష్టించారు. అల్లామా ఇక్బాల్ మాటల్లో చెప్పాలంటే, 'ఈ ఖుర్ఆన్ హృదయంలో దిగిపోయినప్పుడు, మనిషే మారిపోతాడు. ఇక ఎప్పుడైతే మనిషి మారిపోతాడో, ఈ సర్వప్రపంచమే మారిపోతుంది'

ప్రతి కాలానికి ఏదో ఒక ప్రత్యేకమైన ఉపద్రవం ఉంటూ వచ్చిందే. మన కాలంలో విద్యాజ్ఞానాలు ఒక గొప్ప ఉపద్రవం రూపంలో సాక్ష్యాత్కరిస్తున్నాయి. ఏదైనా ఒక రంగంలో విద్యనార్జించి, పట్టా పుచ్చుకున్న ప్రతి యువకుడు, తనకు తాను 'అరిస్టాటిల్'గానో లేక ఇంకెవరైనా మహాతత్వజ్ఞానితోనో పోల్చుకోవడం పరిపాటైపోయింది. ధార్మికవిషయంలో కూడా అసలతను ఎవ్వరినీ ఖాతరుచేయడు. కాని అలాంటి యువకులు 'అబ్బాజాన్' పుస్తకాలు చదివిన తరువాత తామెంత లోతులో ఉన్నామో, తమ సామర్థ్యం ఎంతో బాగా అర్థం చేసుకున్నారు. తామెంతో, తమ విలువెంతో, తమ జ్ఞానపరిధి ఏపాటిదో అప్పుడుగాని వారికి అర్థంకాదు. అయితే అలాంటి ఉద్గ్రంథాలు, జీవితాల్లోనే విప్లవం తెచ్చిపెట్టే అలాంటి రచనలు ఊరికే ఉనికిలోకి వస్తాయా? ప్రజలంతా, ప్రపంచమంతా నిద్రాసుఖాన్ని అనుభవిస్తున్నప్పుడు, రాత్రంతా మేల్కొని తన యవ్వనాన్ని, తన జీవితాన్ని, జీవిత సుఖాన్ని ధారపోసి ముస్లిం సముదాయానికి ఇహపరాల్లో సాఫల్యాన్ని చేకూర్చే ఇలాంటి పుస్తకాల్ని రచించడంలో నిమగ్నమై ఉండేవారు అబ్బాజాన్.

# 2. అబ్బాజాన్ వివాహం

అమ్మీజాన్ (మర్హూమా మహమూదాబేగం) తన పన్నెండవ ఏట ఒక కలగన్నారు. ఆమె తన కల గురించి చెబుతూ 'నేను తడి ఇసుకతో గుజ్జన గూడు తయారుచేశాను. ఆ గూటిలో చేయివేసి తడమగా నా చేతికి ధగధగలాడే ఓ వజ్రం తగిలింది. అదిచూసిన ప్రజలు నలువైపులనుండి నా దగ్గరికి పరుగెత్తుకొచ్చారు. ఇదెంతో విలువైన వజ్రం! నీకెక్కడ దొరికింది?' అంటూ ప్రశ్నల వర్షం కురిపించసాగారు. ఒకరైతే ఇది అమూల్యమైన వజ్రం. ఎవరైనా లాక్కోకుండా దీన్ని జాగ్రత్తగా కాపాడుకో' అంటూ సలహా ఇచ్చారు. తెల్లారిన తరువాత అమ్మీజాన్ ఈ స్వప్నాన్ని నానాఅబ్బా (తాతగారు) సయ్యద్ నసీరుద్దీన్ షమ్సిగారికి వినిపించారు. ఈ స్వప్నాన్ని ఇంకెవరికీ తెలుపవద్దని నానాఅబ్బా,

అమ్మీజాన్‌కు తాకీదుచేసి తాను మాత్రం ఢిల్లీకి చెందిన ఒక ఉద్దండ విద్వాంసుని వద్దకెళ్ళి, ఆ కలకు అర్థం చెప్పాల్సిందిగా కోరారు.

'ఒక ధార్మికవేత్తతో ఈ అమ్మాయి వివాహం జరుగుతుంది. అతని ఖ్యాతి ప్రపంచం నలుమూలల్లో వ్యాపిస్తుంది' అంటూ ఆయన ఆ కలకు అర్థం తెలిపారు.

'నానాఅబ్బా' ఆర్థికంగా మంచిస్థితిలో ఉండడమే కాకుండా, ఢిల్లీకి చెందిన ప్రముఖులు, గౌరవనీయుల్లో ఒకరుగా పరిగణింపబడేవారు. ఈ కారణంగానే 'అమ్మీజాన్'కు ఢిల్లీకి చెందిన సంపన్న, ఉన్నత, పలుకుబడిగల ఎన్నో కుటుంబాల నుండి వివాహ సంబంధాలు వచ్చాయి. కాని నానాఅబ్బాకు అవేవి నచ్చలేదు. కాని ఎప్పుడైతే 'దాదిఅమ్మా' (నానమ్మ) అబ్బాజాన్ సంబంధం తీసుకొని నానాఅబ్బా ఇంటికి వచ్చారో, నానాఅబ్బా చిరకాల వాంఛ తీరినట్లయింది.

ఆ కాలంలో అబ్బాజాన్ అత్యధిక సమయం ప్రయాణాల్లోనూ, ఒకచోటినుండి మరోచోటికి మకాం మారడంలోనూ గడిచిపోతుండేది. అంతే కాకుండా ఆర్థికంగానూ ఆ సమయంలో ఆయన అనిశ్చితస్థితిలో ఉన్నారు. అబ్బాజాన్ నిర్మోహమాటంగా వాస్తవాలను వెల్లడించే వ్యక్తి. అందుకని ఆయన వివాహానికి ముందే 'నానాఅబ్బా'తో తన భవిష్యత్ కార్యక్రమాన్ని వివరిస్తూ, 'నా లక్ష్యం ఇది, నా లక్ష్యంపట్ల నేనసలే రాజీపడేదిలేదు. అన్నీ ఉండి దరిద్రావతారం ఎత్తడం నాకు ఇష్టంలేదు. అందుకని దైవం కృపదలిస్తే మంచి ఇల్లు కూడా కట్టుకుంటాను. కాని ఒకవేళ దైవం నాకు ఆర్థిక సమృద్ధి ప్రసాదించక పోయినా నేను నా కార్యాన్ని, నా లక్ష్యాన్ని మాత్రం విడనాడను అని అనడం జరిగింది. మా నానాఅబ్బా గారి తండ్రి (పితామహులు) ఒక ఉత్తరం రాసి అబ్బాజాన్‌కు దీని సమాధానం ఇచ్చారు. ఆ సమాధానం పంపే ముందు దాన్ని మా నానాఅబ్బాకు, నానీఅమ్మాకు, అమ్మీజాన్‌కు వినిపించారు. మా అమ్మీజాన్ చెప్పినట్లు, ఆ ఉత్తరంలో ఆయనిలా వ్రాశారు. 'మా బిడ్డ మహలులోనైనా నీకు

తోడుగానే ఉంటుంది. గుడిసెలో ఉన్నా నీతోనే గడుపుతుంది' అని. అమ్మీ జాన్ అప్పుడప్పుడు ఇలా చెబుతుండేవారు. "ఆరోజు దాదాఅబ్బా పలికిన ఆ వాక్యాలు జీవితాంతం నా చెవుల్లో మ్రోగుతూనే ఉన్నాయి. అవి నా పట్టుదలకు సంకల్పానికి ఎనలేని బలాన్ని చేకూర్చి పెట్టాయి."

1937 మార్చి 15వ తేదీన ఢిల్లీలో అబ్బాజాన్ వివాహం జరిగిపోయింది. రెండువేల రూపాయలు మహర్‌గా నిర్ణయించారు. ఆ సందర్భంలో అబ్బాజాన్, 'మహర్ అనేది తీర్చడానికనే నిర్ణయించబడుతుంది. అందుకని ఇంతకు మించిన మహర్‌ను తీర్చేస్థోమత నాలో లేదు'అని అనడం జరిగింది. అబ్బా జాన్ వారి తరపున ఒక చీర, ఒక ఉంగరం వధువుకు కానుకగా సమర్పించ బడింది. ఆ కాలంలోని ఢిల్లీ మర్యాదస్తులు, గొప్పింటివాళ్ళలో సామాన్యంగా లక్షా, లక్షాపాతిక వేల రూపాయలు మహర్‌గా నిర్ణయించే ఆనవాయితి ఉండేది. కాని దీన్ని తీర్చాలనే ధ్యాసగాని, ఆచారంగాని ఉండేదికాదు.

# 3. దారుల్ ఇస్లాం

'జమ్మూ' పర్వతశ్రేణి సమాప్తమైన ప్రదేశంలోనే పఠాన్‌కోట్ అనే నగర ముంది. దాని పరిసరాల్లోనే 'సర్‌నా' అనే గ్రామముంది. దాన్ని ఆనుకునే చౌదరీ నియాజ్ అలీఖాన్ (నిర్యా: 1976 ఫిబ్రవరి24, జౌహరాబాద్)గారికి చెందిన ఓ సువిశాలమైన భూమి ఉండేది. అల్లామ ఇక్బాల్ సలహాను అనుసరించి ఆయన అక్కడో ట్రస్ట్‌ను ఏర్పాటుచేశారు. 'అబ్బాజాన్' ఈ ట్రస్ట్‌కు 'దారుల్ ఇస్లామ్' అనే పేరుపెట్టారు.

కొన్ని సంవత్సరాల వరకు నా బాల్యం ఇక్కడే గడిచిపోయింది. నలు వైపులా పచ్చనిచెట్లతో నిండిన ఈ ప్రాంతం సస్యశ్యామలంగాను, అత్యంత మనోహరంగాను కనబడుతుండేది. మా ఇంటికి కొంచెం దూరంలోనే 'మాధవ్ పూర్ హెడ్‌వర్క్స్' ఉండేది. ఎదురుగా కొండలపై మంచు కప్పబడి ఉండేది.

సూర్యోదయం అయిన తరువాత, పొద్దెక్కేకొద్దీ ఈ మంచు తన రంగులు మారుస్తూ పోయేది. ఇక సూర్యుడు పడమటివైపుకు వ్రాలడం ప్రారంభించ గానే మంచు తన పాలవంటి స్వచ్ఛమైన తెల్లదనాన్ని ప్రదర్శిస్తూ క్రమక్రమంగా ముదురు నారింజరంగుగా మారుతూ పోయేది. అలాగే సూర్యాస్తమయం అయిన తరువాత కూడా చాలాసేపటి వరకు సంధ్యా సమయంలో పడమరగా రకరకాల రంగులు కనబడుతూ ఉండేవి. క్లుప్తంగా చెప్పాలంటే, ప్రకృతి సహజ రమణీయ దృశ్యాలు అక్కడ కోకొల్లలుగా కనబడుతూ ఉండేవన్నమాట. పట్టణాల్లోని సౌకర్యాలేవీ అక్కడ లేవు. విద్యుత్ బల్బులు, నీటి సరఫరా కోసం కుళాయిల ఊసే ఎత్తనవసరం లేదు. ఇల్లుకూడా అతిసామాన్యంగా ఉండేది. అయినా, అబ్బాజాన్ తన వనరులు అనుమతించే వరకు సాధ్యమైనంత మట్టుకు అమ్మీజాన్‌కు ఉల్లాసం కలిగించడానికే ప్రయత్నించేవారు. ఢిల్లీలోని ధనిక కుటుంబంలో కళ్ళుతెరిచి, ఆ వాతావరణంలోనే పెరిగి పెద్దదైన మా అమ్మీజాన్, అత్యంత సహనాలతో, ధైర్యసాహసాలతో అత్యంత అహ్లాదకర వాతావరణంలో, నిండు మనస్సుతో మా అబ్బాజాన్‌కు చేదోడువాదోడుగా నిలిచారు. అక్కడికి రాకపోకల కోసం అబ్బాజాన్ ఒక గుర్రాన్ని,బగ్గీని కొన్నారు. తుక్తాబేగ్ అనే ఓ తుర్కిస్తానీ దాన్ని నడుపుతుండేవారు. ఢిల్లీనుండి ఒక వంటమనిషిని కూడా తీసుకొచ్చారు. పిల్లల బాగోగుల్ని చూసుకోవటానికని ఒక ఆయాను ఏర్పాటు చేశారు. పిల్లల విషయంలో ఆమె అమ్మీజాన్‌కు ఎంతగానో సహకరించేది. ఈ ముగ్గురు ఉద్యోగులు కూడా అత్యంత విశ్వాస పాత్రులుగాను, శ్రేయోభిలాషులుగాను మెదులుతుండేవారు. వంటమనిషి పేరు 'మక్బూల్'. ప్రతిరోజు ఉదయమే ఆయాను పిలిచి, ఆ రోజు ఏ వంటకం చేయాలో చెప్పేసేవారు. ఆమె వంట మనిషికి ఆ విషయం తెలిపేది. ఆరోజుకు సరిపడా ఆహార పదార్థాలు అతనికి అప్పగించటం జరిగేది. మధ్యాహ్నం, రాత్రిపూట, వంటమనిషి వంటకాలు చేసి డ్రాయింగ్ రూంకు ఆనుకొని ఉండే రూంలో పెట్టేసేవాడు. ఆ తరువాత ఆయా అవితెచ్చి అమ్మీజాన్‌కు అప్ప గించేది. ఈ వంటిల్లు ఇంటికి కాస్త దూరంలో ఉండేది. అందుకుని మక్బూల్

ఎన్నడూ ఇంటిలోపలికి రాలేదు. తుక్తాబేగ్ కూడా ఎన్నడూ ఇంటి లోపలికి రాలేదు. ఈవిధంగా మా పనిమనుషులు ఎన్నడూ మా ఇంటిలోపలికి ప్రవేశించినట్లు నేను చూళ్ళేదు.

'Road to Mecca రచయిత 'అల్లామ ముహమ్మద్ అసద్' తన సహచరిణి 'మునీరా సాహెబా', పిన్న వయస్కుడైన తనయుడు 'తిలాల్'ను వెంటబెట్టుకొని ఓనాడు దారుల్ ఇస్లామ్‌కు వచ్చారు. వారు మా అమ్మానాన్నల ఆహ్వానంపై వచ్చినవారే. అమ్మీజాన్ తనకు పెళ్ళి సందర్భంలో ఇచ్చిన డిన్నర్ సెట్‌ను బయటికి తీశారు. ఆ కాలంలో కొన్ని కుటుంబాల్లో పరిశుభ్రత దృష్టితో గ్లాసులపై పలుచని రుమాళ్ళను కప్పేవారు. అవి కదిలిపోకూడదనే ఉద్దేశ్యంతో వాటి అంచులకు కృత్రిమ ముత్యాలు వేలాడదీసేవారు. ఈగలు, దోమలు ఆ గ్లాసుల్లో పడకూడదనే ధ్యేయంతోనే ఇదంతా చేయడం జరిగేది. 'మక్బూల్' మంచి రుచికరమైన వంటకాలు చేశాడు. దానితోపాటు అమ్మీజాన్ పరిచిన దస్తర్‌ఖాన్‌ను చూసి అల్లామా అసద్ దంపతులు ఎంతో సంబరపడిపోయారు. తమకిచ్చిన ఈ గౌరవానికి మా అమ్మానాన్నలకు కృతజ్ఞతలు తెలుపుకున్నారు. ఆ రోజుల్లోనే ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ నాయకుడైన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ (నిర్యా: 1964, మే) యొక్క ప్రైవేట్ సెక్రటరీ వ్యాధిగ్రస్తుడై, విశ్రాంతి కోసం తన స్వగ్రామానికి వచ్చాడు. అతని ఊరు 'సర్‌నా'కు సమీపంలోనే ఉండేది. చుట్టుపక్కల ప్రజలు అబ్బాజాన్ గురించి చెప్పుకుంటుండగా విని అబ్బాజాన్‌ను కలువడానికని తన హిందూ మిత్రులతో కలిసి దారుల్ ఇస్లాంకు వచ్చాడు. అబ్బాజాన్‌తో మాట్లాడుతున్న సమయంలో అతను కొన్ని ఘాటైన ప్రశ్నలు వేశాడు. ఇస్లాం మరియు ముస్లింలకు సంబంధించి ఎడతెగని ప్రశ్నల వర్షం కురిపించాడు. కాని అబ్బాజాన్ అతనడిగిన ప్రశ్నలన్నింటికీ ఎలాంటి విసుగు, చిరాకు పడకుండా అత్యంత ప్రశాంతంగా, సావధానంగా, సంతృప్తి కరంగా సమాధానాలిచ్చేసరికి అతను మారుమాట్లాడలేకపోయాడు. అబ్బాజాన్ తర్కం, దృష్టాంతాలతోనేకాక అతనవలంభించిన పద్ధతి అనగా ప్రశ్నల్ని ఎడతెగ కుండా దాడిరూపంలో సంధించిన పంథాకు కూడా ఆయన చలించక,

ఉద్రేకానికి లోనుగాకుండా అత్యంత నిదానంగా నిండు మనస్సుతో సమాధానా లిచ్చేసరికి అతను ఎంతో ప్రభావితుడయ్యాడు. ఆ తరువాత అక్కడి తన మిత్రులతో, "ముస్లింలలో ఇంతటి వ్యవస్థ ఇంతటి విద్యాజ్ఞానాలు ఉంటా యని నేననుకోలేదు. వారిలో ఇంతటి జ్ఞానం, జాగరూకతలుగల వ్యక్తు లున్నారని నేనూహించలేకపోయాను. మారుమూలనున్న ఈ చిన్న పల్లెలో ఇలాంటి స్కాలర్లు ఉన్నారు, ఇంతటి ఆత్మవిశ్వాసం వారిలో ఉన్నదంటే, ఇక పట్టణాల పరిస్థితి ఎలా ఉంటుందో?" అంటూ తన సంభ్రమాశ్చర్యాల్ని వ్యక్తపరిచాడు.

ఈ సంఘటన జరిగిన కొన్ని రోజులకే దారుల్ ఇస్లామ్‌లో జరిగిన ఒక మీటింగ్‌లో పాల్గొనేందుకు మౌలానా మంజూర్ నొమాని(నిర్యా: 1997), మౌలానా జాఫర్‌షా ఫుల్‌వారి (నిర్యా: 1987 ఏప్రిల్ 1)తో పాటుగా కొందరు ధార్మికవేత్తలు కూడా వచ్చారు. వారు దాదాపు వారం, పదిరోజులపాటు దారుల్ ఇస్లామ్‌లో విడిది చేశారు. అబ్బాజాన్ వారిని భోజనాల కోసం ఒకసారి తనింటికి ఆహ్వానించారు. ఈ విషయాన్ని అమ్మీజాన్‌కు తెలుపుతూ, అత్యంత దూరదృష్టితో 'రోజూ మనం భోంచేస్తున్న రాగిపళ్ళాలే 'దస్తర్‌ఖాన్'పై అతిథులకు కూడా అమర్చాలని ఆదేశించారు. దానితోపాటే వివాహ సమయంలో అమ్మీ జాన్‌కు ఇచ్చిన డిన్నర్‌సెట్‌గాని, ముత్యాల రుమాల్లు కప్పే గ్లాసులుగాని తీయవద్దని కూడా ఆయన ఆదేశించారు.

"ఇదెలా సాధ్యం? ఇంత పెద్ద ధార్మికవేత్తలు నా ఇంటికి వస్తుంటే మంచి ప్లేట్లు కూడా అమర్చకపోవడం, కేవలం రాగిప్లేట్లలో భోజనం పెట్టడం ఎలాగండీ! నా మనసొప్పటం లేదు" అంటూ అమ్మీజాన్ తన అసంతృప్తిని వ్యక్తపరిచారు.

ఇదొక్కటే కాకుండా రోజూ మనం తినే సామాన్య భోజనమే వడ్డించా లని, స్పెషల్‌గా ఘుమఘుమలాడే ఐటమ్స్ తయారు చేయించకూడదని కూడా అబ్బాజాన్ ఆదేశించారు. అమ్మీజాన్ తిరిగి 'మనం కూడా మన ధార్మిక

వర్గాల్ని గౌరవించకపోతే, ఇక సామాన్య జనం నుండి ఎలా ఆశించగలం??' అంటూ తల్లడిల్లిపోయారు.

క్లుప్తంగా చెప్పవచ్చినదేమిటంటే, మక్బూల్ మంచి రుచికరమైన వంటకాలు చేశాడు. అమ్మీజాన్ కూడా తన శ్రేష్టమైన ప్లేట్లలో 'దస్తర్‌ఖాన్' అమర్చారు. అతిథులు వచ్చారు, భోజనాలు చేసి వెళ్ళిపోయారు. కాని కొన్ని రోజులకే మా అబ్బాజాన్ గురించి గుసగుసలు మొదలయ్యాయి. దీని ఫలితంగా వారు చివరికి జమాఅతె ఇస్లామీ సభ్యత్వానికి రాజీనామా సమర్పించారు. పైనుదహరించిన పెద్దలు, తమతో తరచుగా కలిసేవారితో అబ్బాజాన్‌పై అనేక నిందలు మోపారు. ధార్మికత ముసుగులో మౌలానా మౌదూదీ ఇహాన్ని కోరుకునే మనిషని, మౌలానాగారి ఇంట్లో వంటమనిషి వంట చేస్తాడని, పిల్లల్ని ఆయా చూసుకుంటుందని, ఇక ఈ సతీమణిగారు దేనికోసమో? మౌలానా గారి భార్య కొన్నిసార్లు చీరకడుతుందని, కొన్నిసార్లు గరారా వేసుకుటుందని, తమలపాకులు కట్టడానికి మౌలానా గారు ఉపయోగించే 'పాందాన్' వెండిదని, తమలపాకులు అందించే పళ్ళెంకూడా వెండిదని విన్నాము. (వాస్తవంలో ఈ రెండూ కూడా రాగివే. కాకపోతే వాటిపై తెల్లటి నికిల్ పాలిష్ చేయబడిందంతే!) ఆయా పిల్లల్ని, పిల్లల బండీలో వాహ్యాళికి తీసుకెళుతుందట. ఇవన్నీ కూడా ధార్మికత పేరుతో మోసంకాక మరేమిటి? అంటూ అబ్బాజాన్‌పై బురదజల్లే ప్రయత్నం చేశారు.

'దాదీ అమ్మా' (నాయనమ్మగారు) (గౌ. రుఖియా బేగం 1873-7-12-1957) ఈ మాటలు విని, 'దైవం స్థోమతను చూసే స్థాయిని ప్రసాదిస్తాడు, వారిలోని స్థోమత, సామర్థ్యం ఈ పాటిదే!' అంటూ బాగా నొచ్చుకున్నారు. ఈ సంఘటన జరిగిన తరువాత ఇక ఏనాడూ, ఏ విషయంలోనూ అమ్మీజాన్, అబ్బాజాన్‌తో విభేదించి తన మాటను మెప్పించుకోలేదు. ఆయనగారు ఆదేశించిన ప్రకారమే నేను సామాన్య భోజనం వడ్డించి, రాగిప్లేట్లలో సమర్పించి ఉంటే, జమాఅత్‌కు ఇంతపెద్ద విఘాతం తగిలేది కాదేమో! అంటూ అమ్మీజాన్ ఎల్లప్పుడూ తన చర్యకు బాధపడుతుండేవారు.

ఇలాంటి దుస్సంఘటన జరిగినప్పటికీ మా అమ్మానాన్నల మధ్య తీవ్ర వాదోప వాదాలుగాని, వరుషపదాల వాడకంగాని మేము జీవితాంతం చూసి ఎరుగము. కాని జీవితంలో ఒకసారి మాత్రం అలాంటి సన్నివేశం వచ్చింది. అప్పుడు దాదిఅమ్మ, అమ్మీజాన్‌లు అబ్బాజాన్‌తో తీవ్రంగా విభేధించారు. ఆగస్టు 1947లో మతకలహాలు తీవ్రస్థాయిలో విజృంబించిన రోజులవి. అబ్బాజాన్, దారుల్‌ఇస్లామ్‌లో ఉంటున్న కార్యకర్తల గౌరవ మర్యాదల కారణంగానైతేనేమీ, బెదురు భయం వల్లనైతేనేమీ ముస్లిమేతరులెవ్వరూ దారుల్ ఇస్లామ్ సరిహద్దుల్లో కూడా అడుగుపెట్టటానికి సాహసించలేక పోయారు. ఈ కారణంగానే దారుల్‌ఇస్లామ్ చుట్టుపక్కలనున్న ముస్లిం పల్లె ప్రజలు తమ ఇల్లువాకిళ్ళను వదిలి, భార్యాపిల్లలు, పశుసంపదతో సహా వచ్చి, దారుల్ ఇస్లామ్‌లో తలదాచుకున్నారు. ఆ ప్రాంతమంతా ముస్లిం శరణార్థులతో నిండిపోయింది. బాధితులు వస్తూనే ఉన్నారు. కాని సైన్యం రక్షణలో వీరిని తీసుకెళ్ళడానికి కేవలం మూడు బస్సులొచ్చాయి. అందులో కూడా ఒక బస్సు చౌదరి నియాజ్ అలీ కుటుంబీకుల్ని, పరివారాన్ని తీసుకురావటానికి పంపిం చటం జరిగింది. ఇక మిగిలినవి కేవలం రెండే రెండు బస్సులు. ఈ రెండు బస్సుల్లోనే దారుల్ ఇస్లాంలో గుమిగూడిన ప్రజలందరినీ పంపించాలి. అదెలా సాధ్యం!

అబ్బాజాన్ వెంటనే ఒక నిర్ణయానికి వచ్చేశారు. 'ఈ రెండు బస్సుల్లో కేవలం స్త్రీలు, పిల్లలు మాత్రమే వెళతారు. మగవారు ఆ తరువాత వెళతారు.

ఇంతకుమించిన విషాదమేమిటంటే బస్సులతో వచ్చిన సైనికులు తొందరపెడుతున్నారు. పది నిమిషాల్లోగా మీరు బస్సుల్లో ఎక్కేయాలి. మా వద్ద సమయంలేదు. అంటూ ఆర్డర్ జారీచేశారు. దీనిపై దాదిఅమ్మ, అమ్మీజాన్‌లు ముక్తకంఠంతో అన్నారు. "అడుగడుగుకు సిక్కులు కృపాణాలు పట్టుకొని నిలబడిఉన్నారే! ఈ పరిస్థితుల్లో మగవారు తోడులేకుండా మేమాడవాళ్ళం ఒంటరిగా ఎలా వెళ్ళగలం?' దాదాపు ప్రతి ఇంటివారు ఇదే ప్రశ్నను లేవ నెత్తారు. మా కుటుంబం అందరికీ ఒక ఆదర్శనీయ కుటుంబం కనుక అందరి చూపులూ మాపైనే ఉన్నాయి.

అబ్బాజాన్ ఇలా అన్నారు. "చుట్టుపక్కల ముస్లింలు నా వద్ద శరణం కోరుతూ వచ్చారు. వీరిని దుండగుల దయాదాక్షిణ్యాలపై విడిచి, నేను నా భార్యాపిల్లలతో ఎలా వెళ్ళగలుగుతాను?' ఆయనింకా ఇలా అన్నారు. 'స్త్రీలు, పిల్లలు ఉన్నంతసేపు వీరాధివీరుడైన పురుషుడు కూడా వారి మానప్రాణాల కోసం పిరికివాడైపోతాడు. స్త్రీలు, పిల్లలు వెళ్ళిపోయిన తరువాత కనీసం వారి మానాల విషయమై మేము విముక్తులమైపోతాము. ఇక మా ప్రాణాల గురించి అంటారా! అది దైవాభీష్టం! ఆయన తలుచుకున్నది చేస్తాడు. మా గురించి చింతపెట్టుకోకండి అని ధైర్యం చెప్పారు. ఈ సంద్గిగ్దావస్థలోనే సమయం గడవసాగింది. సిపాయీలు తొందరపడమని ఈలలు వేస్తున్నారు. చివరికి అబ్బాజాన్ ధృడస్వరంలో అమ్మీజాన్‌తో ఇలా అన్నారు. 'ఇక్కడున్నవారిలో చివరి మనిషిని పాకిస్తాన్ పంపించనంతవరకు, నేనసలు ఇక్కడి నుండి కదలను." ఇది వినగానే దాదిఅమ్మ దివ్యఖుర్‌అన్ మెడలో వేసుకొని, వుజూ పాత్రను అందుకొని, అమ్మీజాన్‌తోపాటుగా పిల్లల్ని తీసుకొని ఉద్వేగంతో వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ కళ్ళనుండి అశ్రువులు జలజలా రాలుతుండగా బస్సు ఎక్కేశారు. ఇదిచూసిన మిగిలిన స్త్రీలు పిల్లలు బస్సులవైపు పరుగెత్తనారంభించారు. బస్సులు బయలుదేరుతుండగా, కొందరు భరించలేక బస్సుల వెనుకాలే పరుగెత్తుకుంటూ రావడం గమనించాము. కాని అబ్బాజాన్ మాత్రం ఎలాంటి చలనం లేకుండా దృఢంగా అదే స్థానంలో నిలబడి నిశ్శబ్దంగా మావైపు చూస్తుండిపోయారు.

సూర్యాస్తమయం వేళ ఈ బస్సులు 'సర్‌నా' నుండి బయలుదేరి రాత్రికల్లా అమృత్‌సర్ చేరుకున్నాయి. రాత్రంతా అమృత్‌సర్‌లోనే నిలబడి పోయాయి. చీకటిలో ప్రయాణం ప్రమాదకరమని భావించి అక్కడ్నే ఆగి పోయాయి. నడిరాత్రి అందరూ వారిస్తున్నా వినకుండా దాదిఅమ్మా కాల కృత్యాల కోసమని బస్సు దిగి అవతలకి వెళ్ళారు. చాలాసేపయింది. కాని దాదిఅమ్మా తిరిగి రాలేదు. ఇక అందరూ నిరాశచెందిన సమయంలో అకస్మాత్తుగా ఒక విచిత్ర సంఘటనను చూశాము. ఇద్దరు సిక్కులు దాదిఅమ్మా

చేయిపట్టుకొని వస్తూ కనిపించారు. 'అమ్మాజీ! మీ బస్సు ఏదో గుర్తించండి' అంటూ ఆమెనడుగుతున్నారు.

'దాదిఅమ్మా! ఇటురండి' అంటూ మేము వెంటనే కేకలేశాము. ఆ తరువాత ఇద్దరు సిక్కు సోదరులు దాది అమ్మకు సాయపడుతూ బస్సు ఎక్కించి సలాం చేసి వెళ్ళిపోయారు. ఒకరిచేతిలో నీటితో నిండిన చెంబుంటే, అతను అది కిటికీలోనుండి దాది అమ్మకు అందించాడు. ఆ తరువాత దాదిఅమ్మ "మీరు అనవసరంగా సిక్కులు చంపుతారని భయపడుతున్నారు. వాస్తవానికి చంపేది, బ్రతికించేది అల్లాహ్ మాత్రమే అని గుర్తుంచుకోండి" అంటూ మమ్మల్ని సమాధానపర్చారు.

అబ్బాజాన్ దూరదృష్టితో, ఎందుకైనా మంచిదని జమాఅత్ పెద్దల్లో ఒకరైన మౌలానా అబ్దుల్ జబ్బార్‌గాజి (నిర్యా: 1981)గారిని మా బస్సులకు తోడుగా పంపించారు. ఈ బస్సులు తీసుకొని గవాల్‌మండి, లాహోర్‌లో 'మలిక్ నస్రుల్లాఖాన్' అజీజ్ (నిర్యా: 2-7-1976)గారింటికి వెళ్ళాలని, ఆ తరువాత మా కుటుంబ సభ్యుల్ని గుర్రపుబగ్గీలో ఇస్లామియ పార్క్, ఫసీహ్ మంజిల్‌లో ఉంటున్న 'మౌల్వీ జఫర్ ఇక్బాల్' (నిర్యా: 5-5-1985)గారింటికి చేర్చాలని ఆయనగారికి ముందే ఆదేశించి ఉన్నారు. ఇదేవిధంగా బస్సుల్లో ప్రయాణిస్తున్న స్త్రీలందరినీ వారివారి బంధువుల ఇళ్ళకు చేర్చాలని కూడా అబ్దుల్ జబ్బార్‌గాజీ గారిని ఆదేశించడం జరిగింది.

కొన్నిరోజులు మేము 'ఫసీహ్ మంజిల్'లోనే ఉన్నాము. ఈ మధ్యలో అబ్బాజాన్ గురించి ఆయన ఎక్కడున్నారో, ఏ పరిస్థితుల్లో ఉన్నారో అనే విషయం మాకసలే తెలియదు. దాదిఅమ్మ, అమ్మీజాన్‌లకు ఒక్కోరోజూ ఒక యుగంగా గడుస్తున్నది. ఇక రాత్రి ఓ ప్రళయాన్ని మరిపించేది. అనిర్వచనీయమైన ఒక వ్యాకులత, ఒక అనిశ్చితత సర్వత్రా వ్యాపించి ఉండేది. ఈ మధ్యకాలంలో మౌల్వీ జఫర్ ఇక్బాల్‌గారి ఇంటివారు మమ్మల్ని ఎంత బాగా చూసుకున్నారో ఎంతగా సేవలు చేశారో తలుచుకుంటే మదీనా అన్సార్లు మక్కా ముహాజిర్లను ఎంతప్రేమగా ఆదుకున్నారో, ఆ దృశ్యాలు పునరావృతమయ్యాయా అనిపించేది.

# 4. 1947

1947 ఆగస్టు నెలలో భారత పాకిస్తాన్‌లు విడిపోయి, స్వతంత్ర రాజ్యా లుగా ఏర్పడిన తరువాత మేము దారుల్‌ఇస్లాం (పఠాన్‌కోట్, తూర్పు పంజాబ్) నుండి హిజ్రత్ చేసి లాహోర్ చేరుకున్నాము. దారుల్‌ఇస్లాంలోని మా స్థిరాస్తికి బదులుగా మాకూ, జమాఅతె ఇస్లామీ సంస్థకూ కలిపి లాహోర్‌లోని 'చౌబుర్జీ'కి సమీపంలోని 'సొహాన్‌లాల్' కాలేజ బిల్డింగ్ కేటాయించడం జరిగింది. దారుల్‌ఇస్లాంలోనైతే మా నివాస గృహం, జమాఅతె ఇస్లామీ కార్యా లయాలు కలిసే ఉండేవి. ఈ కాలేజీలోని ప్రిన్సిపాల్ నివాస గృహాన్ని(కోఠిని) మాకు అప్పగించారు. టీ కప్పుల్లోనే ఎండిపోయిన తేనీరును చూస్తుంటే ఈ ఇంటివాసులు టీ త్రాగుతుండగానే దాన్ని అలానే వదిలేసి అకస్మాత్తుగా ఇల్లు విడిచి వెళ్ళిపోయినట్లుగా అర్థమైంది. వంటింట్లో రొట్టె చేయడానికి పిసికిన పిండి పులిసిపోయి ఎండిపోయి ఉంది. అల్మరాలు తెరిచే ఉన్నాయి. సామాన్లు చెల్లాచెదురుగా పడిఉన్నాయి. ఇంట్లోని ఒక్కొక్క వస్తువును చూస్తుంటే దుఃఖాన్ని ఆపుకోలేకపోయాము. ఇంట్లో అడుగుపెట్టగానే దాదిఅమ్మా మమ్మల్ని, "ఖబర్దార్! ఒక్క వస్తువు కూడా ముట్టుకోరాదు. ఏ సంపదైతే తన యజమాని పట్ల విశ్వాసం చూపలేకపోయిందో అది మనకేం లాభం తెచ్చిపెడుతుంది?" అంటూ కఠినంగా శాసించారు.

దాదాపు రెండునెలలు మేము ఆ బంగళాలోనే ఉన్నాము. ఆ ఇంట్లో ఉంటున్నప్పుడే అల్లామ ముహమ్మద్ అసద్ తన భార్యా, కుమారునితో వచ్చి పలకరించిపోయారు. ఈ బిల్డింగ్‌లోని మూడవ అంతస్తునుండే పాకిస్తాన్ ఏర్పడిన తరువాత 1947 అక్టోబరు 30వ తేదీన 'ఖాయెదె ఆజం ముహమ్మద్ అలీ జిన్నా' (నిర్యా: 11-09-1948) పంజాబ్ యూనివర్శిటీ గ్రౌండ్‌లో చేసిన ప్రసంగాన్ని విన్నాము.

ఆ సమయంలోనే అబ్బాజాన్, చౌదరీ ముహమ్మద్ అలీసాహెబ్ (అ తరువాత ఈయన పాకిస్తాన్ ప్రధానమంత్రి అయ్యారు.నిర్యా: 1-12-1980)ను

కలిసి "ముస్లింలీగ్‌కు చెందిన అనేక లీడర్లు పాకిస్తాన్‌ను సెక్యులర్ పంథాలో నడిపిస్తామని ప్రకటిస్తున్నారు, ఈ మాట పీడితుల గాయాలపై కారం చల్లేట్లుగాను, మృతుల రక్తాన్ని హీనపర్చేటట్లుగానూ ఉంది' అంటూ హెచ్చరించారు. ఆ తరువాత లాహోర్ రైల్వేస్టేషన్ నలువైపులా చెల్లాచెదురుగా పడి ఉన్న వందలాది శవాలను జంతువులు పీక్కుతింటున్న వైనాన్ని ఆయన దృష్టికి తెచ్చారు. (దీనికి కారణం ఏమిటంటే, ఈ శవాల సంస్కార బాధ్యతలు ఎవరికైతే అప్పగించడం జరిగిందో, వారు హిందువులు విడిచివెళ్ళిన ఇళ్ళను, భవంతులను ఆక్రమించడంలోనూ, వాటిలోని సంపదను దోచుకోవడంలోనూ నిమగ్నమై ఉన్నారు). అబ్బాజాన్ ఆయనతో ఇంకిలా అన్నారు. "కొన్ని రోజుల ముందే సిమ్లా నుండి ప్రభుత్వ ఉద్యోగుల ట్రైను ఒకటి లాహోర్ చేరుకున్నది. అందులో ఒక్కడూ సజీవంగా లేడు. ఆ ట్రైన్ చక్రాలపై గడ్డకట్టిన రక్తపు ముద్దలు వేలాడుతున్నాయి. అలాగే ముస్లిం అమ్మాయిలను సిక్కుల బారి నుండి తిరిగి రాబట్టుకోలేకపోతున్నారు. షహీద్‌ల శవాల్ని ఇంకా ఖననం కూడా చేయలేదు, అప్పుడే పాకిస్తాన్‌ను 'సెక్యులర్' రాజ్యంగా మార్చే ప్రయత్నాలు మొదలయ్యాయి. పాకిస్తాన్ అంటేఏమిటి? లా ఇలాహ ఇల్లల్లాహ్' అంటూ మీరిచ్చిన నినాదానికే కదా వీరంతా ఇల్లువాకిళ్ళు వదిలేసి బయలుదేరారు." (ఇప్పుడు వీరి గతేంటి).

అంతా విన్న తరువాత చౌదరీ ముహమ్మద్ అలీగారు, "ఈ విషయాన్ని ప్రధానమంత్రి లియాఖత్ అలిఖాన్ (నిర్యా: 16-10-1951)గారి దృష్టికి తెస్తాను" అంటూ వెళ్ళిపోయారు. అయితే ఆయనతో జరిగిన ఈ సమావేశం మరియు బయల్పడిన పరిణామం ఎలాంటిదో గమనించండి. రెండు నెలలు కూడా గడవకముందే మేముంటున్న కాలేజీ బిల్డింగ్ వేరొకరికి అలాటు చేస్తూ, వెంటనే స్వాధీనపర్చుకోవాల్సిందిగా ప్రభుత్వాదేశాలు జారీ అయ్యాయి. అబ్బాజాన్ దీనికి సంబంధించి ఎలాంటి వాగ్వివాదాలకు దిగటం ఇష్టంలేక దీన్ని ఖాళీ చేయడానికే నిశ్చయించుకున్నారు. సూర్యాస్తమయానికి కొంచెం ముందు అబ్బాజాన్ రెండు గుర్రబ్బగ్గీలను తెచ్చి అమ్మీజాన్, దాదిఅమ్మలను

సంబోధిస్తూ "మనం దారుల్ఇస్లాం నుండి ఏ యే వస్తువులైతే తెచ్చుకున్నామో కేవలం వాటిని మాత్రమే తీసుకొని పిల్లలతో బగ్గీలెక్కండి" అంటూ ఆదేశించారు. 'భారతదేశం నుండి ఇక్కడికి వలసవచ్చాం. మరి ఇక్కడ్నుంచి ఇంకెక్కడికి పోతున్నాం?' అంటూ దాదిఅమ్మగాని, అమ్మీజాన్‌గాని ప్రశ్నించనే లేదు. ఎందుకు?ఎలా? దేనికోసం?లాంటి ప్రశ్నలడగటం మా ఇంటి కల్చరే కాదు. అబ్బాజాన్ ఓ నిర్ణయం తీసుకున్నారంటే దాన్ని మారుమాట్లాడకుండా అందరం శిరసావహించేవాళ్ళం. బయల్దేరేటప్పుడు మేము కొన్ని ఆటవస్తువుల్ని పట్టుకున్నాము. అది చూసిన దాదిఅమ్మ వాటిని మా చేతుల్లోనుండి లాగి కిందపడేస్తూ, 'ఇక్కడి ఏ వస్తువూ ముట్టుకోరాదని అబ్బాజాన్ చేసిన ఆదేశాన్ని మరిచిపోయారా?' అంటూ మందలించారు.

బయటికొచ్చి మేము బగ్గీల్లో కూర్చున్నాం. అబ్బాజాన్ సహచరు లందరూ అలాగే బగ్గీల్లో కూర్చుంటున్నారు. ఆ తరువాత మేము ఇస్లామియ పార్కు చేరుకున్నాము. ఇప్పుడక్కడ డాక్టర్ రియాజ్ ఖదీర్ భవంతి ఉంది. అంతలోనే జమాఅత్ కార్యకర్తలు టెంట్‌లు తీసుకొని వచ్చారు. వెంటనే ఒక తాత్కాలిక క్యాంపును ఏర్పాటు చేసుకోవడం జరిగింది. ఈ క్యాంపులో మేము దాదాపు రెండున్నర మాసాలు నివాసమున్నాం. ఇది జరిగిన రెండవరోజు అబ్బాజాన్ పాత బంగళా (సోహన్‌లాల్ కాలేజీ) తాళపు చెవుల్ని ప్రభుత్వ అధికారులకు అప్పగించారు.

ఎలాంటి ప్రతిఘటన, ప్రతిస్పందన లేకుండానే ఆ బంగళాను అబ్బాజాన్ ఎలా ఖాళీ చేశారో, అది ఆయనలాంటి నిస్వార్థ, నిరపేక్షాపరుడు, దైవంపై సంపూర్ణ భరోసా ఉన్న వ్యక్తిత్వానికే చెల్లుతుంది. అబ్బాజాన్ ఒకచోట ఇలా వ్రాశారు.

"ఈమాన్(విశ్వాసం) అనేది బయటికి కనిపించే వస్తువు కాదు. అది హృదయంలోని ఒక స్థితిని సూచిస్తుంది. అందుకని ఈమాన్ విలువను ఒక బయటి కొనుగోలుదారు నిర్ణయించలేడు. దానికి భిన్నంగా ఇట్టి ఈమాన్ కలిగివున్న వ్యక్తే దాని విలువెంతో నిర్ణయించుకోగలుతాడు. ఒకరికి ఇదెంత

విలువలేనిదిగా అగుపిస్తుందంటే బహుశ అతను దీన్ని ఒక రొట్టెముక్క కోసం కూడా అమ్మేసుకోగలడు. అలాగే వేరొకరి దృష్టిలో ఇదెంత విలువైనదై ఉంటుందంటే, భూమ్యాకాశాలను సృష్టించిన ఆ దైవం తప్ప ఏ ఇతర కొనుగోలుదారు అతని దృష్టిలో నిలువలేడు.... ఈ శక్తి, ఈ బలం మూలంగానే దైవం, దైవప్రవక్త ఏర్పరిచిన సభ్యతా సంస్కృతుల్ని కాపాడటానికి ఒక ముస్లిం హృదయంలో ఎడతెగని ఉత్సాహం పుట్టుకొస్తుంది. దానికోసం అతనెంత గొప్ప త్యాగానికైనా సిద్ధపడతాడు. ఒక ముస్లిం అమూల్య విశ్వాసాన్ని (ఈమాన్‌ను) ఎవరెంత ధరపెట్టి కూడా కొనలేని సమయంలో ప్రపంచంలోని ప్రతిశక్తి అతనికి దాసోహమనేది. కాని ఎప్పుడైతే అతని మనోమస్తిష్కాల్లో అమూల్యమైన ఈ ఈమాన్ విలువ తగ్గిపోయిందో, నేడతను ప్రతి జాతికి భయపడుతున్నాడు, ప్రతి వానికి దాసోహమంటున్నాడు." ఆరోజు నుండి పరాభవంతో కూడిన మహలుకన్నా, గౌరవంతో లభించిన పూరిగుడిసె మేలనే భావన మా మనోమస్తిష్కాల్లో గాఢంగా నాటుకుపోయింది. మొత్తానికి ఆ గడ్డుకాలం కూడా గడిచిపోయింది.

ఆ రోజుల్లోనే సహచరుల సలహామేరకు ముందుగా శవాల సంస్కారం ముఖ్యమనే నిర్ణయానికి వచ్చారు అబ్బాజాన్. ఈ నిర్ణయం తీసుకున్నాక కార్యక్రమం ప్రారంభించేముందు కొన్ని ట్రక్కులు అద్దెకు తీసుకోబడ్డాయి. జమాఅతె ఇస్లామీ కార్యకర్తలు రెండు టీములుగా విభజించబడ్డారు. నేడు 'సుమన్ ఆబాద్' ఉన్న ప్రాంతంలో శవాల్ని సామూహికంగా ఖననం చేయాలని నిర్ణయించబడింది. ఒక టీం ఆ ప్రాంతంలో సువిశాలమైన ఒక గోరీని త్రవ్వుతూ ఉంటే, వేరొక టీమ్ ట్రక్కుల్లో శవాల్ని నింపుకొని వస్తుండేది. సామూహిక జనాజా నమాజ్ చేసిన తరువాత ఆ శవాల్ని సామూహిక గోరిలో పూడ్చేసే వారు. తిరిగి రెండవ టీం గోరీని త్రవ్వుతూ ఉంటే, మొదటి టీమ్ ట్రక్కుల్లో శవాల్ని నింపుకొని వచ్చేది. మేము పిల్లలం పొద్దంతా అక్కడే నిలబడి ఈ కార్యక్రమాన్నంతా చూస్తుండేవాళ్ళం. 'పిల్లలు శవాల్ని చూడకూడదు, నిదురలో భయపడతారు, పారిపోండి ఇక్కడి నుండి... అంటూ అప్పుడప్పుడు పెద్దలు

మమ్మల్ని గదమాయించేవారు. కాని మేము దారుల్ఇస్లాం నుండే అనేక శవాలను చూస్తున్న కారణంగా మా బెదురు భయాలే దూరమై పోయాయి. ఇకిప్పుడు శవాలంటే మాకు భయమేసేదే కాదు. ఇలాంటి అసంఖ్యాకమైన త్యాగాల వల్లే మనకు పాకిస్తాన్లాంటి భాగ్యం లభించిందనే విషయాన్ని మనం మరువరాదు. పాకిస్తాన్ ఉద్యమానికి బలైపోయిన వందలాది షహీద్ల సమాధులపై ఉంటున్నామని, నడుస్తున్నామని బహుశ నేడు సుమన్ అబాద్ వాసులకు తెలియదేమో!

శవాల పూడ్చివేత పూర్తికాగానే జమాఅతె ఇస్లామీ కార్యకర్తలు శరణార్థుల క్యాంపుల నిర్వహణను చేపట్టారు. కాని ఈ మధ్యలోనే కొందరు ప్రభుత్వ ఉద్యోగులు, జాతీయవాదులమనిపించుకునే కార్యకర్తలు క్యాంపుల్లో దోపిడీని మొదలుపెట్టారు. శరణార్థుల సహాయం కోసం పంపబడిన రగ్గులు,కంబళ్ళు, ఆహార పదార్థాలను కొల్లగొట్టడం ప్రారంభించారు. పరుల దౌర్జన్యం నుండి ఎలాగో బయటపడి, తమ తల్లిదండ్రుల్ని పోగొట్టుకునో, లేక వారితో ఎడబాసో మానప్రాణాలు దక్కించుకొని నిరాశ్రయులుగా పాకిస్తాన్ చేరిన అమ్మాయిల్ని సైతం- చెబుతుంటే బాధేస్తుంది గాని- కొందరు పాకిస్తానీ జాతీయవాదులు తమ కామాగ్నికి చేరిచేశారు. దీనిపై పత్రికల్లో వార్తలు రావడమే కాకుండా కొందరు అమ్మాయిలు అబ్బాజాన్ను కలిసి తమ గోడును వెళ్ళబోసుకున్నారు. 'పాకిస్తాన్ చేరిన తరువాత కూడా మా మానాలు సురక్షితంగా ఉండకపోతే, మేము ఇంకెక్కడికి వెళ్ళాలి?' అంటూ ఏడ్చేశారు.

ఇంతలోనే సిక్కుల నుండి తిరిగి రాబట్టుకోబడిన అమ్మాయిలు క్యాంపుల్లోకి రావడం ప్రారంభమయింది. ఇది ఆ కాలంనాటి అత్యంత బాధాకరమైన అనుభవంనాకు. వారి పరిస్థితిని చూసి మేము చలించకుండా ఉండలేకపోయాము. వారిలోని అత్యధిక మంది అమ్మాయిలు గాయాలపాలై ఉన్నారు. ఒక అమ్మాయి కంటిపై ఒక సిక్కు కృపాణంకొనతో పొడవడంవల్ల ఆమె కన్ను పనికిరాకుండా పోయింది. దాన్నినేను స్వయంగా చూశాను. ఒక

అమ్మాయి బుగ్గపై ఏర్పడిన గాయాన్ని ఆమె ముఖాన్నీ నేను నేటికీ మరిచి పోలేకపోతున్నాను. కొందరమ్మాయిల శరీరాలపై పళ్ళతో కొరికిన ఆనవాళ్ళు న్నాయి. అంతేకాకుండా హింసా దౌర్జన్యాలతో సొమ్మసిల్లిపోయిన వారి శరీరాలపై గాయాలు, హింసను దాచలేకపోతున్న చిహ్నాలు- వారి పరిస్థితిని వివరించటానికి కలానికి ధైర్యం చాలడం లేదు. పాకిస్థాన్ మరియు దాని భవిష్యత్తు కోసం ఈ అమ్మాయిలు ఇంతటి నరకాన్ని చవిచూశారు. ఇవైతే బాహ్యంగా వారి శరీరాలపై కనబడుతున్న గాయాలు. ఇక వారి హృదయా లకు, వారి ఆత్మలకు కలిగిన గాయాలు అంతకన్నా ఘోరమైనవి, అంతకన్నా లోతైనవి, అంతకన్నా బాధాకరమైనవి.

వారు వలవలా ఏడుస్తూ ఇలా చెప్పేవారు. "శత్రువులు బలవంతంగా మాచే సారాయి త్రాగించేవారు. తమ ముందు నాట్యం చేయ వివశుల్ని చేసేవారు. తమపట్ల జరిగిన కిరాతకాల్ని వివరించటానికి, తమ హృదయాగ్నిని వెళ్ళబోయటానికి వారు తహతహలాడేవారు. మా ఇంట్లో దాదిఅమ్మ, అమ్మీజాన్‌లతోపాటు లేతవయస్కులైన మాలాంటి అమ్మాయిలున్నప్పటికీ, వారు ఇదంతా వెళ్ళబోసుకునేవారు. బట్టలు విప్పి, శరీరాల్ని తమ గాయాల్ని చూపించేవారు. అతిశయించిన బాధ, అవమాన భారంతో అమ్మీజాన్ కంపించి పోయేవారు. వ్యక్తిగతంగా ఒక్కొక్క అమ్మాయిని ఓదారుస్తూ 'బిడ్డా! ఇలాంటి మాటలు బహిర్గతం చేయకు. ఇలా బట్టలు విప్పి శరీరగాయాల్ని చూపించ కూడదమ్మా!' అంటూ వారించేవారు. దానికి ఆ అమ్మాయిలు హృదయ విదారకంగా ఏడుస్తూ, "ఇంకేం మిగిలిపోయిందని? ఏ మానమర్యాదల కోసం? మేమెవరికి ముఖం చూపించగలం?" అంటూ భోరున విలపించేవారు.

ఈ విషయాలన్నీ దాదిఅమ్మా, అమ్మీజాన్, అబ్బాజాన్‌ల సమక్షంలోనే జరుగుతుండేవి గనుక వాటి కారణంగా మా ఇంట్లో దుఃఖం, విషాదఛాయలు అలుముకున్నాయి. అమ్మీజాన్ కళ్ళలో అశ్రువులు- ఇక కోపం, అభిమానం, నిస్సహాయతలు అలుముకున్న అబ్బాజాన్ ముఖాన్ని చూడటానికే మాకు భయంవేసేది.

ఇలాగే తిరిగి రాబట్టుకోబడిన ఒక మహిళతో నేటికీ నాకు మిత్ర సంబంధాలున్నాయి. ఆమె కుమారులు పెద్దపెద్ద హోదాల్లో ఉన్నారు. ఇంట్లో దేనికీ కొదవలేదు. కాని ఆమెకు తరచుగా బాధ, వ్యాకులతతో కూడిన మూర్ఛలు వస్తుంటాయి. ప్రత్యేకించి ఆగస్టు నెలలోనైతే మరీను. గడిచిన 14వ ఆగస్టు రోజున ఫోన్‌చేసి నన్ను తనవద్దకు రప్పించుకుంది. 'జీవితమంతా మాడల్ టౌన్ బంగళాలో గడిచిపోయింది. కాని ఎప్పుడైనా కలగంటే అదే 'లూథియానా' ఇల్లు కనబడుతుంటుంది. ఇల్లు కాలిపోతున్నది. వాకిట్లో నాన్నగారి శవం పడిఉంది. మొదట అక్కయ్యను సిక్కులు ఈడ్చుకొని పోతున్నారు. ఆ తరువాత మేము బాబాయి అని పిలిచే ఓ సిక్కు నాపై చేయి వేశాడు. నేను భయంతో స్పృహ కోల్పోయాను. మా అక్కయ్య సామూహిక మానభంగానికి గురయి ప్రాణాలు వదిలిందని ఆ తరువాత తెలిసింది. నేనెంత పాపిష్టిదాన్ని! సిగ్గుమాలినదాన్ని!! నాకు చావు ఎందుకు రాలేదు!!! ఇకిప్పుడు ప్రతి 14వ ఆగస్టు రోజున విద్యుద్దీపాలు ఎంతగా అలంకరిస్తున్నారో ఎన్నెన్ని జాతీయ గీతాలు పాడుతున్నారో. అడుగడుగునా ఈ సోహిని ధర్తీ (అందమైన దేశం)ను నాశనంచేసి విడిచిపెట్టారు. తమ మాతృదేశాన్ని రక్షించే బాధ్యతగల ఈ యువకులే, తమ పొడుగాటి జత్తుల్ని భుజాలపై వేలాడదీసుకొని, ఆడవాళ్ళలా నడుములు వంచి నాట్యాలు చేస్తూ ఆడుతూపాడుతూ తుళ్ళు తున్నారు. ఇదంతా స్వాతంత్ర్య సంబరం పేరుతో జరుపుకుంటున్నారు. కాని ఈ స్వాతంత్ర్యం కోసం ఏ మూల్యమైతే చెల్లించామో, అది మా బోటి ఆడవాళ్ళ నడగాలి. మాతృదేశం మట్టీ! నీవే దీనికి సాక్షి!! సామూహిక మానభంగాలకు గురైన వారిపై ఎంతటి విపత్తు విరుచుకుపడిందో, జ్ఞానం, మానం లేకుండా కులుకుతున్న వీరికేం తెలుసు?" పాకిస్తాన్ వాసులకు ఈ స్వాతంత్ర్యం శుభం చేకూర్చలేదు. ఎవరికోసమైతే వీరిప్పుడు స్నేహహస్తం చాపుతున్నారో, వారినే ఒకప్పుడు మేము బాబాయి అని, మామయ్య అని, అన్నయ్య అని పిలుస్తుండే వాళ్ళమనే విషయం వీరికేం తెలుసు?

ఆవిడే ఇంకిలా అంది. 'ఆగస్టు 14 వేడుకల సందర్భంలో వెలిగించే కాంతులు, మాలోని చీకట్లను ఇంకా పెంచుతాయి. సోదరీ! ఎవరి కొంగులపై

సైతం పరపురుషుని దృష్టిపడలేదో అలాంటి శీలవంతులు సాముహిక మానభంగానికి గురయ్యారు. ఇన్ని త్యాగాలు ఎవరికోసమని చేశాము? కులు కుతూ, త్రుళ్ళుతూ ఆడే ఎగిరే ఈ నృత్యగాళ్ళ కోసమా? ఈ బోగం వాళ్ళకోసమా మేమిన్నిత్యాగాలు చేసింది? ఇలాంటి నీచుల కోసమనే మేమిన్ని బాధలు అనుభవించామా? చెప్పు చెల్లీ! నాకు చెప్పు! దీనికోసమే పాకిస్తాన్ ఏర్పడిందా??'

ఆమె అడిగిన ప్రశ్నలకు నావద్ద ఎలాంటి సమాధానంలేదు. ఆవిడైతే ఈవిధంగా తన బాధను, కోపాన్ని వెళ్ళగక్కుతుండేది. కాని ఆమె ఇంటివారు 'లూధియానా' పేరు వినగానే అసంతృప్తులైపోయేవారు. వారి తల్లిపై, వారి పెద్దమ్మపై ఎంత ఘోరం జరిగిందో, దాని ఊసుకూడా ఎత్తడానికి వారు సిద్ధంగా లేరు. విషాధమేమిటంటే, నేనెప్పుడైనా ఆవిడను కలువడానికి వారింటికి వెళితే, ఆవిడ మనువలు, మనవరాళ్ళు నన్ను చూడగానే 'లూధియానా జిందాబాద్' అంటూ నినాదాలు చేసేవారు.

నిరాశ్రయులు, అత్యాచారానికి గురైన ఇలాంటి అమ్మాయిల దగ్గరి బంధువులు లేదా దూరపు బంధువుల ఆచూకీ తెలుసుకోవడం అత్యంత గగనమైపోయేది. ఎన్నో కష్ట ప్రయాలకోర్చి వారి ఆచూకీ తెలుసుకున్నప్పటికీ కొన్ని సందర్భాల్లో ఆ బంధువులు వారి కుమార్తెల్ని లేదా చెల్లెల్ని సైతం గుర్తించడానికి గాని, గుర్తించినా వెంట తీసుకెళ్ళడానికి గాని ససేమిరా ఒప్పు కునేవారు కాదు. అది ఎంతటి విషాదకర పరిస్థితో, ఈ పరిణామానికి ఆ అమ్మా యిలు ఎలా నిలువెల్లా కంపించిపోయేవారో కాస్త ఆలోచించండి! అప్రయ త్నంగా వారి నోటినుండి ఆక్రంధనలు, పెడబొబ్బలు, హాహాకారాలు బయల్ప డేవి. వారు హృదయవిదారకంగా విలపించేవారు. వారి పరిస్థితి చూసి గుండె తరుక్కుపోయేది. ఈ పరిస్థితిని భరించలేక వారు తమ ఈ అన్నల్ని, తండ్రుల్ని లేక కుటుంబం వారిని తిట్టిపోసేవారు, శపించేవారు. దుఃఖాతిశయాలతో వారికి పిచ్చెక్కిపోయేది. వారి ఈ పరిస్థితిని చూస్తే పాషాణ హృదయాలు సైతం ద్రవించిపోయేవి. వారి ఈ పరిస్థితిని ఎలా వర్ణించమంటారు? అబ్బాజాన్,

ఆయన సహచరులు తమ సంరక్షణలో ఇలాంటి అనేకమంది అమ్మాయిలకు వివాహాలు జరిపించారు.

ఇలాంటి సహాయ కార్యక్రమాలతో పాటుగా అబ్బాజాన్ 'ఖరార్దాదె మఖాసిద్' (లక్ష్యాల నిర్ధారణ తీర్మానం) కోసం ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకు వచ్చారు. సుడిగాలిలా దేశమంతటా చుట్టివచ్చారు. రేడియో పాకిస్తాన్ ద్వారా ప్రసంగాలు చేశారు. పంజాబ్ యూనివర్శిటీ 'లా' కాలేజీలో ఇస్లామీయ శాస నానికి సంబంధించి లెక్చరర్లు ఇచ్చారు. సహాయ కార్యక్రమాలకు బాధ్యులైన ప్రభుత్వాధికారుల్లో బాద్యతారాహిత్యం, క్యాంపుల్లో పనిచేస్తున్న అనేకమంది కార్యకర్తల్లో దయాదాక్షిణ్యాల కొరత, సహాయనిధి వస్తుసామగ్రిని మాయం చేసే సంఘటిత ప్రయత్నాలు- మొదలుగాగల అనేక వైఫల్యాలపట్ల ఆయన తమ తీవ్ర నిరసనను బహిరంగంగానే ప్రకటించడం జరిగింది. ఇలాంటి కార్యక్రమాల వల్ల 'అబ్బాజాన్' మరియు 'జమాఅతె ఇస్లామీ రెండూ ప్రభుత్వ దృష్టిలో పడకుండా ఉండలేకపోయాయి. ఈ కారణంచేతనే ప్రభుత్వం వీరిని తన ప్రథమ శత్రువుగా భావించసాగింది. ప్రధానమంత్రి 'నవాబ్‌జాద లియాఖత్ అలిఖాన్' తమ అధికారం కోసమున్నూ, తమ దైవరాహిత్య, ధార్మికేతర సిద్ధాం తాల మనుగడ కోసమున్నూ వీరిని ప్రమాదకారులుగా భావించారు. అందుకే... అబ్బాజాన్ చేస్తున్న ఈ బహుముఖ కార్యక్రమాలకు కలవరపడిపోయారు. ప్రభుత్వం తన తప్పుల్ని సరిదిద్దుకోవడానికి బదులు ఎదురుదాడికి దిగింది. నిరాధారమైన నిందలు మోపి జమాఅత్ కార్యక్రమాల్ని అడ్డుకోసాగింది. స్వయంగా ప్రధానమంత్రి లియాఖత్ అలిఖాన్ పత్రికా విలేకరులతో "మౌలానా మౌదూదీ పాకిస్తాన్‌కు అమీరుల్ మోమినీన్ కాదలిచారు" అంటూ వ్యంగ్యంగా స్టేట్‌మెంటు ఇచ్చారు. నిజానికి అబ్బాజాన్ పాకిస్తాన్ ప్రభుత్వానికి గుర్తు చేసిందల్లా శరణార్థులపై జరుగుతున్న దౌర్జన్యాల్ని సమాప్తం చేయమని, శాంతిని స్థాపించమని, దోపిడీలను అరికట్టమని. స్వయంగా వారే పాకిస్తాన్ ప్రజలకిచ్చిన వాగ్దానాల్ని నిలబెట్టుకోవాలన్నది మాత్రమే.

అబ్బాజాన్ ఆ కాలంలో బహిరంగంగా చేసిన ప్రకటన ఇది: 'ఇస్లామీయ రాజ్యం మాధ్యమంగా, పాకిస్తాన్ అసెంబ్లీగాని నాయకత్వంగాని 'లా ఇలాహ ఇల్లల్లాహ్'ను రాజ్యం యొక్క ధ్యేయం, లక్ష్యంగా ప్రకటించకపోతే, పాకిస్తాన్ ముస్లింల పట్ల అది పెద్ద వంచనే అవుతుంది'

దీనికోసం ఆయన 'ఖరార్ దాదెముఖాసిద్ (లక్ష్యాల నిర్ధారణ తీర్మానం)ను ప్రవేశపెట్టారు. దీనిప్రకారం దేవుని సార్వభౌమత్వాన్ని అంగీకరించడం, ప్రజలకు సామూహిక న్యాయం ఎలా కల్పించాలనే ఓ కార్యక్రమాన్ని రూపొందించి సమర్పించారు. ఈ భావనను ఒక తీర్మానం రూపంలో ఆమోదింపజేయడానికి మౌలానా షబ్బీర్ అహ్మద్ ఉస్మాని (నిర్యా: 13-12-1949) గట్టి ప్రయత్నం చేశారు. మౌలానా జఫర్ అహ్మద్ అన్సారి (నిర్యా: 20-12-1991) ఈ సందర్భంలో మౌలానా ఉస్మానీకి కుడిభుజంగా నిలిచారు. స్వయంగా ముస్లింలీగ్‌కు చెందిన అనేకమంది శాసనసభ్యులు ఈ తీర్మానాన్ని సమర్థించి గొప్ప ఘనకార్యం సాధించారు. ఖరార్ దాదె మఖాసద్ (లక్ష్యాల నిర్ధారణ తీర్మానం) కోసం ఆయన పడిన శ్రమ, చేసిన కృషి అబ్బాజాన్ జీవితంలోని ఒక మరుపురాని ఘట్టం. పాకిస్తాన్‌లో సామ్యవాద గాలులు వీచే సూచనలు కనబడగానే ఆయన బహిరంగంగానే ఇలా ప్రకటించారు.

"ఇది ముహమ్మదె అరబీ(స) అనుచరుల దేశం. కార్ల్‌మార్క్స్ లేదా మావోసేతుంగ్ అనుచరుల దేశం కాదు. దైవధర్మం కోసం పోరాడవలసివస్తే దేవుని దయతో మేము పది రంగాలలో కూడా పోరాడటానికి వెనుకాడం. ఏకకాలంలో మేము నియంతృత్వాన్ని ఎదుర్కోగలం. నాస్తికత్వంతో పోరాడుతాం. మేము బ్రతికున్నంతకాలం, మా బొందిలో తుదిశ్వాస ఉన్నంతవరకు ఇక్కడ ఇస్లామీయ జీవన విధానం కాకుండా మరే ఇతర జీవన విధానాన్ని స్థాపించడానికి ఎవ్వరూ సాహసించలేరు."

# 5. మహావృక్షాలు

కొందరు తమ వ్యక్తిత్వంలోనే తాము ఒక సంఘంగా ఉంటారు. ఇంకొందరు తియ్యటి ఫలాలనిచ్చే మహావృక్షాలను తలపిస్తారు. వాటి నీడలో తరతమ బేధం, పేద ధనిక తారతమ్యం లేకుండా పిన్నా పెద్దలంతా సేద తీర్చుకుంటారు. వాటి ఫలాలను ఆస్వాదిస్తారు. వాటి నీడ అందరికీ లభిస్తుంది. వాటి ఫలాలు ప్రతి ఒక్కరికీ లభిస్తాయి. మా అమ్మీజాన్ (మౌదూదీగారి సహచరిణి) అలాంటి వృక్షాల్లో ఒకరు. తన వ్యక్తిత్వంలోనే ఒక సంఘమై, ఒక సమాజమై నిలబడగలిగినవారావెు. తల్లీ తండ్రి తానే అయి మేము తొమ్మండుగురం సంతానాన్ని ఆమె తమ చల్లటి నీడలో పెంచి పెద్దచేశారు.

మా అబ్బాజాన్ (సయ్యద్ అబుల్ ఆలామౌదూదీ) గారి కారణంగా మా ఇల్లు ఎప్పుడూ ప్రజలతో కిటకిటలాడుతుండేది. పురుషులు బయటి హాల్లో ఉంటే, లోపల స్త్రీలుండేవారు. మేము చిన్నప్పటినుండే మా ఇంట్లో 'జుమా నమాజు' అవుతూ రావడం చూశాము. ఆ రోజు పదకొండు గంటలకే ఇంట్లోని పెద్ద రూంలో జంపకానాలు, వాటిపై తెల్లటి దుప్పట్లు పరిచి నమాజ్ కోసం సిద్ధం చేసేవాళ్ళం. ఆ తరువాత అమ్మీజాన్ సలాతుత్ తస్‌బీహ్ సలుపడంలో నిమగ్నమయ్యేవారు. 'సలాతుత్ తస్‌బీహ్' అనేది వ్యక్తిగత ఆరాధన. అందుకని ఈ నమాజ్ ఎప్పుడూ మా ఇంట్లో సామూహికంగా చేసి ఉండలేదు. అంతలోనే దగ్గరి ప్రదేశాలనుండే కాక దూర ప్రదేశాల నుండి కూడా మహిళలు రావడం మొదలయ్యేది. నమాజ్ వేళయ్యేసరికి ఆ గది మహిళలతో నిండిపోయేది.

మా అమ్మీజాన్ ఆ సామూహిక నమాజ్‌కు నాయకత్వం వహించేవారు. నమాజ్ అయిపోయిన తరువాత సుదీర్ఘమైన సామూహిక దుఆ చేయబడేది. ఆ తరువాత దర్సె ఖుర్‌ఆన్, దర్సె హదీస్‌ల కార్యక్రమం జరిగేది. చివరలో మరోసారి 'దుఆ'తో ఆ రోజు కార్యక్రమం ముగిసేది. ఇదేవిధంగా పండుగలకు సంబంధించిన నమాజ్‌లకు కూడా ఏర్పాట్లు జరిగేవి. అమ్మీజాన్ ఫజ్ర్ నమాజ్

తరువాత 'తల్బియా' పఠిస్తూ, మా అందరినీ ఈద్‌నమాజ్ కోసం సంసిద్ధం చేసేవారు. మేము రూంలో నమాజ్ కోసం సముచిత ఏర్పాట్లు చేస్తుండగానే మహిళల రాక ప్రారంభమయ్యేది. అందరూ వరుసలుగా కూర్చుండేవారు. ఆ తరువాత అందరూ కలిసి 'తల్బియా' పఠించేవారు. సూర్యోదయం కాగానే స్త్రీలకు 'తక్బీర్' గురించి ఆదేశించడం జరిగేది. తరువాత అమ్మీజాన్ అత్యంత మధుర కంఠంతో ఈద్‌నమాజ్ చేయించేవారు. నమాజ్ తరువాత ఖుత్బా ప్రసంగం ఉంటుండేది. దుఆ జరిగిన తరువాత అందరికీ సేమియాలు తినిపించేవాళ్ళం. ఈద్ శుభాకాంక్షలు తెలుపుకుంటూ ఎవరింటికి వారు వెళ్ళిపోయేవారు.

# 6. అబ్బాజాన్ ప్రథమ నిర్బంధం

పాత విషయాలు నెమరువేసుకుంటుంటే ఆనాటి దృశ్యాలు కళ్ళముందు కదులాడుతున్నట్లు అగుపిస్తాయి.

అది రాత్రి సమయం. అమ్మీజాన్ చిన్నపిల్లలమైన మమ్మల్ని అక్కున చేర్చుకొని నిలబడి ఉన్నారు. ఇద్దరు లేడీ కానిస్టేబుళ్ళు అమ్మీజాన్‌ను, మొత్తం ఇంటిని సోదాచేస్తున్నారు. అబ్బాజాన్ దుస్తులు ఒక సూట్‌కేసులో సర్దుకొని ఎక్కడికో వెళ్ళటానికిసిద్ధంగా ఉన్నారు. అకస్మాత్తుగా అబ్బాజాన్ మావైపు తిరిగి చూడకుండానే కాస్త ఉచ్ఛస్వరంతో 'అస్సలాము అలైకుమ్, ఖుదా హాఫిజ్, ఫీఅమానిల్లాహ్' అంటూ వడివడిగా నడిచివెళ్ళి పోలీస్‌జీపులో కూర్చున్నారు. పోలీస్ జీపు వెళ్ళిపోయింది. ఇది ఆయన మొట్టమొదటి నిర్బంధం. ఇది 1948 అక్టోబర్ 4వ తేదీన జరిగింది. అప్పుడు నా వయస్సు ఎనిమిది సంవత్సరాలు. తరువాత నేను అమ్మీజాన్‌ను, 'అబ్బాజాన్ పోతున్నప్పుడు మావైపు తిరిగి చూడ లేదెందుకని?' అని అడగగా అమ్మీజాన్ ఎంతో ప్రశాంతంగా ఇలా సమాధాన మిచ్చారు. "హజ్రత్ ఇబ్రహీం(అలై) కూడా మక్కానుండి తిరిగిపోతున్నప్పుడు,

హజ్రత్ హాజిరా (అలై), హజ్రత్ ఇస్మాయీలు(అలై)ల వైపు తిరిగి చూడలేదుగా! అసలు విషయం ఏమిటంటే తిరిగి చూడడం వల్ల లక్ష్యంలో, సంకల్పంలో బలహీనత వచ్చేస్తుంది." అమ్మీజాన్ మాకు తరచుగా దైవప్రవక్తల గాథలు వినిపిస్తూ ఉండేవారు. అందుకని ఈ ముక్తసరి మాటలు మాకు విషయాన్ని అర్థం చేసుకునేటట్లు చేశాయి.

అబ్బాజాన్‌ను నిర్బందించినప్పుడు ఇంట్లోడబ్బులు అతిస్వల్పంగానే ఉన్నాయి. అందుకని అమ్మీజాన్ జీవనసరళిని పూర్తిగా మార్చివేశారు. చాకలికి బట్టలు వేయడం మానేసి తానే స్వయంగా ఉతకడం ప్రారంభించారు. నిజానికి, ఒక్క చేతిరుమాలు కూడా తానే స్వయంగా ఉతుక్కోని ఢిల్లీకి చెందిన సంపన్న కుటుంబం నుండి వచ్చిన అమ్మాయి ఆమె. వంట మనిషిని పని నుండి మాన్పించారు. తానే స్వయంగా వంట ప్రారంభించారు. ఆ కాలంలో 'అభ్రా' నుండి ఒకామె క్రమం తప్పకుండా 'జుమా నమాజు' కోసం వస్తుండేది. గుర్రబ్బగ్గీ నడిపే ఓ వ్యక్తి వితంతువు చెల్లెలామె. ఆమె మారాం చేసి మా ఇంటికి మకాం మార్చింది. ఇంటి పనులన్నీ తన మీద వేసుకున్నది. దుస్తులు ఉతికిపెట్టేది. పిండి విసిరి రొట్టెలు చేసి, బట్టీలో కాల్పించి తెచ్చిచ్చేది. ఆవిడ అమ్మీజాన్‌తో ఎలాంటి అరమరికలు లేకుండా, 'మీరు దైవకార్యం కొన సాగించండి. మీ ఇంటిపనులు నేను చేస్తుంటాను' అని చెప్పేసింది కూడా. ఆమె పేరు 'భాగ్‌భరి' (అదృష్టవంతురాలు) కాని ఈ పేరు మాకు అర్థంకాక మేమందరం ఆమెను 'రస్‌భరి' అని పిలిచేవాళ్ళం. పాపం! దీనికామె ఎప్పుడూ అపార్థం చేసుకోలేదు.

మా అమ్మీజాన్ ఎల్లప్పుడూ 'యా హయ్యు యా ఖయ్యూం బి రహ్మతిక అస్తగీస్' అనే దుఆను పఠిస్తూ ఉండేవారు. ఒకసారి ఉబ్బసం వ్యాధి తీవ్రమైపోయింది. బాధను భరించలేకపోతున్నారు. అనాలోచితంగా ఆమెగారి నోటినుండి ఈ వాక్యాలు వెలువడ్డాయి. "నా భర్త జైల్లో ఉన్నారు. నాకేమైనా అయితే నా పిల్లలు ఏడ్చేస్తారు. వారిని ఓదార్చేవారు కూడా ఎవరుండరు!" ఇది

విన్నంతనే దాదిఅమ్మ తీవ్రమైన అసంతృప్తిని వ్యక్తపరుస్తూ, "అలా నిరాశగా ఎందుకు మాట్లాడుతున్నావు. ధైర్యంగా ఉండు, కాస్త దమ్ము ఎక్కగానే అలా బేల అయిపోతావేమిటి?" అంటూ కోపగించుకున్నారు.

మా దాదిఅమ్మ అత్యంత ధైర్యశాలి. క్షమాసైర్థ్యాలు కలిగిన మహిళ. ఆమె అమ్మీజాన్‌కు తరచుగా ఇలా హితోపదేశం చేస్తుండేవారు. "కష్టసుఖాల్ని ఎదుర్కొనేటట్లు పిల్లల్ని తీర్చిదిద్దు. ఎల్లప్పుడూ సుఖానికి అలవాటుపడేలా పెంచకు. ఒకసారి పంచభక్ష పరమాన్నాలు తినిపించు. బంగారు ముద్ద నోట్లో పెట్టు. కాని ఇంకొకసారి కేవలం పప్పన్నం పెట్టు. పచ్చి మిరియంతోనైనా సరే కాలం గడుపుకునేలా అలవాటు చెయ్యి. పిల్లల్ని ఎప్పుడూ ఒకేరకంగా అల వాటు పడేలా చేయకు. వారు కోరిందల్లా ఇచ్చుకుంటూ పోకు. తల్లిదండ్రులైతే అవలీలగా వారు కోరిందల్లా ఇస్తూ వారి అలవాట్లను చెడగొడతారు. కాని ప్రపంచం వారిని అలా చూడదు. గొప్ప గొప్ప వాళ్ళను వంచేస్తుందీ ప్రపంచం!" ఇంకా ఇలా చెబుతుండేవారు. "నా పిల్లల్ని నేనలాగే పెంచాను. ఒకసారి పంచభక్ష పరమాన్నాలు పెడితే, ఇంకొకసారి కేవలం చట్నీతో తినిపించాను."

బహుశ ఈ కారణంగానే కావచ్చు, మా అబ్బాజాన్ ఎన్ని కష్టాలొచ్చినా ఎన్ని అవాంతరాలు వచ్చినా నిబ్బరంగా ముందుకు సాగేవారు. ప్రతి కష్టాన్నీ ఓర్చుకున్నారు. ప్రతి ప్రమాదాన్ని ఎదుర్కొన్నారు. ఆయన నవనాడులు ఉక్కును మరిపించేవి. తన తెగిపోయిన చొక్కా గుండీ (బటన్)ని ఆయనే స్వయంగా కుట్టుకునేవారు. చిరిగిన చొక్కాను తానే స్వయంగా కుట్టుకునే వారు. మొదటి నిర్బంధం తరువాత ఆయన సిద్ధంచేసి ఉంచుకున్న జైలు కిట్‌లో సూది, దారంతో సహా అన్నిరకాల, అన్ని సైజుల బటన్‌లు కూడా ఉండేవి.

మా దాది అమ్మా నిజంగానే ఒక వలియుల్లాహ్ (దైవమిత్రురాలు) లాంటివారు. దైవాన్నే సంపూర్ణంగా నమ్ముకున్నవారు. ఆమె ఎప్పుడైనా వ్యాధిగ్రస్తురాలైతే, ఆకాశం వైపుకు దృష్టి నిలుపుతూ ఎంతో భావోద్రేకాలు

ఉట్టిపడేలా వినయ వినమ్రతలతో అల్లాహ్‌ను వేడుకుంటూ, ఇలా పలికేవారు. 'మన్‌మరీజమ్- తూతబీబమ్' అంటే దాని అర్థం నేను రోగిని నీవు వైద్యుడివి అని అంతే! ఆమెకు వెంటనే స్వస్థత చేకూరేది. ఆమెగారు జీవితాంతం ఎన్నడూ డాక్టర్ దగ్గరికి వెళ్ళలేదు, ఏ మందూ త్రాగలేదు. ఎప్పుడైనా శరీరంపై ఎక్కడైనా పుండూ లేదా కురుపు కనబడితే దానిపై చేయిపెట్టి 'ఓ కురుపా! ఇక పెరుగకు! మన దేవుడు అందరికన్నా గొప్పవాడు అని అనేవారు. ఇలా పలికినంతనే ఆ కురుపు క్రమంగా తగ్గుతూపోయేది. ఆమె పారశీకభాషా సాహిత్యంలో స్కాలరు. తరచుగా ఆమె ప్రతిమాటకు సమాధానం పారశీక పద్యపాదాల్లోనే ఇస్తుండే వారు.

దాది అమ్మ ఏ సభలో, సమావేశంలో పాల్గొన్నా అదెంత పెద్దదైనా సరే దాన్ని తన వ్యక్తిత్వంతో ప్రభావితం చేయకుండా విడిచిపెట్టేవారు కాదు. ఆమె ఉండగామరెవ్వరూ అసలు మాట్లాడలేకపోయేవారు. అందరూ ఆమెనే వింటూ, ఆమెనే చూస్తుండిపోయేవారు. ప్రతి సభకు ఆమె జీవంలాంటిది. ఒక్కసారి ఎవరైనా ఆమెను విన్నా, ఆమెతో మాట్లాడినా ఇక జీవితాంతం ఆమెను మరిచి పోలేకపోయేవారు. సమయోచితంగా మాట్లాడటం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య. ఎంత సమయస్ఫూర్తిగా మాట్లాడేవారంటే, ఆమె మాటలు వినే వారి హృదయాల్లో నాటుకుపోయేవి. తన వాక్చాతుర్యం, హాస్య ప్రావీణ్యంతో అందరినీ నవ్వించేవారు. కాని తాను మాత్రం గంభీరంగా ఉండే వారు. తాను మాత్రం ముఖం ముడుచుకొని కూర్చుండి మమ్మల్ని మాత్రమే నవ్విస్తుంటే ఆమె ముఖకవళికలు చూసి మాకు నవ్వాగేది కాదు.

మా మామయ్య జలాల్ 'కింగ్ ఎడ్వర్డ్ మెడికల్ కాలేజీ' లాహోర్‌లో చదువుతుండేవారు. ఒకసారి ఆయన మనమిద్దరం వచనంలోగాక, కవిత్వంలో మాట్లాడుకుందామా?' అని దాదిఅమ్మతో పందెం కాశారు. దాదిఅమ్మకైతే ఎవరి సహాయం తీసుకోవాల్సిన అవసరం ఏర్పడలేదు. కాని, మామయ్య మాత్రం తరుచుగా పద్యపాదం తెలుసుకోవడానికి అమ్మీజాన్‌ను ఆశ్రయించ వలసి వచ్చింది. మొదటి పాదం అయితే జ్ఞాపకం ఉంది కాని రెండవభాగం

జ్ఞాపకం రావడంలేదు. దాదిఅమ్మ రెండవ పాదం చెప్పకుంటే వదిలిపెట్టదు. తప్పు చదివినా ఊరుకోదు. కాస్త మీరే సహాయం చేయాలి' అంటూ అమ్మీజాన్‌ను వేడుకున్నారు. అమ్మీజాన్ మామయ్యకు ఏదైనా సహాయం చేస్తే పందెం నిబంధనల్ని ఉల్లంఘించినట్లవుతుంది. అదీ తప్పే. కనుక అమ్మీజాన్ ఈ విషయంలో దాదిఅమ్మా అనుమతి కోరారు. జలాల్‌మియాకు నేను కాస్త సహాయం చేయొచ్చా?'అని. దానికి దాదిఅమ్మ "పిల్లవాడు! సహాయం కోరు తుంటే తప్పులేదు" అంటూ సంతోషంగానే అనుమతించారు. ఇంతచేసినా కూడా వారం రోజులలోగానే మామయ్య పందెం ఓడిపోయారు. చెవులు పట్టు కుంటూ ఇక జీవితంలో ఇంకెప్పుడూ దాదిఅమ్మతో పందెం కాయను. అంటూ తన ఓటమిని అంగీకరించారు.

మా అమ్మీజాన్ ఇలా చెబుతుండేవారు. నేను నా పూర్తి జీవితంలో మీ దాదిఅమ్మలాంటి మోహరహితమైన (కోరికల్లేని) వేరొక మహిళను చూసి ఎరుగను. ఆమెకు ఏ కోరికాగాని, ఏ ఆకాంక్షగాని లేదు. దాదిఅమ్మా ఇలా చెబుతుండేవారు. "సూఫీల్లోని ప్రత్యేక గుణమేమిటంటే వారెవరినీ ఆక్షేపిం చరు. ప్రలోభానికి గురికారు. ఏదీ కూడబెట్టుకోరు." కాకతాళీయంగా ఈ మూడు గుణాలు కూడా దాదిఅమ్మ, అబ్బాజాన్, అమ్మీజాన్ ముగ్గురిలోనూ ఉండేవి. విధికి రాజీపడడం, ఓర్పు సహనంలాంటి మహోన్నత గుణాలు ఈ ముగ్గురిలోనూ ఉండేవి. విధికి రాజీపడడం, ఓర్పు సహనంలాంటి మహోన్నత గుణాల్ని ఈ ముగ్గురు తమ జీవితాల్లో ఎంతగా అలవాటు చేసుకున్నారంటే వారి జీవితాలు 'నఫ్సె ముత్‌మయిన్నా' (సంతృప్తాత్మ)కు ప్రతీకలుగా నిలిచాయి.

అమ్మీజాన్ చెబుతుండేవారు 'నేను జీవనసరళిని (విధానాన్ని) మీ దాదిఅమ్మ నుండి నేర్చుకున్నాను. విచిత్రమేమిటంటే అత్తాకోడళ్ళు ఇద్దరూ ఎప్పుడూ ఏకాభిప్రాయమే కలిగి ఉండేవారు. వీరిద్దరిలో ఎన్నడూ ఎలాంటి విభేదాలు పొడసూపలేదు.

మొదటిసారి అబ్బాజాన్ జైలుకు వెళ్ళినప్పుడు మా ఆర్థిక పరిస్థితులు గడ్డుగా మారాయి. అయినా పిల్లల చదువు మాత్రం కొనసాగిస్తానని అమ్మీజాన్ దృఢనిశ్చయం చేసుకున్నారు. మా అమ్మీజాన్‌కు చిరకాల సన్నిహితురాలైనా 'ఖుర్షీద్ ఖాలా' ఒకసారి ఆమెను చూసిపోదామని మా ఇంటికి వచ్చారు. అమ్మీజాన్ కొన్ని నగల్ని ఆమెకిస్తూ వాటిని అమ్మిపెట్టాల్సిందిగా కోరారామెను. ఈవిధంగా అమ్మీజాన్ పిల్లల చదువు ఖర్చులు, ఇంటిఖర్చులు అత్యంత పొదుపుగాను, క్రమబద్ధంగాను చేస్తూ కాలం గడపసాగారు.

'ఈదుల్ ఫితర్' 'ఈదుల్ అజ్‌హా'లాంటి పండుగలు వచ్చినప్పుడుగాని లేక బంధువుల ఇళ్ళలో వివాహాలు జరిగిన సమయాల్లోగాని కొత్తబట్టలు కుట్టించడం మా ఇంట్లో ఆనవాయితీ కాదు. అమ్మీజాన్ మాకుముందే చెప్పే వారు. రంజాన్‌లో జకాత్ చెల్లించవలసి ఉంటుంది కనుక ఈదుల్ ఫితర్ కోసం కొత్త బట్టలు రావు, ఈదుల్ అజ్‌హా సమయంలో ఖుర్బానీ ఇవ్వాల్సి ఉంటుంది కనుక అప్పుడు కూడా కొత్త బట్టలకు అవకాశంలేదు. ఉతికిన దుస్తులే వేసుకొని నమాజ్‌కు వెళ్ళాలి' అదేవిధంగా ప్రతి వివాహ సందర్భం లోనూ కొత్త బట్టలు తొడిగే అవసరమే రాలేదు మాకు.

'ఈ రోజుల్లో పండుగ రోజున పిల్లలకు కొత్త బట్టలు సమకూర్చలేక పోయాయని ఒక తల్లి నిప్పంటించుకొని ఆత్మహత్య చేసుకుందని, లేదా తన పిల్లలకు పండుగ సందర్భంలో కొత్త వస్త్రాలు తేలేకపోయాననే బాధతో ఒక తండ్రి ఉరివేసుకొని చనిపోయాడని పత్రికల్లో వార్తలు చదువుతూ ఉంటే నాకు ఎంతో ఆశ్చర్యం వేస్తుంది.

ఒకసారి ఇంట్లో పిండి అయిపోయింది. చీకటిపడడంతో పిండి మరలు కూడా మూసేసుకున్నారు. మా పని మనిషి కరీమా బీబీ, పక్కింటివాళ్ళ నుండి పిండి అరువుగా తెచ్చింది. ఇది తెలిసినంతనే అమ్మీజాన్ 'ఎంతపనిజేశావు?' అంటూ ఆమెపై కోపాన్ని ప్రదర్శించారు. ఆమె, 'బీబీజీ! వారు కూడా అనేకసార్లు మన వద్దనుండి అరువు తీసుకెళ్ళారు. పిండి పట్టించిన తరువాత వాపసు

ఇచ్చేశారు. రేపు మన పిండిరాగానే మనమూ ఇచ్చేస్తాంగా!' అంటూ కరీమా బీబీ సంజాయిషి ఇచ్చుకుంది. అయినా అమ్మీజాన్ ఊరుకోలేదు. "వారి విషయం వేరు. వారెంత కావాలనుకున్నా బయటినుండి అరువు తెచ్చుకుంటారు. కాని మనం అలా చేయలేం. ప్రజలేమనుకుంటారు? ఇటు మౌలానా గారు జైలుకెళ్ళారో లేదో అటుఆయన ఇంటివారు పిండి కూడా పక్కింటివాళ్ళ నడిగి తింటున్నారు' అని అనుకోరా? ఇంట్లో పిండి లేకపోతే మనమేదో రకంగా గడుపుకొనేవాళ్ళం. కిచిడి వండుకునేవాళ్ళం. ఏదో ఒకటి తిని పూట వెళ్ళదీసుకునేవాళ్ళం. కాని నీవలా అరువు తేవడం ఎంతమాత్రం సమంజసంగా లేదు." అంటూ ఆమెను ఎంతగా మందలించారంటే ఇక ఆ తరువాత ఆమె ఎన్నడూ ఇల్లాంటి పొరపాటు చేయలేదు.

అమ్మీజాన్ చెబుతుండేవారు. "ప్రపంచంలో ఏదీ లేకపోయినా గడువుకోవచ్చు. గడుపుకోవచ్చు కాదు, గడుపుకోవాలి!" క్లుప్తంగా చెప్పవచ్చిందేమిటంటే అల్లాహ్ దయవల్ల ఆ కష్టకాలం కూడా గడిచిపోయింది. 19నెలల 25రోజుల నిర్బంధం తరువాత, 1950మే 28వ తేదీన పూలమాలలతో అబ్బాజాన్ ఇంటికి చేరుకున్నారు. శుభాకాంక్షలు తెలిపేవారితో ఇల్లు నిండిపోయింది.

# 7. అబ్బాజాన్ రెండవ నిర్బంధం- మరణశిక్ష

1953 మార్చి 28వ తేదీన 'మార్షల్ లా' చట్టం కింద అబ్బాజాన్ రెండవసారి నిర్బంధించబడ్డారు. తిరిగి అదే గడ్డుకాలం. ఓవైపు పరిమితంగా ఉన్న డబ్బు, మరోవైపు ఎనమండుగురు చిన్న పిల్లలతోపాటు ఉబ్బసంతో బాధపడుతున్న బలహీన ఆరోగ్యం గల అమ్మీజాన్. అయినాసరే ధైర్యంగా ఆమె పరిస్థితుల్ని ఎదుర్కొన్నారు. ఒకసారి ఓ గాజును అమ్మి, మరోసారి ఓ ఉంగరాన్ని అమ్మించి, ఇంటి ఖర్చులు వెళ్ళదీసుకొనేవాళ్ళం. (ఈ అమ్మకాల విషయం ఖుర్షీద్ ఖాలా చూసుకుంటుండేవారు). తిరిగి యధారీతిగా

స్వయంగా వంట చేసుకోవడం, మిగిలిన ఇంటిపనులు కూడా స్వయంగా చేసుకోవడం మొదలయింది. ఈసారి మార్షల్ లా చట్టాల ప్రకారం, సైనిక కోర్టులో అబ్బాజాన్‌పై కేసు పెట్టారు. 'ఖాదియానీ'లకు వ్యతిరేకంగా, అబ్బాజాన్ ఒక కరపత్రం రాసినందుకు ఈ కేసు పెట్టడం జరిగింది. 1953 మే 9వ తేదీకల్లా ఈ కేసు విచారణ పూర్తయింది.

అది 1953 మే 11వ తేదీ ఉదయం అమ్మీజాన్ టిఫిన్లు సిద్ధం చేయ డంలో నిమగ్నమై ఉన్నారు. మేము పిల్లలమంతా స్కూల్‌కు వెళ్ళడానికి సిద్ధమై టిఫిన్ల కోసం ఎదురుచూస్తున్నాం. ఇంతలోనే మా పెద్దన్నయ్య ఉమర్ ఫారూఖ్ (జన: 1938, ఏప్రిల్2) ఓ వార్తాపత్రిక చేత పట్టుకొని తత్తరపాటుతో ఇంట్లో ప్రవేశించారు. అమ్మీజాన్‌ను ఓ పక్కకు పిలిచి పత్రికను చూపించారు. ఆ పత్రికలో ఏముందో తెలియదుగాని, అది చూసినంతనే అమ్మీజాన్ ముఖం పాలిపోయింది. కాని కొంచెం సేపట్లోనే తేరుకొని పత్రికను దాచేశారు. మారు మాట్లాడకుండా మునుపటిలాగే మా కోసం రొట్టెలు కాల్చసాగారు. మా అందరికి టిఫిన్లు పెట్టించి స్కూలుకు పంపించారు. ఆ తరువాత లోపలికెళ్ళి 'ఆకాభాయి' (సయ్యద్ ఉమర్ ఫారూఖ్)ను కూడా స్కూలుకెళ్ళమని ఆదేశించారు. 'లేదు అమ్మీజాన్! నేనీరోజు స్కూలుకు వెళ్ళలేను. అంటూ చెప్పిన ఉమర్ అన్నయ్య మాటలు మాకు వినిపించాయి. మా రెండో అన్నయ్య అహ్మద్ ఫారూఖ్ (జననం: 1939 మే11, ఢిల్లీ) ఇంటినుండి స్కూలు కని కొంచెం దూరం వెళ్ళాడో లేదో ఎదురుగా ఒక పేపర్ హాకర్ 'మౌలానా మౌదూదీగారికి ఉరిశిక్ష విధించబడింది' అంటూ పెద్దగా అరుస్తూ పేపర్ అమ్ముకుంటున్నాడు. తనముందు యూనిఫాంలో సైకిల్‌మీద స్కూలు కెళుతున్న ఆ అబ్బాయి తండ్రే మౌలానా మౌదూదీ అనే విషయం పాపం ఆ హాకర్‌కేం తెలుసు? పేపరు అమ్ముడుపోవాలనేదే అతని ధ్యాస. ఇది విన్నంతనే అహ్మద్ అన్నయ్య కూడా మార్గమధ్యం నుండే ఇంటికి వచ్చేశారు.

నేనూ, చెల్లాయి అస్మా (జననం: 1941, డిసెంబరు23, ఢిల్లీ) ఇద్దరం స్కూలుకెళ్దామని బజారులోకి రాగానే హాకర్ల కేకలు వినిపించాయి. 'మౌలానా

మౌదూదీకి ఉరిశిక్ష! అప్పుడుగాని పరిస్థితి మాకు అర్థంకాలేదు. ఇందుకేనేమో అన్నయ్య ఉమర్ ఫారూఖ్ ఎంతో భయాందోళనలతో పేపరు తీసుకొచ్చి అమ్మీజాన్‌కు చూపించడం, అమ్మీజాన్ ముఖం పాలిపోవడం జరిగింది. అవన్నీ అప్పుడుగాని మాకు అర్థంకాలేదు. అయినా మేమిద్దం తిరిగి ఇంటికి రాకుండా తిన్నగా స్కూలుకే వెళ్ళాం.

మేమప్పుడు 60- ఫేరోజ్‌పూర్ రోడ్‌లోని గవర్నమెంట్ స్కూల్లో చదువు కుంటున్నాము. ఇంటినుండి కాలినడకనే స్కూలుకెళ్ళేవాళ్ళం. స్కూల్లో మమ్మల్ని చూసినవారంతా నిర్ఘాంతపోయారు. మా హెడ్ మిస్ట్రెస్ ఒక క్రైస్తవ మహిళ. స్కూల్ అసెంబ్లీలో ఆమె దృష్టి మాపై పడగానే ఆమె బాలికల్ని సంబోధిస్తూ ఇలా ప్రసంగించారు. "చూడండి! మార్గదర్శకులంటే ఇలా ఉంటారు. తండ్రికి ఉరిశిక్ష విధించబడింది. కూతుళ్ళు శుభ్రమైన యూనిఫారం వేసుకొని స్కూల్ అసెంబ్లీలో ప్రశాంతంగా నిలబడి ఉన్నారు. ఇలాంటి రోజు, ఈ సమయంలో కూడా తన పిల్లలకి చక్కగా జడలు వేసి, శుభ్రమైన దుస్తులు తొడిగించి, భోజనంపెట్టి స్కూలుకు పంపించిన ఆ తల్లికి శుభాకాంక్షలు. ఇది ఈ బాలికల గొప్పతనం కాదు, ఆ తల్లిఘనత. నేటి (విపత్కర) రోజు కూడా ఆమె తన పిల్లల విద్యకే ప్రాధాన్యతనిచ్చింది. ఆమెకు బదులు ఏ మూర్ఖ స్త్రీనోఅయిఉంటే ఏడుస్తూ పెడబొబ్బలు పెడుతూ వాడనంతా చుట్టేసివచ్చేది." మా హెడ్‌మిస్ట్రెస్‌గారు ఇంకా ఇలా అన్నారు. 'సామాన్య జనానికి, లీడర్లకి నడుమ ఉండే బేధం ఇదే'అప్పుడు నేను తొమ్మిదవ తరగతిలో, చెల్లాయి ఏడవ తరగతిలో చదువుతున్నాము.

ఆ హెడ్ మిస్ట్రెస్ క్రైస్తవురాలు అయినా అలా మాట్లాడింది. కాని మా స్కూల్లోని ఇతర ముస్లిం టీచర్లు వేరే రకంగా మాట్లాడారు. "వీరెక్కడి లీడర్లు! పాకిస్తాన్ (ఏర్పాటు)ను వ్యతిరేకించిన ద్రోహులు వీరు! అమ్మాయిల్ని చూడండి, ఎంతటి మోసగత్తెలు. ఇదంతా ఆక్టింగ్ లెండి! తెలివైన తల్లికి తెలివైన కూతుళ్ళు."

స్కూల్‌నుండి 5-ఎ జేల్దార్ పార్క్‌లోని మా ఇంటికి వచ్చేసరికి అక్కడి పరిస్థితే పూర్తిగా మారిపోయి ఉంది. రోడ్డంతా జనంతో కిటకిటలాడుతోంది. ఇతర పట్టణాలు, దూరప్రదేశాల నుండి జనాల్ని తీసుకువచ్చిన బస్సులు చాలా దూరంవరకు నిలబడి ఉన్నాయి. మేమిద్దరం జనాన్ని దాటుకుంటూ ఇంటికి చేరేసరికి గగనమైపోయింది. ఇక ఇంటి గుమ్మం నుండి లోపలికి వెళ్ళడం అసాధ్యమనిపించింది. కొందరు పెడబొబ్బలు పెడుతూ ఏడుస్తున్నారు. కొందరు మౌనంగా కన్నీరు కారుస్తున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో స్కూలు బ్యాగులు చంకల్లో వేసుకొని నిశ్శబ్దంగా వస్తున్న మమ్మల్ని చూసి వారు నిర్ఘాంతపోయారు. కొందరు కన్నీళ్ళను తుడుచుకుంటూ, "మౌలానా పిల్లలే ఏడ్వకుండా ఓర్పు, సహనాలతో పరిస్థితుల్ని ఎదుర్కొంటున్నప్పుడు, మనం ఏడుస్తూ సహనాన్ని కోల్పోవడం ఏమంత బాగాలేదు' అంటూ ఒకరికొకరు ఓదార్చుకుంటున్నారు. సహనం అంటే ఇదేనెమో అన్నారు కొందరు. అతికష్టం మీద జనాన్ని దాటుకుని మా బ్లోకి ప్రవేశించాము. ఇల్లంతా స్త్రీలతో నిండిపోయి ఉంది. మమ్మల్ని పరామర్శించడానికి వచ్చిన మహిళలు భోరున ఏడుస్తున్నారు. అమ్మీజాన్ వారిని ఓదారుస్తున్నారు. సహనం, ఓర్పు వహించమని వారికి ఉపదేశిస్తున్నారు. దాదిఅమ్మ వాలకమూ అదే. మమ్మల్ని చూడగానే అమ్మీజాన్ కేవలం 'బేటా! అధైర్యపడకండి! సహనం వహించండి!'' అని మాత్రమే చెప్పి మాకు భోజనం వడ్డించారు. తిరిగి మహిళల్లోకి పోయి కూర్చున్నారు.

ఓ మహిళ అమ్మీజాన్‌కు ఇచ్చిన సలహా ఇది: 'బేగం సాహబా! ఈ రోజు రాత్రి వంద రకాతుల నఫిల్ నమాజు 'సలాతుల్ హాజత్'చేసి, తహజ్జుద్ నమాజ్ తరువాత మౌలానా గారి ప్రాణం రక్షించమని ఆయన శ్రేయం, శ్రేయస్కరాలకోసం వినమ్రతలతో అల్లాహ్‌ను వేడుకోండి. మౌలానాగారు క్షేమంగా ఇంటికి చేరుకున్న తరువాత తిరిగి ఇదేవిధంగా వంద రకాత్‌ల నఫిల్ నమాజు సలుపుతానని అల్లాహ్‌ను మొక్కుకోండి'

ఆ రాత్రంతా అమ్మీజాన్ నమాజ్‌లోనే గడిపారు. ఎప్పుడూ తెలివి వచ్చి చూసినా (ఆ పరిస్థితుల్లో అసలు నిదురవస్తేగా!) అమ్మీజాన్ నమాజ్‌లోనే నిమగ్నమై ఉండడాన్ని చూశాం.

ఫజర్ అజాన్‌తోటే మేమంతా లేచికూర్చున్నాం. ఫజర్ నమాజ్ తరువాత యధారీతిగా అమ్మీజాన్ దర్సె ఖుర్‌ఆన్ కోసం దివ్యఖుర్‌ఆన్‌ను తెరిచారు. ప్రతిరోజూ వరుసక్రమంలో చదువుతూ వస్తున్న రీతిలోనే అమ్మీజాన్ చదవడం ప్రారంభించారు. ఆరోజు అమ్మీజాన్ ముందుకొచ్చిన 'సూరె బఖరా' ఆయత్‌ను చూసి మాకాశ్చర్యం వేసింది. ఆ ఆయత్ ఇలా ఉంది.

'స్వర్గ ప్రవేశం ఊరకే లభిస్తుందని మీరు పొరపడుతున్నారా? మీకు పూర్వం విశ్వాసులకు సంభవించినవన్నీ ఇంకా మీకు సంభవించనే లేదే! వారిపై ఆపదలు, ఎనలేని వ్యధలు విరుచుకుపడ్డాయి. వారు కుదిపివేయ బడ్డారు. చివరకు అప్పటి ప్రవక్త, విశ్వాసులైన అతని అనుచరులు అల్లాహ్ సహాయం ఇంకా ఎప్పుడొస్తుంది' అని ఆక్రోశించారు. అప్పుడు, అదిగో, అల్లాహ్ సహాయం సమీపంలోనే ఉంది. (అని వారిని ఓదార్చడం జరిగింది) (అల్‌బఖర- 214)

ఈ ఆయత్‌ను చదువుతూ అమ్మీజాన్ కళ్ళనుండి కన్నీరు జలజల కారసాగాయి. తరువాత నన్ను పిలిచి, ఆ ఆయత్‌ను చూపిస్తూ, చూడు! సజీవ గ్రంథమిది. ఇది మానవునిలో ఉన్న లోపాలను వేలెత్తి చూపుతోంది. ఆంతర్యంలో ఏముందో అది దొరకబట్టుకుంటుంది. బాధపడుతున్న మనిషికి ఉపశమనం కలిగిస్తుంది. నీవు దానితో సంబంధాన్ని ఏర్పర్చుకోవడమే ప్రధాన షరతు. ఆ తరువాత ఇది నీతో, నీ పరిస్థితుల్ని, నీ ఆంతర్యాన్నిబట్టి వ్యవహరిస్తుంది. నీకు సలహా ఇస్తుంది. నిన్ను ఓదారుస్తుంది. ఇదే చూడు! సరిగ్గా మన పరిస్థితుల్ని, మన ఆంతర్యాన్ని ఎరిగే అది మమ్మల్ని ఎలా ఓదారుస్తోందో, మన గాయాలపై అదెలా నవనీతాన్ని పూస్తుందో గమనించు!'

ఆ సమయంలో నా వయస్సు పదమూడు సంవత్సరాలే. కాని అందరిలో పెద్దకూతురు తల్లికి ఓ చెల్లిగానో, ఓ స్నేహితురాలుగానో కనబడు

తుందని చెబుతారు. అందుకని అమ్మీజాన్, తన మనస్సులో ఉన్నదంతా నాకు చెబుతూ ఉండేవారు. నానుండే తరచూ సలహాలు తీసుకుంటూ ఉండేవారు. ఆవిధంగా నేను అమ్మీజాన్ రహస్యాలన్నీ ఎరిగినదాన్ని. నాపై తనకు అమిత మైన విశ్వాసం ఉండేది. అయినప్పటికీ వాటిగురించి ఆలోచిస్తూఉంటే, ఆమె నాతో అలా మాట్లాడిన ఆ మాటలు ఆమె తనను తాను సంబోధించుకొని మాట్లాడిన మాటలా? అని అనిపిస్తాయి. ఇలాంటి సంభాషణ మరెవ్వరితోనూ జరుగలేదు. ''కూతుళ్ళు లేనివారు ఎంత దురదృష్టవంతులు'' అనేమాట తరచుగా అంటుండేవారు. ఈ కారణంగానే తన ముగ్గురు కూతుళ్ళను ఎంత లాలనతో, వాత్సల్యంతో, ఎంత గారాబంతో పెంచి పెద్దచేశారో, చదివించారో, అంతటి లాలన, ప్రేమ వాత్సల్యాలు కుమారులకు లభించి ఉండలేదు. తరువాతి కాలంలో అబ్బాజాన్ కూడా తన మనసులోని మాటల్ని నాతోనూ, అస్మా చెల్లెలుతోనూ చెబుతుండేవారు.

ఇక ఆ రోజంతా అమ్మీజాన్ ప్రశాంతంగా గడిపేశారు. ఆమె పదేపదే ఈ ఆయత్‌ను మననం చేస్తుండేవారు. ఇంకా ఇలా అనేవారు. ''ఖుర్‌ఆన్ మొత్తం కోసమే మనం అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకోవడం వాజిబ్ (తప్పని సరి). ఆయన ఇలాంటి సజీవ గ్రంథాన్ని మనకు ప్రసాదించాడు. అయితే ప్రత్యేకించి ఈ ఆయత్ మనకోగొప్ప వరం. ఈ సంక్లిష్ట సమయంలో అది మనకు ధైర్యాన్నిచ్చింది, శుభవార్తను తెలిపింది. మనల్ని ఆదుకున్నది.''

రెండో రాత్రి కూడా గడిచిపోయింది. అమ్మీజాన్ ప్రశాంతంగా ఉన్నారు. బయట మగవాళ్ళు, లోపల స్త్రీలతో ఇల్లు కిటకిటలాడుతుంది. బయటినుండి స్త్రీలు రోధిస్తూ వచ్చేవారు, ఇంట్లోకి వచ్చాక అమ్మీజాన్, దాదిఅమ్మల సహ నాన్ని చూసి తమ ఏడ్పును మానేసి ప్రశాంతంగా కూర్చుండిపోయేవారు.

అబ్బాజాన్‌కు ఉరిశిక్ష పడిందనే విషయం తెలియగానే దేశం మొత్తాన నిరసన ప్రదర్శనలు, ధర్నాలు, హర్తాళ్ళు, బంద్‌ల పెనుతుఫాను లేచింది. ముస్లిమ్ దేశాల్నుండేకాకుండా ముస్లిమేతర దేశాల్లోని ముస్లింల తరఫున

కూడా పాకిస్తాన్ గవర్నరు జనరల్, ప్రధానమంత్రుల పేర టెలిగ్రాంలు వర్షంలాగా వచ్చిపడుతున్నాయి. ప్రతిస్పందన, ప్రతిఘటనలు అత్యంత తీవ్రస్థాయిలోనూ, అన్నివైపుల్నుండీ వచ్చిపడేసరికి ప్రభుత్వం ఉక్కిరిబిక్కిరైంది.

మే 13వ తేదీన అమ్మీజాన్ అస్ర్ నమాజు ముగించి అక్కడినుండి ఇంకా లేవకముందే జమాఅతె ఇస్లామీకి చెందిన ఒక పెద్దాయన వచ్చి 'బేగం సాహబాను కాస్త తలుపు వరకు రమ్మనండి' అంటూ అడిగారు. ఈయనగారు ఇంకెలాంటి వార్త తెచ్చారో అని మేమంతా బెదిరిపోయాం. అమ్మీజాన్ గాబరా పడుతునే వచ్చి కవాటాల వెనుక నిల్చున్నారు. "బేగం సాహబా! శుభాకాంక్షలు! మీకు అభినందనలు తెలుపుతున్నాను. మౌలానాగారి ఉరిశిక్షను (14) సంవత్సరాల కఠిన కారాగారశిక్షగా మార్చివేశారు. అంతేకాకుండా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక ప్రకటన జారీచేసిన నేరానికిగాను అదనంగా ఏడు సంవత్సరాల కఠిన కారాగార శిక్షను కూడా విధించారు." ఆయనగారు తన ధోరణిలో చెబుతూనే పోతున్నారు. కాని అమ్మీజాన్ మొదటి వాక్యం 'ఉరిశిక్ష రద్దయింద'ని వినగానే అమాంతం సజ్దాలో పడిపోయారు. ఆమెను చూసి పిల్లలమైన మేమంతా కూడా సజ్దాలో పడిపోయాము. ఇకిప్పుడు ఇంటి వాతావరణమే మారిపోయింది. అభినందనలు, శుభాకాంక్షలు ప్రవాహంలా వచ్చిపడుతున్నాయి. ఇరవై ఒక్క సంవత్సరాల కఠిన కారాగార శిక్ష ముందున్న దనే విషయాన్ని అసలు ఎవరూ పట్టించుకోవడమేలేదు. అమ్మీజాన్ పదేపదే ఇలా చెబుతూ పోతున్నారు. 'దైవవాగ్దానం సత్యమైనది' అలా ఇన్ననస్రల్లాహి ఖరీబ్' (నిస్సందేహంగా దైవసహాయం సమీపంలోనే ఉంది. చూడండి! తాము ఇలాంటి పరిస్థితుల కోసమేనని, ఇదే తమ భావమని ఖుర్ఆన్ ఆయత్లు, హదీసులు స్వయంగానే వాటి అర్థమేమిటో తెలియజేస్తున్నాయి."

ఆరోజు అమ్మీజాన్ తానుచూసిన ఒక స్వప్నాన్ని ఇలా వినిపించారు. అబ్బాజాన్కు కోర్టు మార్షల్ చేసి, మరణశిక్ష విధించిన రోజుకు కేవలం ఒక్కరోజు ముందే ఆమె ఈ కలగన్నారట. "ఆకాశం నుండి ఒక విమానం వచ్చిదిగింది. మీ అబ్బాజాన్ మనల్నందరినీ అందులో ఎక్కించుకున్నారు. విమానం అత్యంత

వేగంగా నిటారుగా ఆకాశంలోకి దూసుకుపోతుంది. నా తల తిరిగిపోతున్నది, భయాందోళనలకు గురిఅవుతున్నాను. ఇంతలోనే అకస్మాత్తుగా విమానం ఎక్కడో దిగిపోయింది. మీ అబ్బాజాన్ నా చేయి పట్టుకొని నన్ను విమానం నుండి దించుతున్నారు. నా పంచప్రాణాలు పోతున్నట్లు నాకనిపిస్తుంటే, మీ అబ్బాజాన్ ఇలా అంటున్నారు. 'నీవెంత ఎత్తుకు వచ్చేశావో కాస్తకిందికి చూడు'అని. నేను క్రిందికి చూస్తే నిజంగానే మనుషులంతా మరుగుజ్జుల్లా కనబడుతున్నారు. పెద్దపెద్ద మహోన్నతమైన బిల్డింగ్‌లు ఆటవస్తువుల్లాగా కనబడుతున్నాయి. ఇంతలోనే నాకు మెలుకువ వచ్చేసింది.''

ఈ స్వప్నాన్ని వినిపించి తానే దాని గూడార్థాన్ని కూడా చెప్పారు. ''ఆ స్వప్నం యొక్క తాత్పర్యం ఏమిటో నేడు ప్రత్యక్షంగా కనబడుతోంది. దైవం నిజంగానే హజ్రత్ ఇబ్రాహీం(అలై) ద్వారా, హజ్రత్ ఇస్మాయీల్(అలై)ను బలి తీసుకోవడం ఉద్దేశ్యం కాదు. ఈ చర్యవల్ల తండ్రిని ఖలీలుల్లాహ్ (దేవుని మిత్రుని)గాను, కుమారున్ని జబీహుల్లాహ్ (దైవమార్గంలో బలిఅయినవాని) గాను మార్చడమే అసలు ఉద్దేశ్యం. అలాగే మనలాంటి పాపుల్ని ఈ మహా విపత్కరం నుండి క్షేమంగా బయటపడేస్తూ, ఔన్నత్యానికి లేపడమే ఆయన ఉద్దేశ్యం.''

ఇదేవిధంగా అబ్బాజాన్‌కు మరణశిక్ష విధించినప్పుడు 'సర్‌గోధాకు' చెందిన మీయాఁ రహీమ్‌బక్ష్ చూసిన కలను 'అష్రేషియా' (1975, డిసెంబర్ 25) లాహోర్, వారపత్రిక ఇలా ప్రచురించింది.

''నేనో రాత్రి కలలో దైవప్రవక్త మహనీయులు(స) దైవాన్ని ఇలా వేడు కుంటుండగా చూశాను. ''ఓ అల్లాహ్! దయతలచు! మౌదూదీ నా ధర్మాన్ని ఆశ్రయించినవాడు, ఇంకొన్ని రోజులు అతడ్ని బ్రతికించు. అతను నీ ధర్మానికి సేవ చేస్తున్నాడు. ప్రభూ! దయతలచు!'' మియాఁ రహీమ్‌బర్ష్ ఇంకిలా అన్నారు. అకస్మాత్తుగా ఒక శబ్దం వినబడుతుంది. ఓముహమ్మద్! మేము నీ విన్నపాన్ని స్వీకరించాము. అంతేనాకు మెలుకువ వచ్చేసింది. అప్పుడు

ప్రాతఃకాలం. ముఅజ్జన్ అజాన్‌లో పలికే 'అల్లాహు అక్బర్' శబ్దాలు వినబడు తున్నాయి. నేను భయాందోళనలతో లేచికూర్చున్నాను. అకస్మాత్తుగా నా కళ్ళనుండి అశ్రువులు రాలసాగాయి. నేను నిశ్చేష్టుడై చాలాసేపటివరకు అలాగే స్థాణువులా మంచం మీద కూర్చుండిపోయాను. ఈ స్వప్నానికి అర్థమేమిటో త్వరలోనే బయటపడింది. మరణశిక్ష రద్దయినట్లు ప్రకటించారు."

'మీ దర్సెఖుర్ఆన్, దర్సె హదీస్‌లో ఉండే రుచి, ఆకర్షణ ఇంకెవరి దర్సె ఖుర్ఆన్‌లోనూ రాదు' అంటూ ఎవరో ఒకసారి అమ్మీజాన్‌ను అడగ్గా "ఈ ఆయత్‌ల, హదీస్‌ల అర్థాన్ని, మేము తెలుసుకున్నట్లు వేరొకరు తెలుసుకోవా లనుకుంటే, మేమెదుర్కొన్న పరిస్థితుల్ని అతను ఎదుర్కొంటేగాని అర్థం కావు" అంటూ సమాధానమిచ్చారు.

పిల్లలు ఆనందంగా సంతోషంగా గడపాలని, వారి మనస్సుపై ఎలాంటి దుష్ప్రభావాలు పడకూడదని అమ్మీజాన్, దాదిఅమ్మాలు నిరంతరం ప్రయత్నించేవారు. అమ్మీజాన్ ఇలా చెబుతుండేవారు. "మానవుని బాల్యం ఆనందోల్లాసాల్లో గడవాలి. అతనెప్పుడూ అభద్రతాభావానికి గురికాకూడదు. బాల్యంలో ఎలాంటి న్యూనతాభావానికైనా అతను గురైతే జీవితాంతం అది అతడ్ని దెయ్యంలా వెంటాడుతూనే ఉంది. ఇది అతని వ్యక్తిత్వాన్ని వికసించ నీయదు. ప్రతి పిల్లవానికి తనింట్లో తానో ముఖ్య వ్యక్తి అనే భావన కలగాలి. ఇంకా తాను వి.ఐ.పీననే భావన గనుక ఏర్పడితే అతనిలో ఆత్మవిశ్వాసం పెరిగి పోతుంది." తనపిల్లలు బాల్యంలోనే వృద్ధులైపోయారని, వారి బాల్యం లాక్కో బడిందని ఆమె నిరంతరం విచారిస్తూ ఉండేవారు. ఈ లోపాన్ని పూడ్చటానికి ఆమె రకరకాలుగా ప్రయత్నించేవారు. మమ్మల్ని వివిధ పద్ధతుల్లో పనుల్లో నిమగ్నం చేసి ఉంచేవారు.

ఒకరోజు 'ముల్తాన్' జైలునుండి అబ్బాజాన్ ఉత్తరం వచ్చింది. అందులో ప్రతి పిల్లవాడు తనకు వేర్వేరుగా లేఖ రాయాలని ఆదేశించారు. కనుక మేమందరం తమ స్వహస్తాలతో అబ్బాజాన్‌కు లేఖరాశాము. మా లేఖలకు ప్రత్యుత్తరంగా అబ్బాజాన్ ప్రతి పిల్లవానికి పేరుపేరునా లేఖ

రాశారు. ఈ లేఖలతో పాటే ప్రతి పిల్లవానికి ఒక్కొక్కటిగా చిన్న సంచీలు కూడా పంపించారు. అబ్బాజాన్ తన పాతబడిన ఒక నీలిరంగు చొక్కాను కత్తిరించి, సూది దారంతో తన స్వహస్తాలతో ఆ సంచుల్ని కుట్టారు. ఈ సంచుల్ని ఒలిచిన చల్‌గూజా, బాదాం, కిష్‌మిష్, పిస్తా, అక్రోటు పప్పుతో నింపి కుట్టారు. సంచులపై మాలోని ఒక్కొక్క పిల్లవాని పేరు రాసిన చీటిని అతికించారు. పిల్లల పేరుకు ముందు ప్రతిఒక్కరికి సూరె నజర్ (నా కంటివెలుగు)అనో, జానె పిదర్ (తండ్రి ప్రాణం) అనో, జిగర్ గోషా(హృదయ కవాటం) అనో ఇలా ప్రేమాను రాగాలొలికే ఏదో ఒక పదాన్ని తప్పక రాశారు.

ఆ సంచులు, ఆ ఉత్తరాల్లో ఏముందోగాని, వాటిని చూసిన దాదిఅమ్మా మాత్రం వెక్కివెక్కి ఏడ్చేశారు. ఇక అమ్మీజాన్ ముఖం పాలిపోయింది. రోజంతా ముభావంగానే ఉన్నారు. జైలునుండి వచ్చిన ఈ సంచులు నిర్జీవమైనప్పటికీ, సజీవ మానవునిలాగా ఎన్నో విషయాల్ని బహిర్గతపరిచాయి. నిస్సారమైన ఆ జైలు జీవితం, ఒంటరితనం, పిల్లల ఎడబాటు, ఇంటి జ్ఞాపకాలు- ఇంకా ఇవి ఎన్నెన్ని విషయాల్ని తెలిపాయో వివరించ నలవికాదు. అబ్బాజాన్ దృఢవిశ్వాసం, గట్టి సంకల్పం, అచంచలమైన ధైర్య స్థైర్యాలు కలిగిన ఓ పర్వతం అనడంలో సందేహం లేదు. కాని ఆ సంచులపై రాసి ఉన్న జానె పిదర్, గోషయే జిగర్, నూరె నజర్‌లాంటి సంబోధనా వాక్యాలు- మహాదృఢ సంకల్పంగల ఆ మనిషిలో కూడా సున్నితమైన, ద్రవిస్తున్న ఒక హృదయముందనే విషయాన్ని దాచలేకపోయాయి.

వేరొక వైపు, హృదయం ద్రవించి బయల్పడిన ఆ సంబోధనా వాక్యాల అర్థాన్ని కూడా సరిగా గ్రహించలేని ఈ జానె పిదర్, నూరె నజర్లు ఆ సంచులపై విరుచుకుపడ్డారు. వారు తమ పసితనం కారణంగా, అబ్బాజాన్ ఈ చల్‌గోజాల్ని ఎంతటి ప్రేమ వాత్సల్యాలతో ఒలిచారో, ఎంతటి ప్రేమామృతం నిండిన స్వహస్తాలతో సంచుల్ని కుట్టారో మరెంతటి మమకారంతో ఒక్కొక్క పిల్లవాని పేరు రాశారో కనీసం ఊహించే స్థోమత కూడా అప్పుడు మాలో లేదు. మా ధోరణిలో మేము ఆ సంచులనైతే ఖాళీ చేసేశాము. కాని దాదిఅమ్మా,

అమ్మీజాన్‌లు ఆ సంచుల్ని భద్రపరుచుకున్నారు. ఆహ్! ఎంతటి బాగ్యాన్ని పోగొట్టుకున్నాను. ఆ సంచిని ఎలా కాపాడుకోవాల్సింది! నా పేరుకంటే ముందు జానె పిదర్ (తండ్రి ప్రాణం) అని రాసిన ఆ సంచిక ఎంతటి అమూల్యమైనది! నా కోసం అదెంతటి విలువైన ఆస్తి!!

ఒకసారి దాదిఅమ్మాను ప్రాధేయపడుతూ అమ్మీజాన్ ఇలా అన్నారు. 'దయచేసి మీరెవరినీ శపించకండి! మీ దీవెనా, శాపం రెండూ గురితప్పక తగుల్తాయి. ''అసలేం జరిగిందంటే, 1953లో అబ్బాజాన్ జైల్లో ఉన్నప్పుడు దాదిఅమ్మా ఒక శాపంబెట్టారు. ''ప్రభూ! నా కుమారుడ్ని జైల్లో మురగ బెట్టిన వారిని కూడా అర్ధ శరీరభాగం కుళ్ళిపోయేటట్లు చేసి మంచాన పడెయ్యి'' అన్నదే ఆ శాపం, శపించిన కొన్ని నెలలకే పాకిస్తాన్‌కు గవర్నర్ జనరల్ అయిన 'మలిక్ గులాం ముహమ్మద్'కు పక్షపాతం వచ్చి మంచం పట్టారనే వార్త పత్రికల్లో వచ్చింది.

చివరికి 1955 ఏప్రిల్ 29వ తేదీన నేరారోపణలోనే చట్టపరంగా లొసుగులున్నాయి అనే తీర్పు కారణంగా ఇరువై ఐదునెలల జైలుశిక్ష తరువాత అబ్బాజాన్ విడుదలై ఇంటికొచ్చేశారు. అదెంతటి శుభసంతోషాల సమయమో! పూలు,పూలమాలలు మిఠాయిలతో ఇల్లు నిండిపోయింది. నలువైపుల్నుండి అభినందనలు, శుభాకాంక్షలు మారుమోగాయి. ఆ రోజంతా ఆనందోత్సాహాలతో గడిచిపోయింది. చీకటి పడగానే మేమంతా నిద్రకుపక్రమించాము.

అత్యంతానందం, అలసట కారణంగా మేము పిల్లలం ఆ రోజు ఇషా నమాజు చేయడం కూడా మరిచిపోయాము. అంతలోనే అమ్మీజాన్ చివాట్లు చెవుల్లో గింగురుమన్నాయి. ''సిగ్గూ శరమూ వీడిన వీరిని కాస్త ఎవరైనా చూడండి! కృతజ్ఞతాపూర్వకంగా 'నఫిల్' నమాజు సలపడం అటుంచి కనీసం ఫర్జ్ (విధి) నమాజులు కూడా చేయలేదే! తండ్రికి ఉరిశిక్ష పడ్డప్పుడు నఫిల్ నమాజులు సలుపుతూ దుఆలు చేస్తుండేవారు. ఇంకేం! ఇప్పుడు తమ అవసరం తీరిపోయింది. ఇక అల్లాహ్‌తో మనకు అవసరం ఉంటేగా!! ఇది

వింటూనే అందరం చటుక్కున లేచికూర్చున్నాం. వుజూ చేసుకొని నమాజుకు ఉపక్రమించాం.

ఆ రాత్రంతా అమ్మీజాన్ కృతజ్ఞతాపూర్వకంగా నఫిల్ నమాజులు సలుపుతూ గడిపారు. అంటే ఉరిశిక్ష విధించబడిన రోజు దైవంతో చేసుకున్న 'మన్నత్' (మొక్కుబడి) (తన భర్త క్షేమంగా తిరిగి ఇంటికి వస్తే వంద రకాత్‌ల నఫిల్ నమాజ్ చేస్తానని మొక్కుకున్న మొక్కుబడి)ని తీర్చుకోవడంలో నిమగ్నమయ్యారు. కాని ఈసారి టీతో నిండిన ఫ్లాస్క్‌ను తనతోపాటుగా ఉంచుకున్నారు. కొద్దికొద్ది వ్యవధితో టీ త్రాగేవారు. అయితే మరణశిక్ష విధించబడిన ఆ కాళరాత్రి ఆమె అసలే టీ ముట్టుకోలేదు.

మరుసటి రోజు అమ్మీజాన్ ఇలా అన్నారు, 'మనిషి ఎంతటి కృతఘ్నుడో చూడండి. భర్త ప్రాణాలకు ముప్పువాటిల్లినప్పుడు మృత్యువు కళ్ళ ముందు నాట్యమాడుతున్నప్పుడు ఈ వంద రకాత్‌ల నఫిల్ నమాజ్ చాలా కొద్దిగా అగుపించింది. నిదురా రాలేదు. అలసటా అనిపించలేదు. చిత్తమూ చెదిరిపోలేదు. నోటినుండి వెలువడుతున్న మాటల్నే హృదయమూ పలికింది. అవయవాల కంటే ముందు హృదయమే వంగిపోయేది. అయితే నిన్నటి రాత్రి! ఒక్కొక్కసారి నిదుర వస్తుండేది. ఇంకొకసారి అలసట అనిపించేది. మరోసారి తలనొప్పొచ్చేది. ఆరోజు మొదటిసారి లభించిన తన్మయత్వం ఈసారి అసలే కనిపించలేదు. అమ్మీజాన్ ఇలా చెబుతూనే, తన ఈ స్థితికి పశ్చాత్తాపపడుతూ, దైవంతో క్షమాపణ కోరుకుంటున్నారు. నిజమే! మనం జీవితాంతం 'సజ్దా'లో పడి ఉన్నా, నిజమైన అర్థంలో దైవానికి కృతజ్ఞతలు తెలుపుకునే స్థోమత మనలో లేదు.

పిల్లలు చేసే చిలిపిచేష్టలకు, మారాములకు విసుగుచెందిన అమ్మీజాన్ ఒకసారి అబ్బాజాన్‌తో ఇలా అన్నారు. 'అబ్బబ్బ! పిల్లలకి ఇంతగా స్వాతంత్ర్య మిచ్చి, ఇంతగా లాలించిన తండ్రి మీరుగాక ఇంకెవరూ ఉండరను

కుంటాను. ఒక్కసారైనా వారిని మందలించండి! ఒక్కసారైనా కాస్త గదమాయించండి! ఎందుకలా చేస్తున్నారని సంజాయిషీ అడగండి.

దీనికి అబ్బాజాన్ ఎంతో గాంభీర్యంగా ఇలా బదులిచ్చారు.

'జైల్లో ఉన్నప్పుడు వీరికోసం నేనెంతగా వ్యాకుల పడిపోయానో నీకేం తెలుసు? వీరి ముఖాలు చూడటానికి నేను పరితపించిపోయాను. వీరి మాటలు వినడానికి తహతహలాడాను. 1953లో నేను జైలుకు వెళ్ళినప్పుడు నా చిన్నకొడుకు ఖాలిద్ (జన: 1952 సెప్టెంబరు 17, లాహోర్) అప్పుడప్పుడే మాట్లాడుతున్నాడు. అతని ముద్దుమాటలు నా చెవుల్లో మార్మోగుతుండేవి. నా పెన్నిధి నా నుండి దూరమైపోయినట్లుగా అనుభూతి చెందేవాణ్ణి. నేను జైలు నుండి విడుదలై వచ్చేసరికి అతను పెద్దవాడైపోయాడు, అతని ముద్దుముద్దు మాటల్ని నేను వినలేకపోయాను. జైల్లో వాణ్ని తలుచుకొని, వాని మాటల్ని మననం చేసుకునేవాణ్ణి. ఇకిప్పుడు వారిని మందలించమని, గదమాయించమని కోరుతున్నావు. ఇది నావల్ల అయ్యేపనికాదు.

ఇంకొక సందర్భంలో అబ్బాజాన్ ఇలా అన్నారు. "ఇంతమంది పిల్లలు దైవాన్ని యాచించకుండానే సునాయాసంగా నీకు లభించారు. అందుకే వారు విసుగెత్తిస్తున్నారని చెబుతున్నావు. సంతానం లేనివారు ఏం చేస్తున్నారో చూస్తున్నావా? వారు ఎక్కడెక్కడికి పోతున్నారో, ఎలాంటి షిర్క్‌కు పాల్పడుతున్నారో, ఏయే ఆస్తానాలకు (దర్గాలకు) వెళ్ళి తమ విశ్వాసాన్ని పోగొట్టుకుంటున్నారో నీకేమైనా తెలుసా?"

మేమంతా ఏ మూలనో నక్కి, అబ్బాజాన్ చెప్పే ఈ మాటల్ని రహస్యంగా వినేవాళ్ళం. అమ్మీజాన్ మాత్రం 'సరే! సరే! మీరు మాట్లాడే ఇలాంటి మాటల వల్లనే వారు ఇంకా తలకెక్కి కూర్చుంటున్నారు' అంటూ కోపగించుకునేవారు.

# 8. జైలు వృత్తాంతం

మేమందరం వెంటబడి మారాంచేస్తే ఓసారి అబ్బాజాన్ జైలు పరిస్థితుల్ని ఇలా వివరించారు.

'నన్ను లాహోర్ జైలునుండి ముల్తాన్ జైలుకు తరలించిన సమయం మిట్టమధ్యాహ్నం సమయం. నాకు కేటాయించిన గదిలో సీలింగ్ ఫ్యాన్ లేదు. కుళాయికి (ట్యాప్) బదులు హ్యాండ్‌పంపు ఉండేది. ఇది 'ఎ' క్లాస్ ఖైదీలకు ఇవ్వబడే గదట. ఓ 'సి'క్లాస్ (కఠిన కారాగారశిక్ష అనుభవిస్తున్న) ఖైదీని నా సేవకోసం కేటాయించారు. అతను నా రాకకోసమే ఎదురు చూస్తున్నాడు. 40సంవత్సరాల మంచి పుష్టిగల వ్యక్తి అతను. నాపై దృష్టిపడగానే అతను ఓసారి నన్ను తేరపార చూశాడు; హఠాత్తుగా లేచి నిల్చున్నాడు. వెంటనే నా సామాన్లను ఎత్తుకున్నాడు. హ్యాండ్‌పంపులో నీళ్ళుపట్టి బాత్‌రూంలో పెట్టి 'మియాఁజీ! స్నానం చేయండి!' అన్నాడు. నేను స్నానాలు ముగించుకొని వచ్చేసరికి, గదంతా ఇసుక పరిచి, దానిపై నీళ్ళు చల్లి మంచం పరిచి రెడీగా ఉంచాడు. ఇంతకు ముందు ఈ గదిలో ఇసుక లేదే! ఎందుకు పరిచావు?' అని అడగగా అతను, ఇక్కడ వేడి తీక్షణంగా ఉంది. నేనీ ఇసుకపై నీళ్ళు పోస్తూ ఉంటాను. గది చల్లగా ఉంటుంది. మీరు మధ్యాహ్నం పూట విశ్రాంతి తీసుకోవచ్చు.' చెప్పుకుంటూ పోతున్నాడు. నేను జుహర్ నమాజు చేసుకున్నంతలోనే భోజనం తయారుచేసి ముందుంచాడు. మీ భోజన అలవాట్లు ఏమిటో నాకు తెలియదు. అందుకని తొందరలో సాధ్యమైంది చేసి తెచ్చాను.' అంటూ విన్నవించుకున్నాడు.

తరువాత కఠిన కారాగారవాసి అయిన ఈ స్నేహితుడు నేను ఏయే సమయాల్లో ఏ మందులు వాడతానో అన్నీ తెలుసుకొని క్రమం తప్పకుండా ఉదయంపూట వేసుకునే మందులు, మధ్యాహ్నం పూట, రాత్రిపూట తినే మందుల్ని చక్కగా తెచ్చి నాకందిస్తుండేవాడు. ఒక్కసారి కూడా ఫలానా పూట

మందులు నాకివ్వలేదు అని చెప్పే అవకాశాన్ని రానివ్వలేదు. అబ్బాజాన్ ఇంకిలా అన్నారు. 'జైల్లో అతను నాకు ప్రేమగా చేసిన సేవను చూస్తే ఆశ్చర్యం కలిగేది.'

ఒకరోజు ఈ జైలు సహచరుడే నాతో ఇలా అన్నాడు. 'ఈ క్వార్టర్‌లో నాకు డ్యూటీ అప్పగిస్తున్నప్పుడు, 'ఇక్కడికి ఓ ప్రమాదకారి అయిన ఖైదీ రాబోతున్నాడని, అతను ప్రభుత్వాన్ని అత్యంత చికాకులో పడేశాడని, ఆ మనిషిని దారికి తెచ్చే బాధ్యతను నాకప్పగిస్తున్నారని తెలిపారు. అతడిని మారు మాట్లాడకుండా క్షమాపణపత్రంపై సంతకం పెట్టేటట్లు ఏడిపించాలి. ప్రభుత్వం అతనితో ఒప్పించదలచిన షరతులన్నిటినీ అతను ఒప్పుకోవాలి. అతడ్ని అన్ని రకాలుగా విసిగించడం, బాధించడమే నీ పని. అతను తినలేని వంటచేసి పెట్టాలి' అంతేనండి! నేను ఈ క్వార్టర్స్‌లో మీకోసం ఎదురుచూస్తూ కూర్చు న్నాను. చూద్దాం! అతనెంత ఘనుడో! నేను కూడా మామూలు మనిషినేమీ కాను. పేరుమోసిన నేరగాడిని. నాకు ఇదో పెద్ద పనా? అనుకుంటూ కూర్చు న్నాను. కాని ఎప్పుడైతే మీరు లోపలికి అడుగుపెట్టారో మీపై నా దృష్టిపడిందో నా ఆలోచనలే మారిపోయాయి. ఆహా! ఇటువంటి వ్యక్తితో ఎవరికేం ప్రమాదం మూడుతుందని? నిజం చెబుతున్నాను మియాఁజీ! ఒక్కచూపుతోనే మీపట్ల నా హృదయంలో ఎనలేని అభిమానం పుట్టుకొచ్చింది.

కొన్ని రోజుల తరువాత జైలు సూపరింటెండెంట్ వచ్చి 'ఏదైనా అసౌక ర్యంగా ఉంటే తెలుపండని'కోరాడు. 'నాకెలాంటి అసౌకర్యం లేదు. హాయిగా ఉన్నాను'అని సమాధానమిచ్చాను. జైలు సూపరింటెండెంట్ ప్రతి రెండు మూడు రోజులకోసారి వస్తూ ఇలాంటి ప్రశ్నలనే అడిగేవాడు. చివరికి ఒకరోజు ఉండబట్టలేక అడగనే అడిగేశాడు. "మీరేదో మొహమాటపడు తున్నారు. లేదా నిజం చెప్పటం లేదు."

"లేదు, లేదు అలాంటిదేమీ లేదు, నాకేదైనా కష్టం, అసౌకర్యం అనిపిస్తే నిర్మొహమాటంగా మీకు తప్పక చెబుతాను. ప్రస్తుతానికైతే నాకెలాంటి

కష్టంగాని, అసౌకర్యంగాని లేదు' అని సమాధానమిచ్చాను. అయినా జైలు సూపరింటెండెంట్ వదల్లేదు."ఫలానా లీడరు, ఫలానా రాజకీయ నాయకుడు ఎందరెందరో ఈ జైలులోనే, ఈ క్వార్టర్స్‌లోనే కేవలం మూడు రోజులుండే బెంబేలెత్తిపోయారు. కోరిన క్షమాపణపత్రంపై సంతకాలు చేసి బయటపడ్డారు. ఈ క్షమాపణ పత్రాలు ప్రభుత్వ ఫైళ్ళలో ఉంటాయి. వీళ్ళు ఏమాత్రం గొప్పలు చెప్పుకున్నా, ఉపన్యాసాలు దంచినా, ప్రభుత్వ వ్యతిరేక ప్రకటనలు చేసినా, 'రేపు ఉదయం మీ క్షమాపణ పత్రం పత్రికల్లో విడుదల కాబోతున్నదనే' వార్నింగు చాలు వారి నోళ్ళు మూయించటానికి. ఒక పెద్దమనిషైతే కేవలం రెండంటే రెండే రోజుల్లో వలవల ఏడుస్తూ క్షమాపణ పత్రంపై సంతకం పెట్టి మరీ బయటపడ్డాడు. మీరెలాంటి వారండీ! నిశ్చింతగా, విశ్రాంతిగా కూర్చుండి పోయారు. ఎలాంటి బాధలేదంటున్నారు."

ఇదంతా విన్న తరువాత నేనాయనతో ఇలా అన్నాను. 'చూడండిబ్రదర్! జీవితాన్ని ఒక ప్రత్యేక లక్ష్యసాధన కోసం కేటాయించినప్పుడు, ఈ హెచ్చు తగ్గులు, కష్టసుఖాలు, సాధకబాధకాలు, జైళ్ళు మొదలైనవన్నీ ద్వితీయ స్థానానికి దిగజారిపోతాయి. ఈ మార్గాన్ని నేను బాగా ఆలోచించి మరీ ఎంచుకున్నాను. లాభనష్టాలకు అతీతమైనదీ జీవితం అనే లోకొక్తిని అనుసరించి స్వీయ లాభనష్టాలను, సుఖదుఃఖాలను త్యజించివేశాను. అయినా ఆ సూపరింటెండెంట్‌గారు ఇంకిలా చెబుతూనే పోయారు. "అది కాదండి మౌలానా గారు! ఎనమండుగురు పిల్లల్ని దేనికోసమని శిక్షిస్తున్నారు? కనీసం వారి గురించైనా కొంత ఆలోచించండి."

"చూడండి సూపరింటెండెంట్ గారూ! పిల్లల్ని నేను దైవానికి అప్పగించి వచ్చాను. ఆ పిల్లల విషయం దైవమెరుగు. వారి గురించి నేను రవ్వంతైనా చింతించడంలేదు" అన్నానాయనతో. ఇది విని సూపరింటెండెంట్‌గారు ఇక లాభం లేదనుకొని, నిరాశతో వెనుదిరిగి వెళ్ళిపోయారు. క్షమాపణ పత్రంపై సంతకాలు తీసుకునే ప్రయత్నాలు ఈవిధంగా బెడిసికొట్టాయి. అబ్బాజాన్ చెబుతు పోతున్నారు.

'నేను తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్ వ్రాయడంలో నిమగ్నమై ఉన్నప్పుడు లేదా నమాజ్ చేస్తున్నప్పుడు ఆ జైలు సహచరుడు నావైపు కన్నార్పకుండా చూస్తుండడం గమనించాను. కొన్ని రోజుల తరువాత బక్రీదు పండుగ వచ్చింది. అనుకోకుండా జైల్లో మాకు సరఫరా అయ్యే రేషన్ అయిపోయింది. తిరిగి రేషన్ వచ్చేలోపే పండుగ సెలవులు ప్రారంభమయ్యాయి. చివరికి పండుగ రోజు ఉదయంపూట అసలు వంటకు ఏదీ మిగల్లేదు. ఈ పరిస్థితిని చూసి నా సహచరుడు కలవరపడి పోయాడు. 'రేషన్ లేకుండా మీ కోసం 'నాష్త' (టిఫిన్) ఎలా తయారుచేసేది?' పరిస్థితికి కలత చెందిన అతని నోటి నుండి జైలు నిర్వహణాధికారులను ఆడిపోసుకుంటూ ఒకటిరెండు తిట్లు కూడా వచ్చాయి. నేను అతన్ని, రాత్రిచేసిన శనగపప్పు, రొట్టె మిగిలిఉంది కదా! దాన్నే వేడిచేసి పట్టుకురా! అంటూ కోరాను. "దాన్ని నేనెన్నటికీ మీకివ్వలేను. పండుగ రోజు ఎవరైనా చద్దికూడు తింటారా?" అంటూ దాన్నివ్వడానికి అతను ససేమిరా ఇష్టపడలేదు. "సోదరా! నా గురించి నువ్వేమీ బెంగపెట్టుకోకు. ఆ పప్పురొట్టె నేను సంతోషంగానే తింటాను" అని అన్నాను అతని బాధను చూసి. (అబ్బాజాన్ ప్రతిరోజు ఉదయం ఎనిమిది గంటలకల్లా టిఫిన్ చేసేవారు. దైనందిన అలవాట్లలో అబ్బాజాన్ కఠినంగా సమయపాలన చేసేవారు. అందు కని ఎలాంటి మొహమాటం లేకుండా ఆ పప్పురొట్టెల్ని అబ్బాజాన్ సంతోషంగా తిన్నారు. ఆయనకు దాదిఅమ్మా ఇచ్చిన తర్ఫీదు ఇక్కడ బాగా పనికొచ్చింది. (ఒకసారి బంగారు ముద్దు తినిపిస్తే, ఇంకొకసారి మిర్చీ, ఛట్నీలతో తినిపించే దాన్నని దాదిఅమ్మా చెబుతుండేవారని ఇంతకుముందే తెలిపిఉన్నాము) నేను తింటున్న సమయంలో వెక్కిళ్ళు వినిపించేసరికి వెనుదిరిగి చూశాను. ఆ జైలు సహచరుడే కన్నీరు కారుస్తున్నాడు. 'ఏం! భార్యాపిల్లలు జ్ఞాపకం వస్తు న్నారా?'అనడిగాను. 'లేదండీ! మిమ్మల్ని పప్పురొట్టె తింటూ చూస్తుంటే నాకు ఏడుపు ఆగలేదు. అదేకాదు, పండుగ రోజున, రాత్రి మిగిలిపోయిన పప్పు కూడును మేం పేదవాళ్ళం కూడా ఎన్నడూ తిని ఎరుగం! మీరైతే గొప్పవాళ్ళు. ఇలా మిగిలిపోయిన చద్దిరొట్టెను ఎందుకు తిని ఉంటారు?'- నేను ఎంతో

వాత్సల్యంతో అతనికిఇలా బోధించాను. "చూడు సోదరా! ఈ మార్గం నేను బాగా ఆలోచించి మరీ ఎన్నుకున్న మార్గం. అందుకని నిండు మనస్సుతో ఈ త్రోవపై నడుస్తున్నాను. అంతేకాదు, ఏనాడైనా పస్తులుండాల్సి వచ్చినా ఇన్షా అల్లాహ్ నేను వెనుకాడను. నా కారణంగా నీవు దుఃఖించకు." అబ్బాజాన్ ఇంకిలా చెప్పారు. 'నేనైతే నాష్తాచేసి, తఫ్హీముల్ ఖుర్ఆన్ వ్రాయడానికి ఉపక్రమించాను. కాని నా జైలు సహచరుడు (అతని కోసం పప్పు, రొట్టె ఇంకా మిగిలిఉన్నా) నిరసనగా ఆ పూట భోజనం మానేశాడు. ఇంతలోనే క్వార్టర్ తలుపులు గట్టిగా బాదటం వినిపించింది. మావాడు తలుపు తెరువగానే, చేతుల్లో అనేక టిఫిన్ క్యారియర్లు, పెద్ద పెద్ద ప్యాకెట్లు, ఇంకేమో పట్టుకున్న సిపాయి ఇలా చెబుతూపోయాడు. 'మౌలానా గారు! మీ అభిమానులైతే ఉదయం ఫజ్ర్ నమాజు అయిన వెంటనే ఈ వస్తువులన్నీ తీసుకొచ్చి జైలు ద్వారం వద్ద నిరీక్షిస్తున్నారు. కాని సూపరింటెండెంట్ గారి కార్యాలయం ఈద్‌నమాజు తరువాత తెరువబడింది. ఆ తరువాత ఇందులోని వస్తువుల తనిఖీ, పరిశీలన మొదలైనవన్నీ జరిగి తీసుకువచ్చేవరకు ఇంత ఆలస్యమై పోయింది." ఇకిప్పుడు ఆ సహచరుడు ఆ క్యారియర్లు, ప్యాకెట్లు విప్పేసరికి అందులో రకరకాల తినుబండారాలు, మిఠాయిలు ఇంకా ఏవేవో ఉన్నాయి. అవిచూసి నేను జైలు సహచరునితో అన్నాను. చూడు! ఇవన్నీ నీ కోసమే వచ్చాయి. నీవే భోజనం చేయకుండా నిరాశగా ఏడుస్తూ కూర్చు న్నావుగా! తనివితీరా నీవూతిను, మిగిలింది జైల్లోని ఇతర ఖైదీలకు పంచిపెట్టు. ఈ పరాటాలు, కబాబ్‌లు, హల్వాపూరీలు, సేమియాలు, మిఠాయిలు అంటే వారికీ ఇష్టమేకదా!' కాని నా సహచరుడు వాటన్నింటివైపు చూస్తూ పాశ్చాత్తాప పడసాగాడు. 'ఆ పప్పుకూడు మీకివ్వకుండా కాకులకు, గద్దలకు తినిపించినా బాగుండేది!' ఎంతో నచ్చజెప్పిన తరువాతగాని అతను భోంచేశాడు, తరువాత మిగిలిన తినుబండారాలన్నీ ఇతర ఖైదీలకు పంచిపెడుతూ, ఇవన్నీ మా మియాఁజీ కోసం వచ్చాయి. ఆయన మీకు పంపించారు'అని చెప్పుకుంటూ పోయాడు కూడా.

అబ్బాజాన్ చెబుతూపోతున్నారు, "పండుగరోజు మధ్యాహ్న సమయంలో తిరిగి అదే సిపాయి అనేక టిఫిన్ క్యారియర్లు, ప్యాకెట్లు తెచ్చిచ్చి పోయాడు. ఎంత రుచికరమైన, వినూత్న తినుబండారాలొచ్చాయంటే వాటిని చూసి మా సహచరుడు నిర్ఘాంతపోయాడు. నాకు భోజనం వడ్డించిన తరువాత తనూ తిని, మిగిలిందంతా జైలు ఖైదీల్లో పంచివచ్చాడు. రాత్రి తిరిగి అదే తంతు. మొత్తానికి పండుగ మూడు రోజులు ఎడతెరిపి లేకుండా మా ముల్తాన్ సహచరులు ఎన్నెన్ని రకాలుగా, ఎంతెంత పరిమాణంలో పంపించా రంటే జైల్లోనివారంతా సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు.

అబ్బాజాన్ మాకీ వివరాలు తెలుపుతూ పోతున్నారు. అమ్మీజాన్ మధ్యలో మాకిలా గుర్తుచేస్తున్నారు. చూడండి! మరియమ్ సూరాలో ఇదే విషయం ఇలా చెప్పబడింది.

"నిశ్చయంగా, విశ్వసించి సత్కార్యాలు చేస్తూ ఉన్నవారి పట్ల త్వరలోనే కరుణామయుడు ప్రేమను హృదయాలలో కలుగజేస్తాడు"
(మర్యమ్- 96)

జీవితంలోని వివిధ సంఘటనల్ని అమ్మీజాన్ ఈవిధంగానే ఆయత్‌లు, హదీసులతోపోల్చుతూ, వాటి అర్థాన్ని వివరిస్తూ ఉండేవారు. నేడు కూడా అమ్మీజాన్ పలికిన ఆనాటి మాటలు చెవుల్లో మ్రోగుతున్నాయి. 'మీరు ఆచరణకైతే పూనుకోండి. ఆయత్‌లు, హదీసులు తామే స్వయంగా లేచివచ్చి తమ భావమేమిటో మీకు తెలియజేస్తాయి."

అప్పటి జైలు సంఘటనల్ని జ్ఞాపకం చేసుకుంటూ అబ్బాజాన్ ఇంకిలా చెప్పసాగారు.

'ఒకరోజు మధ్యాహ్న సమయంలో మా క్వార్టర్ గోడ ఆవలి నుండి ఓ కంఠం వినిపించింది. 'జనరల్‌గారి భోజనం అందుకోండి!' అంటూ. మా జైలు సహచరుడు దగ్గరికెళ్ళి 'ఎవరూ?'అని అడిగాడు. గోడ ఆవలివైపు నుండి రొట్టె, కూర, సలాద్‌నిండిన ఒక మూతబుట్ట అందించడం జరిగింది. ఆ వెంటనే

జనరల్ ముహమ్మద్ అక్బర్‌ఖాన్‌గారు (రావల్పిండి కుట్రకేసు బాపతు ఖాన్‌సాహెబ్- ఆయన క్వార్టర్ అబ్బాజాన్ క్వార్టర్‌ను ఆనుకునే ఉండేది) గోడదూకి మా వాకిట్లోకి వచ్చేశారు. నేడు మీతో కలిసి భోజనం చేస్తాను' అంటూ లోపలికొచ్చేశారు.

రెండవరోజు కూడా ఆయన సేవకుడు (ఖైదీ) అలాగే కేకేశాడు. 'జనరల్‌గారి భోజనం అందుకోండి'అని. ఆ తరువాత జనరల్ గారు గోడదూకి లోపలికి వచ్చారు. (కమ్యూనిస్టు) రష్యా తరఫున తమ దేశ పర్యటన చేయాల్సిందిగా ప్రధానమంత్రి లియాఖత్ అలీఖాన్ గారికిఆహ్వానం వచ్చినప్పుడే అమెరికా నుండి కూడా ఇలాంటి ఆహ్వానమే వచ్చింది. రష్యా ఆహ్వానాన్ని ఎందుకు రద్దుచేయడం జరిగిందనేదే ప్రశ్న!' ఆయనగారు చెబుతూనే పోతున్నారు. "రష్యా సామ్యవాద వ్యవస్థకన్నా అమెరికా పెట్టుబడిదారి వ్యవస్థే మరింత ప్రమాదకరమైనది."

అబ్బాజాన్ తమ జ్ఞాపకాలను నెమరువేసుకుంటున్నారు. ఇంతలోనే అక్బర్‌ఖాన్‌గారు గోడదూకి నా క్వార్టర్‌లోకి వస్తున్నారని, మేమిద్దరం కూర్చుండి గంటల తరబడి మాట్లాడుకుంటున్నామనే వార్తను ఎవరో జైలు సిబ్బందికి అందించారు. అంతే! జైల్లో పెను తుఫానే లేచింది. రావల్పిండి కుట్రకేసుకు సంబంధించిన ఖైదీలందరినీ పోలీస్‌వ్యాన్లలో నింపి, వేరే జైళ్ళకు తరలించసాగారు. మా జైలు సహచరుడు, వారికి తరలిస్తున్న సన్నివేశాన్ని కళ్ళకు కట్టినట్టు నాతో వర్ణించసాగాడు. అక్బర్‌ఖాన్ పోలీస్ వ్యానులో ఎక్కుతూ, అబ్ వక్తె షహాదత్ హై ఆయా (ప్రాణాలర్పించే సమయం ఆసన్నమైందహో!) అంటూ పెద్దగా నినదించారని కూడా మావాడు తెలిపాడు. బహుశ జైలు అధికారులకు వీరిద్దరు కలిసి 'ఓ జైలుకుట్ర'ను రూపొందిస్తారేమోనని అనుమానం వచ్చి ఉంటుంది.

# 9. తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్, తఫ్‌హీముల్ హదీసుల ప్రణాళిక

ఇంట్లో ఎప్పుడైనా తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్ వ్రాయడానికి అవకాశం చిక్కకపోతే అబ్బాజాన్ మమ్మల్ని బెదిరిస్తూ, 'మీరు నన్ను తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్ రాయనివ్వడంలేదు. నేను జైలుకు వెళ్ళబోతున్నాను అని. తీరికలేక నేనెప్పుడైనా తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్ రాయలేకపోతే, అల్లాహుతఆల నన్ను తీసుకెళ్ళి జైల్లో కూర్చుండబెట్టేవాడు. అక్కడ నేను ప్రశాంతంగా రాసుకుంటూ ఉండేవాణ్ణి'. అబ్బాజాన్ ఇలా చెబుతుండేవారు. 'తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్‌ను పూర్తి చేసిన తరువాత అదే తరహాలో తఫ్‌హీముల్ హదీసు కూడా వ్రాయాలనుకుంటున్నాను' అని.

మా తాయాజాన్ (పెదనాన్నగారు- సయ్యద్ అబుల్ ఖైర్ మౌదూదీ రహ్మాలై) తరచుగా అబ్బాజాన్‌ను రాజకీయాల్లోనే ఇరుక్కుపోయే బదులు విద్యాజ్ఞానాల పనిలో, రాతపనిలో ఎక్కువ నిమగ్నమవ్వాలని ప్రోత్సహించేవారు. ఒకసారి ఆయన అబ్బాజాన్‌తో, "తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్‌లోని మొదటి రెండు సంపుటాలను పునఃసమీక్షించాలి. వాటిని చదువుతూ ఉంటే అక్కడక్కడ వెలితి కనబడుతున్నది అన్నట్లు నాకు గుర్తు. దానికి అబ్బాజాన్ ఇలా సమాధానమిచ్చారు. 'ఇప్పుడు నేను మొదటి రెండు సంపుటాలపై పునఃసమీక్ష మొదలుపెడితే, మూడవ సంపుటం కూడా తిరిగి సమీక్షించాలనే డిమాండు వస్తుంది. ఇక అలా, అలా ఇది కొనసాగుతూనే పోతుంది.

ఎప్పుడైనా సభల్లో లేదాఇతర రాజకీయ, సామాజిక కార్యక్రమాల్లో అబ్బాజాన్ అత్యధికంగా పాల్గొంటుంటే తాయాజాన్ ఆయన్ను, "ఈ పనుల కోసం చాలామందే ఉన్నారు. కాని పరిశోధనాత్మక, సైద్ధాంతిక రచనలకు, అది కూడా మీరు చేస్తున్న సరళిలో చేసే వారెందరున్నారు? మీరు మీ సమయాన్నంత రాయడానికే వెచ్చించండి" అంటూ హితబోధ చేసేవారు. ఒకసారి

జమాఅతె ఇస్లామీ పెద్దల్లో ఒకాయనతో తాయూజాన్ ఇలా అన్నారు. 'మీ మౌలానా గారున్నారే! ఆయన నాకు తమ్ముడు. అతడ్ని నా ఒళ్ళో పడుకోబెట్టు కున్నాను. లాలించాను, పాలించాను, అతని డిమాండ్లనూ తీర్చాను. అతని మారాలూ సహించాను. మీరు అతడ్ని సభలకు, సమావేశాలకు తీసుకువెడు తున్నారు. రాజకీయాల్లో ఇరికిస్తున్నారు. అదిచూసి నా మనస్సుకు బాధ కలుగుతోంది. మీరు అతని సమయాన్ని వృధాపరుస్తు న్నారు. అతడ్నే గనక సైద్ధాంతిక, పరిశోధనాత్మక రచనా వ్యాసంగంలో లీనం చేస్తే ఎన్నో తరాలు లాభపడతాయి."

అందుకోసమనే అమ్మీజాన్ తరచుగా మమ్మల్ని హెచ్చరిస్తూ 'మీ నాన్నను విసిగించకండి' అని అనేవారు. ఎప్పుడైనా పిల్లలు దేనికోసమైనా అబ్బాజాన్ వెంటపడితే అమ్మీజాన్ మాకు హితోపదేశం చేసేవారు.

"నేనేగనుక అడపాదడపా మీ నాన్నగారిని ఇది కావాలి, అది కావాలని, నా పిల్లలకు ఫలానా వస్తువు కొనపెట్టమని కీచులాడుతూ ఉంటే ఆయన రాసిన ఈ పుస్తకాలన్నీ అసలు ఉనికిలోకే రాకపోయేవి. మీ నాన్న ఒక రీసెర్చి స్కాలర్, ఒక జ్ఞాని, రచయిత, పరిశోధకుడు. ఆయనకు ఆత్మప్రశాంతత, నిమ్మళం, నిశ్శబ్దత ఎంతో అవసరం. మీరాయన్ను ఏదీ కోరకండి, దేని కోసమూ ఆయన్ని విసిగించకండి. మీ విద్యాసంబంధమైన సమస్యల్ని ఆయన ముందుంచకండి. మాటల్లో కూడా ఆయన్ను ఇరికించకండి." ఈవిధంగా అమ్మీజాన్ ఆయనకు పరిపూర్ణమైన ప్రశాంతతను, నిమ్మళాన్ని, నిశ్చింతను సమకూర్చారు. ఈ కారణంగానే అబ్బాజాన్ తాను రాసినదేదైనా సరే, పూర్తి ఏకాగ్రతతో, ఆత్మవిశ్వాసంతో, నిలకడ, పట్టుదలతో వ్రాస్తుండేవారు.

అబ్బాజాన్‌కు కాపట్యం, కృత్రిమం, బాహ్య ఆడంబరాలంటే మహా ఏవగింపు. ఒకసారి మేమందరం కుటుంబసభ్యులం భోజనాలకు కూర్చున్నాం. అమ్మీజాన్ మమ్మల్నందరినీ, ప్రత్యేకించి ముహమ్మద్ ఫారూఖ్ (జన : 1943 నవం.27, ఢిల్లీ)ను మందలిస్తూ, "బాబూ! క్రమం తప్పకుండా నమాజ్

చేయాలి. మీరేగనక నమాజ్ చేయకపోతే ప్రజలేమనుకుంటారు. మౌలానా మౌదూదీగారి పిల్లలే నమాజ్ చదువరని ఎత్తిపొడువరా?" అని హితోపదేశం చేశారు. భోజనం ముగించిన తరువాత, అబ్బాజాన్ తమలపాకుల పెట్టెను తీసుకొని వెళుతూ, "బేటా! ఎప్పుడు నమాజ్ చేసినా అల్లాహ్ కోసం చెయ్యి. నీ తండ్రి కోసమని నమాజ్‌కు నిలబడకు" అంటూ వెళ్ళిపోయారు. ఈవిధంగా పెద్ద పెద్ద విషయాల్ని అబ్బాజాన్ ఒకటిరెండు వాక్యాల్లో చెప్పేసేవారు. తర్కించటం ఆయన పద్ధతి కానేకాదు.

అబ్బాజాన్ ఎంతగా వ్రాశారో, ఆయన రచనలన్నిటినీ జమచేసి, వాటి పేజీలను లెక్కించి, వాటిని ఆయన జీవించిన రోజులతో భాగిస్తే రోజుకు ఎన్ని పేజీలొస్తాయో కాస్త ఆలోచించండి. దీంతోపాటే ఆయన జీవితంలో వచ్చిన ఆపదల్ని, అవాంతరాల్ని, పెనుతుఫానుల్ని పరిశీలిస్తే ఆయనింతగా ఎలా రాయగలిగారు? అని ఆశ్చర్యపడక మానరు. బృహత్తరమైన ఈ పని, మానసిక ప్రశాంతత, నిశ్చింతత, ఊరటలేనిది ఎలా సాధ్యమయ్యేది? వాటన్నిటిని అమ్మీజాన్ ఆయనకు సమకూర్చిపెట్టారు.

యూసుఫ్ అధ్యాయానికి సంబంధించి అబ్బాజాన్ రాసిన వ్యాఖ్యానాన్ని చదువుతూ ఉంటే, ఆయన అప్పుడు అక్కడే ఉండి, కళ్ళతో చూసిన దృశ్యాల్నే వర్ణిస్తున్నారా!అనిపిస్తుంది. సూర అల్ కహఫ్ మరియు సూర అల్ఫీల్ వ్యాఖ్యానాల్ని చదివినా కూడా, మానసికంగా ఆయన ఆ కాలం, ఆ స్థలం (Time and Space)లోకి వెళ్ళివచ్చారా? అనిపిస్తుంది.

ఎన్నో సంవత్సరాలు గడిచిన తరువాత ఒకసారి జిద్దా (సౌదీ అరేబియా) లోని బాలికల కళాశాలలో సిరియా జాతికి చెందిన అరబ్బి శాఖాధిపతి నన్నిలా అడిగింది: 'ఒక్క వాక్యంలో మీ నాన్నగారి ప్రత్యేకతను వర్ణించండి!'అని. అప్రయత్నంగా నానోటి నుండి ఈ వ్యాక్యాలు వెలువడ్డాయి. 'ఆయనదో వేరే ప్రపంచమండి!' ఆవిడ ఈ జవాబుకు అత్యంత సంబరపడిపోయింది. 'ఇమామ్ ఇబ్నె తైమియా (రహ్మ- నిర్యా: 1328) పరిస్థితి ఇలాగే ఉంటుండేది' అంటూ పలికింది.

తను భోజనానికి వచ్చినప్పుడు పిల్లలందరూ హాజరుగా ఉండాలనేది అబ్బాజాన్ ప్రబల కోరిక. పిల్లలందరితో కలిసే సమయం ఇదక్కొటే. అందుకని పిల్లలందరూ తనతోపాటుగా భోంచేయాలనేది ఆయన కోరిక. తన దైనందిన కార్యక్రమాల్లో ఆయన ఎంతగా సమయబద్ధుడూ అంటే, ఆయన్ను చూసి గడియారాల సమయాన్ని సరిచేసుకోవచ్చు. అందుకని ఆయనగారి రాకకు ముందే మేం భోజనాలకు హాజరయ్యేవాళ్ళం. కాని తరచుగా ఆయన భోజనం చేస్తూ కూడా ఏదో దీర్ఘాలోచనలో ఉన్నట్లు కనిపించేవారు.

అబ్బాజాన్ తరచుగా మాకీ నీతిని బోధించేవారు.

"ప్రతి మనిషి మంచీ, చెడుల సమ్మేళనం. ఒక మనిషిలోని నైపుణ్యం ఏమిటంటే అతను ఎదుటివాని వ్యక్తిత్వంలోదాగి ఉన్న మంచిద్వారా లాభపడ గలగాలి. ఎదుటివాని చెడు ద్వారా నష్టపడి, వానిలోని మంచితనం నుండి లాభపడని మనిషి ఎంతో దురదృష్టవంతుడు, అత్యంత తెలివి హీనుడు."

పరుష పదాల వాడకంగాని, వ్యంగ్యంగా మాట్లాడడంగాని అసలా యనకు తెలియనే తెలియదు. ఆయనకు అత్యంత బాధకలిగినప్పుడు ఎప్పు డైనా ఆయన నోటినుండి బయల్పడే కఠినపదాలిలా ఉండేవి.

'నా గౌరవప్రదమైన ప్రవర్తనే పెద్ద నేరంగా మారిపోయింది.'

అయినా, సాధ్యమైనంతవరకు ఇతరుల్లో మంచిని ప్రేరేపించి కార్యో న్ముఖులుగా చేసి వారిలోని చెడును రూపుమాపటానికి ఆయన నిరంతరం కృషిచేశారు.

నిరంతరాయంగా కృషిచేస్తూ, తనలోని యుక్తిని, శక్తిసామర్థ్యాలనుఒడ్డి ప్రాణాంతకమైన ఇరవైఐదు సంవత్సరాల సుదీర్ఘకాలాన్ని ఆయన ఇస్లామీయ సముదాయాన్ని తీర్చిదిద్దే కార్యక్రమంలో గడిపివేశారు.

ఒక్కొక్కసారి ఆలోచిస్తుంటాను. ఒకవేళ ఎవరో ఒక గయ్యాళి గంప తోనో, మూర్ఖురాలితోనో అబ్బాజాన్ వివాహమే జరిగి ఉంటే ఎలాగుండేదోఅని.

బహుశ దైవం అమ్మీజాన్‌ను, అబ్బాజాన్ కోసమే ప్రత్యేకంగా పుట్టించి ఉంటాడు.

సాహిత్యంపట్ల అపరిమితమైన అభిలాష, విద్యాజ్ఞానాలపట్ల అత్యధిక శ్రద్ధ, స్వీయ కోరికల్ని విడనాడడం, ఆత్మాభిమానం- అమ్మీజాన్‌లోని మహోన్నత మైన సుగుణాలు. స్త్రీలు సువాసనలాంటి వారని అరబ్బిలో ఒక సామెత ఉంది. తామైతే తెరవెనుకనే ఉంటారు. కాని వచ్చే కొద్దిపాటి రాబడితో పొందికగా ఇంటి వ్యవహారాల్ని నడుపుతూ, పిల్లల్ని తీర్చిదిద్దిన వైనం ప్రతి ఒక్కరికీ కనబడుతుంది.

అబ్బాజాన్ మాతో ఇలా అంటూ ఉండేవారు. "మిమ్మల్ని సంస్కరించే పూర్తి అవకాశమేగనుక నాకు లభించిఉంటే, మిమ్మల్ని ప్రపంచంలో ఒక ఆదర్శ సంతానంగా తీర్చిదిద్దేవాణ్ణి. మీ విషయంలో పూర్తి శ్రద్ధచూపలేకపోయాను కనుక మిమ్మల్ని సంజాయిషి అడిగేహక్కు కూడా నాకులేదు. నా సర్వసమ యాన్ని ధార్మిక కార్యకలాపాల కోసం, దైవధర్మోన్నతి కోసం కేటాయించాను. అందుకని మీ సంస్కరణను అల్లాహ్‌కే అప్పగించాను." ఈవిధంగా ఆయన తన జీవితపు ఒక్కొక్క క్షణాన్ని దైవధర్మోన్నతి కోసం వినియోగించారు.

అబ్బాజాన్ మరణానికి కొద్దిరోజుల ముందే ఒకాయన అబ్బాజాన్ ముఖం మీదనే, ఆయన్ను తీక్షణంగా విమర్శిస్తూ ఇలా అన్నారు. 'ఇరాన్‌లో ఆయతుల్లా ఖుమేని (నిర్యా: 1989, జూన్ 4) గారు ఇస్లామీయ విప్లవాన్ని లేపడంలో కృతార్థులయ్యారు. కాని మీరు పాకిస్తాన్‌లో ఇస్లామీయ విప్లవాన్ని ఎందుకు తేలేకపోయారు?'అని.

దానికి అబ్బాజాన్ ఇలా బదులిచ్చారు. "అల్లాహ్ కార్యం కోసం నేను కేవలం ఒక కూలి మనిషిని. నాకు అప్పగించిన పనిజేసి యజమానితో కూలి పొందడమే నా కర్తవ్యం. ఇక ఆ కట్టడం ఎప్పుడు పూర్తి అవుతుంది? ఎలా పూర్తి అవుతుంది? పూర్తి అవుతుందా? లేదా? ఇలాంటి విషయాలతో కూలి

మనిషికేం సంబంధం? నిజాయితీతో తనకప్పగించబడిన పనినిచేసి కూలి పొందడమే అతని బాధ్యత."

తన జీవితంలోని ఒక్కొక్క ఘడియను అబ్బాజాన్ దైవకార్యంలో ఒక కూలీగానే గడిపారు. నోటిద్వారా, కలం ద్వారా, సైద్ధాంతిక ఆచరణల ద్వారా అన్నివిధాలా ఆయన తన బాధ్యతలను నెరవేర్చారు. ఆయన 'జిందాబాద్' లాంటి నినాదాలకు ఉప్పొంగిపోలేదు. ముర్దాబాద్ (డౌన్‌డౌన్) నినాదాలకు కుమిలిపోలేదు. సామాన్య వ్యక్తులతో ఆయన్ను పోల్చిచూసినప్పుడు, ఆయన తన వ్యక్తిత్వాన్ని, తన శరీరాన్ని, తన అవసరాలను, తన సంతానాన్ని, వారి భవిష్యత్తును- వీటన్నిటినీ అసలాయన లక్ష్యపెట్టనే లేదు. అబ్బాజాన్‌ను జీవితాంతం స్వార్థరహితునిగా చూసినంతగా ఇతర, ఏ వ్యక్తినీ చూడలేదు.

దాదీఅమ్మా పిల్లలైన మాకు ఇలా చెబుతుండేవారు.

'సిసలైన సయ్యద్ సంతతికి చెందినవానిలో కొన్ని మౌలిక లక్షణా లుంటాయి. ఎవరైనా తననుతాను సయ్యద్‌గా పరిచయం చేసుకుంటే అతనిలో ఏడు సుగుణాల్ని పరిశీలించండి.

◆ సయ్యద్‌కు ఒక్క ధార్మిక విషయంలో తప్ప, అసలే కోపం రాదు.

◆ సయ్యద్ తనకోసమంటూ ఎన్నడూ ప్రతీకారం తీర్చుకోడు.

◆ తిట్లకు బదులుగా ఎన్నడూ తిట్టడు.

◆ పరులెవ్వరి పట్ల కూడా సయ్యద్ ద్వేషం కలిగి ఉండడు.

◆ సయ్యద్ ఎన్నడూ అసత్యం పలకడు, ఇతరుల చాడీలు చెప్పడు.

◆ సయ్యద్ భోజనంలో లోపాలెంచడు, ఆకలిదప్పికలకు ఎన్నడూ వివశుడు కాడు. తనముందుకు ఏదొచ్చినా వినయంగా తిని దైవానికి కృతజ్ఞతలు అర్పించుకుంటాడు.

◆ ఒక సయ్యద్‌కు జీవితంలో ఎప్పుడో ఒకసారైన కష్టకాలం తప్పక వస్తుంది. ప్రాణాపాయం కూడా ఏర్పడే పరిస్థితి వస్తుంది. కాని అతను

ధైర్యం విడనాడడు. దైవంపై విశ్వాసముంచి, ప్రతి ప్రమాదాన్ని ఎదుర్కొంటూ అత్యంత గడ్డు పరిస్థితిని కూడా ధైర్యంగా ఎదుర్కొంటాడు."

తమ వంశ సంబంధంగా, పై అలవాట్లను పిల్లలు అలవర్చుకోవాలని, మానసికంగా వారికి తర్ఫీదునివ్వడానికే దాదిఅమ్మా ఈ నియమాలను బోధించేవారు. అయితే అబ్బాజాన్‌లో పై ఏడు ప్రత్యేకతలు నిండుగా ఉండేవి. సామాన్యంగా ఒక మనిషికి కోపం వచ్చినప్పుడు తననుతాను నిగ్రహించుకోజాలడు. అటువంటి పరిస్థితుల్లో సైతం అబ్బాజాన్ ఓర్పును, అసామాన్యమైన సహనాన్ని ప్రదర్శించేవారు. ఆయనకు ఎవరి పట్లనూ ద్వేషముండేది కాదు.

అబ్బాజాన్‌కు అనవసరంగా కఠినశిక్షలు విధించి జైలుకు పంపండంలో ప్రధాన సూత్రదారులైన వారుకూడా ఆ తరువాత ఎప్పుడైనా ఆయన్ను కలువడానికి వస్తే, అబ్బాజాన్ చిరునవ్వుతో నిండు మనస్సుతో వారిని స్వాగతించేవారు. మీరు నన్నింతగా ఇబ్బందిపెట్టారు కదా! అనే విషయాన్ని ఆయన మాట వరుసకు కూడా ఎవరితోనూ చెప్పిఉండలేదు.

ఒకరోజు ఒక పెద్దమనిషి వచ్చాడు. ఇప్పుడాయన రిటైర్డ్ అయ్యారు. పరిస్థితులు బాగా లేవు. ఆర్థికంగా ఇబ్బందులు పడుతున్నాడు. ఈ కారణంగా దుబాయి లేక అబుదాబి పోవాలనుకుంటున్నాడు. అబ్బాజాన్ దగ్గరికి సిఫారసు పత్రం కోసం వచ్చాడు. అలవాటు ప్రకారం అబ్బాజాన్ ఆయనకు ఓ లేఖ రాసి ఇచ్చారు. అక్కడది ఆయనకు ఎంతో ఉపకరించింది. మంచి ఉద్యోగం దొరికింది. ఈయనగారు ఎవరో కాదు. సైన్యంలో ఉద్యోగం చేస్తున్న కాలంలో మార్షల్ లా న్యాయస్థానానికి జడ్జీగా ఉంటూ, అబ్బాజాన్‌కు ఉరిశిక్ష విధించినవాడు. ఆంగ్లంలోఆయన చేసినసంతకం నేటికీ ఆ తీర్పుపై ఉంది. ఉరిశిక్ష విధించిన వ్యక్తికి సిఫారసు లేఖ ఇవ్వడం, నిజంగా మహోన్నత స్వభావం కలిగిన అబ్బాజాన్‌కే చెల్లు.

జనరల్ ముహమ్మద్ ఆజంఖాన్ కాలంలోనే అబ్బాజాన్‌కు కోర్టు మార్షల్ జరిగింది. ఆ తరువాత ఆయన తరచుగా అబ్బాజాన్‌ను కలువడానికి వస్తుండేవారు. మహనీయ ఏసుక్రీస్తునుడివిన ఈ వాక్కుపై అబ్బాజాన్ నడిచేవారు. 'చేపల్ని పడుతున్న ఓ ప్రజలారా! ఇటు రండి!మీకు మానవుల్ని పట్టుకొనే కళ నేర్పుతాను: మీ వాక్కర్మల ద్వారా, ఆచరణల ద్వారా మానవుల్ని లోబరుచుకోండి. వారిని దైవదాస్యమనే వలలోతెచ్చిపడవేయండి. (తమ వలలో గాదు'.

ఆయన తన సత్ప్రవర్తన మూలంగా శత్రువుల హృదయాల్లో సైతం స్థానమేర్పరుచుకున్నారు. తనను ఎగతాళి, అపహాస్యం పాలుచేసిన భుట్టోగారి పట్ల కూడా ఆయన ఎన్నడూ ద్వేషం కలిగిలేడనే విషయానికి మేమే సాక్ష్యం. ఆయన గురించి ఎప్పుడు మాట్లాడినా ఆయన పట్ల గౌరవం ప్రదర్శిస్తూనే మాట్లాడేవారు. తరచూ ఆయన "దైవం ఆయనకు సద్బుద్ధిని ప్రసాదించుగాక! దేశానికి, జాతికీ మరింత నష్టం వాటిల్లకుండా పరిస్థితులు చక్కబడుగాక!" అంటూ తరచూ చెబుతూ ఉండేవారు.

తిట్టుకు బదులు తిట్టడం అటుంచి, కనీసం ఆయన ఒక్క పరుష పదాన్ని కూడా ఉపయోగించి ఉండలేదు. మా చిన్ననాటి సంఘటన ఒకటి నాకు నేటికీ జ్ఞాపకం ఉంది. ఒకసారి 'అఖ్రా'లోని ఒక మస్జిద్‌లో అబ్బాజాన్ 'జుమా' నమాజు ముగించుకొని ఇంటికొచ్చారు. ఆ మస్జిద్‌లోని ఇమామ్ అబ్బాజాన్‌కు పూర్తిగా వ్యతిరేకి. ఆ పెద్ద మనిషి అబ్బాజాన్ ముఖంమీదే ఆయన్ను అనరాని మాటలన్నాడు. జుమా ప్రసంగం మొత్తం అబ్బాజాన్‌ను తూలనాడుతూనే జరిగింది. చివరగా ఒక చిత్రాతివిచిత్రమైన ఈ తర్కంతో తన ప్రసంగాన్ని ముగించాడు.

మౌదూదీని అనుసరించే వాడెవడైనా చనిపోయి పాతిపెట్టబడితే అతని సమాధిపై మొలిచిన రేగుచెట్టు ఆకుల్ని తిన్న మేక పాలుసైతం నిషిద్ధం (హరాం).

అబ్బాజాన్‌తోపాటు నమాజుకు వెళ్ళిన మా సోదరులు ఇంటికొచ్చి కడుపుబ్బ నవ్వసాగారు. ఆ మస్జిద్ ఇమాం సెలవిచ్చిన జుమా ప్రసంగపు ఆ భాగాల్ని మాకు వినిపిస్తున్నారు. కాని అబ్బాజాన్ మాత్రం అతిసామాన్యంగా ప్రశాంతంగా కూర్చుని ఉన్నారు. ఇందులో 'నవ్వేటంతటి విశేషమేముంది అని మీరు నవ్వుతున్నారు?' అన్నట్లు ఆశ్చర్యంగా మావైపు చూస్తుండిపోయారు.

జామియా అష్రఫియా (లాహోరు)కు చెందిన ఓ ధార్మికవేత్త అబ్బాజాన్ దృష్టికి 'మౌలానా అహ్మద్ అలీ లాహోరి (నిర్యా: 1962, ఫిబ్రవరి22)గారు మిమ్మల్ని విమర్శించారు. కాని మీనుండి ప్రతిస్పందన రాలేదు. దీనివల్ల సందేహాలు, అనుమానాలు పొడసూపుతున్నాయి. అని అనగా దానికి అబ్బాజాన్ ఇలా సమాధానమిచ్చారు.

'ఎవరైనా అనవసరంగా నన్ను విమర్శిస్తుంటే నాకు బాధ కలుగుతుందనేది నిజం. కాని దీనికి సంబంధించినంతవరకు మౌలానా అహ్మద్ అలీ లాహోరీగారి వ్యవహారం వేరు. ఆయన గారు మహాపుణ్యాత్ములు. ఆ పుణ్యాల కారణంగా ఆయన చేసిన ఈ పొంతనలేని విమర్శను దైవం క్షమించవచ్చు. ఇక నా ఖాతాలో ఎన్ని లోపాలున్నాయంటే, నేను ఓర్పు వహించి మౌనం దాలిస్తే నా పాపాలు తగ్గిపోవచ్చు అనేది నా నమ్మకం.

అబ్బాజాన్ ఆకలిదప్పికలను ఎంతగానో నిగ్రహించుకునే మనిషి. ఆయనెప్పుడూ భోజనంలో లోపాలను ఎంచలేదు. వంటమనిషి పొరపాటున ఉప్పుకారాలు అధికంగా వేసినా, లేక వేయడమే మరిచిపోయినా, ఆయన మారుమాట్లాడకుండా ఎలాంటి లోపాన్ని ఎంచకుండా ఓర్పు సహనాలతో భోంచేసేవారు. మా పిల్లలనోట ఎప్పుడైనా అసంతృప్తి వ్యాకాలు వెలువడితే, "ప్రతిరోజూ బాగానే ఉంటుందిగా! ఒక్కరోజు ఏదో కాస్త పొరపాటు జరిగితే ఇంతగా చికాకు పడడం, అసంతృప్తి చెందడం దేనికి?" అంటూ మందలించేవారు. ఆయన్ను చూసి మాలోని ఏ ఒక్కరూ కూడా భోజనంలో లోపాలు ఎంచడానికి సాహసించేవాళ్ళం కాదు. ఇక ఎప్పుడైనా అయాచితంగా మా పిల్లల్లో

ఎవరి నోటినుండైనా అసంతృప్తిని వ్యక్తపరిచే మాటే గనుక వస్తే, దాదిఅమ్మా వెంటనే, "ఇతను నకిలీ సయ్యద్, ఇంకా మాట్లాడితే నవముస్లిం. తన అల వాటును మరిచిపోలేడుగా పాపం!" అంటూ ఘాటుగా ఆట పట్టించేది. అందుకని ఆ పదునైన 'నకిలీ సయ్యద్', 'నవముస్లిం' అనే పదాలకు భయపడి మాలోని ఏ ఒక్కరూ నోరు తెరవడానికి కూడా సాహసించే వారం కాదు. దాదీఅమ్మా గతించిన తరువాత కూడా మా అన్నచెల్లెళ్ళలో భోజనంలో లోపాలెంచినవాడ్ని, 'నకిలీ సయ్యద్', 'నవ ముస్లిం' అంటూ దెప్పిపొడిచే ఆచారం ఉంటూ వచ్చింది.

ఆ కాలంలో 'పాలస్తీనా' ముస్లింల ప్రతినిధివర్గం ఒకటి లాహోరుకు వచ్చింది. వారు అబ్బాజాన్‌ను కలువదలిచారు. అబ్బాజాన్ వారిని తేనేటి విందిచ్చి ఆహ్వానించారు. వారి రాకకు కొన్ని గంటల ముందే వారితో మహి ళలు కూడా ఉన్నారనే సమాచారం అందింది. స్త్రీ పురుషులతో కూడిన ఉమ్మడి సమావేశం మా ఇంట్లో అసంభవం. అందుకని అబ్బాజాన్ లోపలి 'లాన్'లో మహిళల కోసం ఏర్పాట్లు చేయించారు. 'అతిథులైన ఈ మహిళల ఆదర సత్కార్యాల బాధ్యత మీదే' అంటూ మమ్మల్ని పురమాయించారు.

అది నిండు వర్షాకాలం. టెంట్‌హౌస్ వాళ్ళు టేబుళ్ళు, కుర్చీలు అమర్చు తుండగానే దట్టమైన నల్లటి మేఘాలు నలువైపులా అలుముకున్నాయి. ఇక ఏ క్షణంలోనైనా వర్షం మొదలయ్యే సూచనలు స్పష్టంగా కనబడు తున్నాయి. మేమంతా భయపడి పోయాము. 'బయట అతిథులు కూర్చున్న తరువాత వర్షం ప్రారంభమైతే ఎంత గందరగోళం ఏర్పడుతుంది?' అంటూ అబ్బాజాన్‌ను అడిగాము. ఇన్షాఅల్లాహ్! వర్షం రాదు! అబ్బాజాన్ ఎంతో ప్రశాంతంగా సమాధానమిచ్చారు.

వర్షం మొదలవడానికి సిద్ధంగా ఉందే!' మేము గాబరాపడి అడిగాము.

'చెప్పాను గా!' ఇన్షాఅల్లాహ్ వర్షం రాదు!' అంటూ అబ్బాజాన్ ఇంకా దృఢంగా సమాధానమిచ్చారు.

ఇక చూస్తుండగానే మబ్బులన్నీ తేలిపోయాయి. నీలాకాశం కనబడ సాగింది. దాంతో పాటు ఎంతో హాయిని గొలిపే చల్లని గాలి వీచసాగింది. మా మనస్సులు తృప్తిపడిపోయాయి. అతిథులు వచ్చి ప్రశాంతంగా టీ త్రాగి వెళ్ళిపోయారు. అతిథులు వెళ్ళిపోయిన తరువాత, సామాన్లన్నీ సర్దుకున్న పిదప కారుమేఘాలు తిరిగి కమ్ముకున్నాయి. ఆ రాత్రంతా కుండపోతగా వర్షం కురవసాగింది.

అప్పుడు మా అమ్మీజాన్ ఇలా అన్నారు. ఈ తల్లీకొడుకులున్నారే! (అబ్బాజాన్, దాదిఅమ్మాలు) వీరేది చెప్పినా మారు మాట్లాడకుండా అంగీకరిం చండి. వీరితో వాదించకండి. వీరేదైతే చెబుతారో, దైవం తరుచుగా వారి మాటను నిలబెడతాడు. ఆ తరువాత అమ్మీజాన్ మహాప్రవక్త (స) సెలవిచ్చిన రెండు ప్రవచనాలను వినిపించారు.

1. హజ్రత్ అనస్(రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు(స) ఇలా సెలవిచ్చారు: 'దైవదాసుల్లోని కొందరు వ్యక్తులు ఓ విషయం గురించి దైవప్రతిన చేసినట్లయితే, దైవం వారి మాటను నెగ్గిస్తాడు.'

2. హజ్రత్ అబూహురైరా(రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు. "చెదిరిపోయిన జుత్తు కలిగి, వారి కోసం ఎవరి ద్వారాలు కూడా తెరుచుకోవో (అంటే వారు నిరుపేదలు, అనామకులై ఉండి, ఎవరి చేతనూ ఆహ్వానింపబడనివారు అని అర్థం) అలాంటి వారు దైవప్రతిననే గనుక పూనితే, దైవం వారి ప్రతినలో వారిని కృతార్థులుగా చేస్తాడు."

జీవితాంతం 'మన్ మరీజమ్-తూ తబీబ్ (నేను రోగిని- నీవే వైద్యునివి) అంటూ స్వస్థత పొందే దాదిఅమ్మా, 1957 డిసెంబరు నెల 6,7వ తేదీల మధ్య రాత్రి రెండు గంటలకు పరమపదించారు. అంటే తన నిజ వైద్యుని వద్దకు వెళ్ళిపోయారు.

దాదిఅమ్మా చనిపోయిన తరువాత ప్రజలు, ఇంత గొప్ప ధార్మికవేత్త అయిన తనయుడు, తన తల్లిగారి పుణ్యార్థం ఖుల్ సభలు, దస్వాఁ, బీస్వా,

చాలీస్వాఁలు చేసి బిర్యానీ పలావ్‌లతో ఈసాలె సవాబ్ చేసి హల్వా రొట్టెలు పంచిపెడతారని ఆశించారు. కాని వారికి నిరాశే మిగిలింది. ఖుల్ సభలూ లేవు, దినాలు, వారాలులాంటి ఇతర ఏ మూఢాచారాల జోలికి పోలేదాయన. ఇంకేముంది? ఎవరికి తోచినవిధంగావారు విమర్శించసాగారు.కొందరైతే అబ్బాజాన్‌ను తిట్టిపోశారు. 'ఓ అల్లాహ్! ఇలాంటి సంతానాన్ని ఎవ్వరికీ ఇవ్వబోకు! తల్లిని మట్టిలో కలిపి వచ్చి తిరిగి చూస్తేనా!' ఇలాంటి విమర్శలకు ఇంట్లో అందరం నొచ్చుకున్నాం. కాని అబ్బాజాన్ ఇలాంటి విమర్శలను పట్టించుకుంటేగా! సంబరంగా విని ఊరుకున్నారు.

ఇక మరో కోణం చూడండి. మాకు తెలిసిన నిరుపేద ఒకరుండేవారు. ఉబ్బసంతోఆరోగ్యం చెడిపోయి, కాయకష్టం చేసి సంపాదించుకునే స్తోమత లేదాయనకు. ప్రతిరోజు మధ్యాహ్న సమయానికి మా ఇంటికి వచ్చేవాడు. అతనికి గౌరవప్రదంగా కడుపునిండా భోజనం పెట్టేవాళ్ళం. అతను భోంచేసి మా ఇంట్లోనే మంచంలో విశ్రాంతి తీసుకునేవాడు. సాయంత్రం తిరిగి భోంచేసి తన ఇంటికెళ్ళిపోయేవాడు. ఈ విషయం ఎవరికీ తెలియదు. మా తాతగారి ఈసాలె సవాబ్ (పుణ్యార్థం) అతనికి మధ్యాహ్నం భోజనం పెట్టాలని, దాదిఅమ్మ గారి ఈసాలె సవాబ్ కోసం అతనికి సాయంత్రం భోజనం పెట్టా లనేది అబ్బాజాన్ ఆదేశం. ఇంకా ఆ సంవత్సరమే 'రాబితయె- ఆలమె ఇస్లాం' సదస్సులో పాల్గొనేందుకు అబ్బాజాన్ సౌదీఅరేబియా వెళ్ళినప్పుడు, దాదిఅమ్మ ఈసాలె సవాబ్ కోసం 'హజ్' చేశారు. అనేక 'ఉమ్రా'లు కూడా చేయడం జరిగింది.

# 10. అబ్బాజాన్ మూడవ నిర్బంధం

1964 జనవరి 4న అబ్బాజాన్ మూడవసారి జైలుకెళ్ళారు. తిరిగి యధారీతిగా పుస్తకాలు నిండిన పెద్ద పెద్ద పెట్టెలు జైలుకు తరలడం మొదలయ్యాయి. 'ఎ' క్లాస్ ఖైదీలకు హల్వాలు, మిఠాయిలు రకరకాల తిను

బండారాలు వస్తుంటే ఈ మౌలానా గారి కోసం పుస్తకాలు వస్తున్నాయేమి టబ్బా?' అంటూ జైలు సిబ్బంది నిర్ఘాంతపోయేవారు. ప్రస్తుతం 'షాద్‌మాని కాలనీ' ఉన్న ప్రాంతంలో అప్పట్లో లాహోర్ జైలు ఉండేది. ప్రతివారం మేము పోయి కలిసొచ్చేవాళ్ళం. ఈ కాలమంతా కూడా అమ్మీజాన్ అస్వస్థతతోనే ఉన్నారు. దాదిఅమ్మా ఉంటే ఆమెకు కాస్త ధైర్యంగా ఉండేది. ఆమె కూడా దూరమై పోయారు.

మూడవసారి నిర్బంధించటానికి కొంచెం ముందు, ఫీల్డ్ మార్షల్ ముహమ్మద్ అయ్యూబ్‌ఖాన్ (నిర్యా: 1974 ఏప్రిల్ 20) గారితో చిరస్మరణీయమైన సమావేశం ఒకటి జరిగింది. అయ్యూబ్‌ఖాన్ గారి కోరికమీద ఈ సమావేశం గవర్నమెంట్ హౌజ్, లాహోర్‌లో జరిగింది. ఈ కలయిక జరిగినప్పుడు పశ్చిమ పాకిస్తాన్‌కు గవర్నరు అయిన అమీర్ ముహమ్మద్ ఖాన్ అఫ్ కాలాబాగ్ (నిర్యా: 1967, నవంబరు 26) కూడా ఆయన వెంట ఉన్నారు. అయ్యూబ్‌ఖాన్ గారు అబ్బాజాన్‌ను ఇలా కోరారు.

మౌలానాగారు! మీరు రాజకీయాల్ని విడిచిపెట్టండి. దేశానికి, ప్రభుత్వానికి మీ అవసరం ఎంతో ఉంది'

"అయ్యూబ్‌ఖాన్ గారూ! మీరు జీవితమంతా కూడా సైన్యానికి సేవ చేశారు. సామూహిక జీవిత విషయాల్లో నేను పాల్గొనకూడదని మీరెలా చెప్ప గలుగుతున్నారు. ఏ నియమాన్ని, ఏ సూత్రాన్ని అనుసరించి రాజకీయాల్లో పాల్గొనవద్దని నాకీ సలహా ఇస్తున్నారు" అని అడిగారు అబ్బాజాన్.

'అదికాదు మౌలానా గారూ! ఈ రాజకీయాలున్నాయే, అవి అత్యంత దుర్గంధపూరితమైనవి, మీలాంటి వ్యక్తి ఇందులో దూరకూడదు.'

'అయితే ఈ రాజకీయాలు అలాగే దుర్గంధపూరితంగా ఉండాలనా మీ అభిప్రాయం?' అందులో దుర్వర్తనులు కాకుండా సచ్ఛీలురు వచ్చినప్పుడే కదా ఈ రాజకీయాలు శుభ్రపడతాయి!' అని బదులిచ్చారాయన.

ఆ తరువాత అయ్యూబ్‌ఖాన్ గారు ఇలా మాటమార్చారు.

'మీ పిల్లల పేరుతో ఫ్యాక్టరీలు తెరవండి, మేము మీకు బ్యాంకుల ద్వారా అప్పులిప్పిస్తాం. మీకు పర్మిట్లు, లైసెన్సులూ ఇస్తాం, మీరు కోరిన ఏ అరబ్బు దేశానికైనాసరే, మిమ్మల్ని రాయబారిగా పంపిస్తాం.

ఈవిధంగా అయ్యూబ్‌ఖాన్ రకరకాల ఆశలు చూపారు. కాని అబ్బాజాన్ చూపిన నిరపేక్షత, నిస్వార్థం దానికదే సాటి!

'ఖాన్‌సాహెబ్! మీరు నాగురించి చాలా తప్పుగా అంచనా వేస్తున్నారు' అని మాత్రమే చెప్పి ఊరుకున్నారు అబ్బాజాన్.

అయ్యూబ్‌ఖాన్ నిర్ఘాంతపోయారు. ఈ కాలంలో మట్టిని, బంగారాన్ని ఒకే దృష్టితో చూడగలిగినవారు కూడా ఉన్నారా? అంటూ ఆశ్చర్యచకితు లయ్యారు. అబ్బాజాన్ తరచుగా ఒక కావ్యపంక్తిని చదువుతూ ఉండేవారు. ఆయన పరిస్థితికి కూడా ఇది చక్కగా అతికేది.

'హజార్ దేనేకా ఏక్ దేనాహై- ఏక్ దిల్ బేముద్దు ఆ దియాతూనే'

''వేల వరాలకు మించిన ఒకే వరమిచ్చావు. కోరికల్లేని, నిరపేక్షాపర మైన ఒక హృదయాన్ని ప్రసాదించావు అంతేచాలు.'

అబ్బాజాన్ ఒకచోట ఇలా రాశారు. 'మనిషి తన కంటికి కనబడని విషయాల కోసం, ఎదురుగా కానవచ్చే దాన్ని నిరాకరించే పరిస్థితినే 'ఈమాన్ బిల్ గైబ్' (అగోచరాలపై విశ్వాసం) అంటారు. అతను పరలోక సాఫల్యం కోసం, ప్రపంచ ప్రయోజనాలను త్యజిస్తాడు. భౌతిక దృష్టితో, ప్రపంచ దృష్టి కోణంతో నూటికి నూరుపాళ్ళు నష్టమున్న వ్యవహారాన్నే స్వీకరిస్తాడు. సంతృప్తి చెందుతాడు, ఈ 'ఈమాన్ బిల్‌గైబ్' కారణంగానే మనిషి ఈ ప్రపంచం, అందు లోని లాభనష్టాలకు అతీతంగా సుదూరంగా ఉన్న స్వర్గంపై తన దృష్టిని కేంద్రీ కరిస్తాడు. దాన్ననుసరించే వ్యవహారాలు చేస్తాడు. అతని దృష్టి స్వర్గదృశ్యాలనే వీక్షిస్తూ ఉంటుంది. స్వర్గంలోని సెలయేళ్ళు, స్వర్గఫలాలు, దాని చల్లని నీడలు, దాని సౌఖ్యాలపై మాత్రమే అతని దృష్టి నిలిచి ఉంటుంది.

1964లో అబ్బాజాన్‌ను నిర్బంధించిన తరువాత ఆయనపై 'దేశ ద్రోహం' నేరారోపణ మోపారు. ఆకాలంనాటి 'హోం సెక్రటరీ'గారు అబ్బాజాన్ సమక్షంలోనే హైకోర్టులో ప్రమాణం చేస్తూ అసత్య వాంగ్మూలం ఇచ్చారు. బహుశ దీనికి ప్రతిఫలంగానే కావచ్చు. 'థల్' ప్రాంతంలో అయ్యూబ్‌ఖాన్ గారు ఆయనకు ఒక పెద్ద భూక్షేత్రాన్ని ప్రసాదించారు. ఆయనగారు తన ఇద్దరు కుమారుల్ని భూమి కబ్జా తీసుకోవడానికని అక్కడికి పంపించారు. అయితే అంతకుముందే ఆ భూమి మరొకరి మాన్యంలో ఉంది. వారు ఎంతో కోపోద్రేకులై ఉన్నారు. వారు సెక్రటరీ గారి కుమారుల్ని గొడ్డళ్ళతో నరికిచంపేశారు. తీక్షణమైన ఎండలో ఓ రోజంతా ఆ శవాలు అక్కడే పడిఉన్నాయి. హంతకులు ఎవరినీ శవాలు ముట్టుకోవడానికి అనుమతించడంలేదు. చివరికి ఈ సెక్రటరీ గారే భారీ పోలీస్ బందోబస్తుతో వెళ్ళి, శవాల్ని తెచ్చుకున్నారు. ఆయనకు ఈ ఇద్దరే కుమారులు. ఒకరి వయస్సు 32 సంవత్సరాలు, మరొకరిది 28 సంవత్సరాలు. మాకు పరిచయమున్న వ్యక్తి ఒకతను పరామర్శ కోసమని ఆయనింటికి వెళ్ళాడు. అతను అక్కడి పరిస్థితిని తెలుపుతూ, పెద్దయ్యగారు, ఆయన కుటుంబీకులు దేవున్నే అనరాని మాటలంటున్నారు. మేమా మాటల్ని భరించలేక మాకు కూడా పాపం అంటుతుందేమోననే భయంతో చెవుల్లో వేళ్ళుపెట్టుకొని, బయటికి పరుగెత్తుకొచ్చాము. అన్నాడు.

అబ్బాజాన్ తరచుగా ఇలా అంటుండేవారు. 'పేదరికం, అజ్ఞానం, నూటా యాభై సంవత్సరాల దాస్యం అన్నీ కలిసి, మన జాతిలోని అత్యధిక మందిని సిగ్గులేనివారుగా, నీచ స్వభావులుగా మార్చేశాయి. వారు భుక్తికి, గౌరవానికి దాసులయ్యారు. ఎవరైనాసరే, భుక్తికోసం కొన్ని రొట్టెలు పారేస్తే గౌరవప్రతిష్ఠలనబడే కొన్ని ఆటవస్తువుల్లాంటి బిరుదులు ముఖానబడేస్తే వీరు కుక్కల్లా పరుగెత్తుకొస్తారు. తమ ధర్మం, విశ్వాసం, ఆత్మ, ఆత్మాభిమానం, గౌరవం, తమ జాతి గౌరవమర్యాదలు అన్నిటికీ వ్యతిరేకంగా ఏదంటే ఆ పని చేయడానికి సంసిద్ధులవుతారు. ఇస్లాం, ముస్లింల సముదాయం నుండే ఒకరిద్దరు కాదు, వందల వేల సంఖ్యలో దొంగలు, వంచకులు, ద్రోహులు

ఆంగ్లేయులకు లభించారని గడిచిన నూటాయాభై ఏళ్ళ అనుభవం తెలుపు తుంది. వీరు తమ ప్రసంగాలు, రచనలు, తమ అంగాలతోనే కాదు, ఖడ్గాలు, తుపాకులతో సైతం తమ ధర్మానికి, తమ జాతికి వ్యతిరేకంగా శత్రువులకు ఎనలేని సేవచేసి పెట్టారు.

అబ్బాజాన్ జైలునుండి విడుదలై వచ్చినప్పుడు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ పాకిస్తాన్‌లో ఒక ఉన్నత హోదాపై ఉన్న బంధువొకరు మిఠాయి పట్టుకొని అబ్బాజాన్‌కు శుభాకాంక్షలు తెలుపటానికని మా ఇంటికొచ్చారు. అయితే ఆయన అమితంగా మాట్లాడే తన సహజస్వభావానికి భిన్నంగా, మౌనంగా ముభావంగా కాస్సేపు కూర్చుండి వెళ్ళిపోయారు. ఆయన పోయిన తరువాత ఆయన నేడు ఎందుకని ఇలా ముభావంగా ఉన్నారని మేము అడిగినదానికి అబ్బాజాన్ ఇలా సమాధానమిచ్చారు.

జమాఅతె ఇస్లామీపై ఆంక్ష విధించినప్పుడు, ఒక కేసు సందర్భంలో నన్ను పోలీస్ జీపులో హైకోర్టుకు తీసుకువచ్చారు. సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ నాతోపాటుగా ఆ జీపులోనే కూర్చుండి ఉన్నాడు. జీపు హైకోర్టు గేటువైపుకు మళ్ళుతుండగా, ఎదురుగానే ఈయనగారు తన కారును స్వయంగా నడుపుతూ మాకెదురొచ్చారు. ఆయనపై దృష్టిపడగానే అప్రయత్నంగా చేత్తో సంజ్ఞ చేసి ఆయనకు సలాం చేశాను. కాని ఆ పెద్దమనిషి నావైపు చూసి కూడా సలాంకు బదులివ్వకుండా సత్రున జారుకున్నాడు. సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ దృష్టి తన మీద పడుతుందనే భయంతోనే ఆయన సలాంకు బదులివ్వకుండా వెళ్ళిపోయాడు. ఆ తరువాత అబ్బాజాన్ ఇలా బోధించారు.

ఈ ప్రపంచం, అందులోని ఈ సంబంధాల వాస్తవికత ఏమిటో మీకు తెలియాలని నేనీ విషయం చెబుతున్నాను. మనిషి పరిస్థితులు బాగున్నంత వరకే ఈ ప్రేమలు, స్నేహాలు, బంధుత్వాల ఉనికి. పరిస్థితులు కొంచెం మారిపోగానే ఈ స్నేహాలు, ప్రేమలు, బంధుత్వాలు అన్నీ తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి.

అబ్బాజాన్ మాకీ విషయం చెప్పకపోయినా, కొందరు పైపైకి చూపు తున్న ప్రేమాభిమానాలతో మోసపోకూడదని మేము మా అనుభవం ద్వారా తెలుసుకున్నాము. అబ్బాజాన్ జైలు బయట ఉన్నంతకాలం మేము మౌలానా గారి పుత్రులం. ఇక ఎప్పుడైతే అబ్బాజాన్ జైలుకెళ్ళేవారో, మనుషులతో కిక్కిరిసి ఉన్న ఈ ప్రపంచంలో మేము ఏకాకులమైపోయేవాళ్ళం. ఇక అబ్బాజాన్ జైలు నుండి బయటపడగానే, మా కోసం ప్రాణాలర్పించేవారి కొదవే లేదనిపించేది.

బహుశ ఈ కారణంగానే కావచ్చు, మాకు మేము నియంత్రణలో ఉంచుకునేవాళ్ళం. ముందు పడి వారితో కలిసేవాళ్ళం కాదు, ఎదుటివారు కలువదలిస్తే మేమూ కలుపడానికి సంసిద్ధులమై ఉండేవాళ్ళం. ఈ కారణం గానే కొందరు మమ్మల్ని గర్విస్టులుగాను, మితభాషులుగానూ భావిస్తుంటారు. దీనికి అసలు కారణం ఏమిటంటే, అబ్బాజాన్ మూలంగా, బాహాటంగా మాతో కలువడానికిప్రజలు జంకుతుండేవారు. మాతో పరిచయం, బంధుత్వం ఉందని తెలిస్తే ఎక్కడ తమ సర్వీసు రికార్డు చెడిపోతుందనో, ప్రమోషన్ ఆగి పోతుందనో, ఎక్కడెక్కడ ఎంక్వైరీలు జరుగుతాయనో వారు భయపడు తుండేవారు. అందుకని వారిని కలువడంలో మేము కూడా ముందడుగు వేసేవాళ్ళం కాదు. ఇతరుల్ని కలుపడంలో ముందుబడకపోవడం, మమ్మల్ని మేము నియంత్రించుకోవడానికి చిన్నప్పటినుండి ఎంతగా అలవాటు పడి పోయామంటే, ఆ స్వభావం ఇప్పుడు మార్చుకుందామన్నా మారడం లేదు.

# 11. ఇంటిపై పోలీసుల దాడి

అది 1966వ సంవత్సరం, రంజాన్ నెల. తరావీహ నమాజ్ వేళ సమీపిస్తోంది. ప్రజలు తరావీహ నమాజ్ కోసం సమావేశమవుతున్నారు. ఇంత లోనే 'అభ్రా' పోలీస్‌స్టేషన్‌కు చెందిన సబ్‌ఇన్‌స్పెక్టర్ ఇద్దరు కాని స్టేబుళ్ళను వెంటబెట్టుకొని మా ఇంటికొచ్చి, నేను ఏకాంతంలో అర్జంట్‌గా మౌలానాగారితో మాట్లాడాల్సి ఉంది. అంటూ కబురు పంపాడు. ఆయన్ను అబ్బాజాన్ తన

కార్యాలయంలోనికి పిలిపించుకున్నారు. ఇద్దరు సిపాయీలను బయటనే ఉంచి, తానొక్కడే లోపలికొచ్చి అబ్బాజాన్‌తో-

"నాకిప్పుడే 'పైనుండి' ఆదేశాలందాయి. లేడీ పోలీసులు కూడా ఉన్న పోలీస్‌పార్టీని తీసుకొని వెంటనే మౌలానా మౌదూదీ గారి ఇంటిమీద దాడి జరపాలి. అక్కడ సర్వెంట్స్ క్వార్టర్స్‌లో ఒక అపహరించబడిన అమ్మాయి ఉంటుంది. ఆమెను అరెస్ట్ చేయండి. ఫోటోగ్రాఫర్లతో ఆమె ఫోటోలు తీయించండి. అక్కడ్నే, అప్పటికప్పుడే పత్రికా విలేకరులకు అన్నివివరాలు తెలిపేయండి." ఇది చెప్పిన తరువాత ఆ సబ్‌ఇన్‌స్పెక్టర్ ఇంకిలా అన్నాడు. "మౌలానా గారు! మీ గౌరవమర్యాదలు నా గౌరవమర్యాదల్లాగే నాకెంతో ప్రీతి పాత్రమైనవి. నేను తొందరపడి మీ వద్దకు వచ్చాను. మీరువెంటనే సర్వెంట్ క్వార్టర్స్‌ను గాలించి, ఆ అమ్మాయిని కనుగొని బయటకు గెంటివేయండి. ఇకిప్పుడు నేను వెళ్ళిపోతున్నాను. కేవలం పదిహేను నిమిషాల్లో పోలీస్ వ్యాన్‌లో, ఫోటోగ్రాఫర్లు, పత్రికా విలేకరులతో సహా మీ ఇంటిపై దాడి జరుపుతాను. మీ గౌరవం, మీ అబ్బాయిల గౌరవం దక్కాలని నేను కోరుకుంటున్నాను. ఎందుకంటే మీ అబ్బాయిల్లో ఎవరో ఒకరిపై నిందమోపడం ఖాయం. ఇక సెలవు." ఇది విన్న వెంటనే అబ్బాజాన్ లోపలికొచ్చి, రహస్యంగా అమ్మీజాన్‌కు ఈ విషయం తెలిపారు. కొంచెం గుసగుసలు మా చెవుల్లో కూడా పడ్డాయి. అమ్మీజాన్ సర్వెంట్ క్వార్టర్స్‌కెళ్ళారు. అక్కడున్న నౌకర్లు ఏవో కల్లిబొల్లి కబుర్లు చెప్పసాగారు.'లేదు బేగంసాబ్! అదెలా సాధ్యం? మేము మీ ఉప్పు తింటున్నాం. మీ చెమట, అయ్యగారి చెమట పడినచోట మా రక్తం ధార బోయటానికైనా వెనుదీయం.

ఇటు సమయం దాటిపోయింది. ఒక్కసారిగా సోదరులు హుస్సేన్ ఫారూఖ్ (జన: 1945, ఫిబ్రవరి 15 ఢిల్లీ), ముహమ్మద్ ఫారూఖ్ ఇద్దరూ సర్వెంట్ క్వార్టర్స్‌లో జొరబడిపోయారు. గాలించగా మావంట మనిషి దూరపు బంధువైన ఒక అమ్మాయి కంటబడింది. ఆ వంటమనిషి, అమ్మాయిని అప్పటికప్పుడే అక్కడినుండి బయటికి గెంటివేశారు. ఇంటి ఒక గేటు నుండి వీరిద్దరు అలా

బయటపడ్డారో లేదో, వేరొక గేటు నుండి పోలీస్ వాహనాలు లోనికి ప్రవేశిం చాయి. లేడీ పోలీసులు ఇంటినంతా సోదాచేశారు. మగ పోలీస్‌వారు సర్వెంట్ క్వార్టర్స్‌పై విరుచుకుపడ్డారు. అక్కడ ఎవరైనా అమ్మాయి ఉంటేగా దొరికేది! ఈ సంఘటన అయ్యూబ్‌ఖాన్ అధ్యక్ష పదవీ కాలంలో జరిగింది.

ఈ జాతిలో పెద్దపెద్ద అధికారులు నీతిహీనులై, ఆత్మద్రోహులై, ముఖస్తోత్రం చేసే నిరాశాజనకమైన ఆ కాలంలో, 'అఛ్రా' పోలీస్‌స్టేషన్ అధికారి లాంటి నీతివంతులు, నిజాయితీపరులు, ఇతరుల గౌరవమర్యాదల్ని తమ గౌరవమర్యాదలుగా భావించే అపురూపమైన వ్యక్తులు కూడా ఉండడం ఎంతో హర్షించదగ్గ విషయం. నీతిమంతుడైన ఈ పోలీస్ అధికారి తన ప్రమోషన్‌ను, తన భవిష్యత్తును ప్రమాదంలో పడేసి తన సర్వీసును కూడా పణంగా పెట్టి, ముందే దీని గురించి అబ్బాజాన్‌ను హెచ్చరించి ఉండకపోతే మరుసటిరోజు పత్రికల్లో ఎలాంటి పతాక శీర్షికలతో వార్తలు ప్రచురించబడేవో తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు.

ఆ అధికారే అబ్బాజాన్‌కు ఇంకిలా తెలిపాడు. 'మౌలానా గారు! మీ ప్రైవేట్ సేవకుల్లో కొందరు ప్రతిరోజు, రాత్రి సమయంలో స్టేషన్‌కొచ్చి, ఆ రోజంతా అక్కడ జరిగిన వివరాల రిపోర్టు ఇస్తుంటారు. వారు మీరిచ్చే జీతం కన్నా ఎక్కువ జీతం పోలీస్‌స్టేషన్ నుండి పొందుతున్నారు.

'మీ చెమట పడినచోట రక్తం కారుస్తామని' ప్రగల్భాలు పలికే నౌకర్లే వీరు అన్న విషయాన్ని మనమిక్కడ మరువరాదు. ఇది విన్న తరువాత కూడా అబ్బాజాన్ ఎవరినీ పనినుండి తీసేయలేదు. కొత్తవారిని పెట్టుకున్నా, వీరికి లాగే వారు కూడా స్టేషన్‌లో రిపోర్టు ఇస్తూనే ఉంటారు అనే భావంతో.

అప్పటికి మేము స్కూలు విద్య ముగించుకొని కాలేజీలో చేరాము. అధ్యక్షుడు అయ్యూబ్‌ఖాన్ గారు దేదీప్యమానంగా వెలిగిపోతున్నారు. ఆయన మాటకు ఎదురులేదు. అబ్బాజాన్‌కు వ్యతిరేక ప్రచారం తారాస్థాయికి చేరుకుంది. ఆయనకు వ్యతిరేకంగా వినూత్న శీర్షికలతో వివిధ పత్రికల్లో వార్తలు

వేస్తున్నారు. ఒకసారి మౌలానా మౌదూదీ దేశద్రోహి అని, ఇంకొకసారి ఆయన పాకిస్తాన్ వ్యతిరేకి అని, రకరకాలుగా నిందలు మోపుతుండేవారు. లాహోర్ మహిళా కాలేజీలో అడుగుపెట్టగానే తిట్లు, దూషణలతో మాకు స్వాగతం లభించింది. మౌదూది-మర్దూది, ఏక్ మౌధూదీ- సౌయహుది, తా మౌదూదీ తా, ఈవిధంగా మమ్మల్ని తిట్టిపోసేవారు. ఇవన్నీ వింటూ ఉంటే మా హృదయా లెంతో గాయపడేవి. ఎప్పుడైనా ఈ విషయాల్ని అబ్బాజాన్‌కు విన్నవించుకుంటే వీటన్నింటికి జవాబుగా ఆయన భావగర్భితమైన ఒకే ఒక కావ్యపాదాన్ని చదివేవారు. దాని భావం ఇలా ఉండేది.

'సౌశీల్యవంతమైన వాడలో వారు మమ్మల్ని అడుగిడనివ్వకపోవడం నీకు నచ్చే విషయం కాదు. అలాంటప్పుడు నీకు నీ అదృష్టాన్ని మార్చుకోగలిగే శక్తి ఉంటే మార్చుకో!' అమ్మీజాన్ మాత్రం మాకీ విషయం అర్థమయ్యేలా విడమర్చి చెప్పారు. చదువాలనుకుంటే ఈ పరిస్థితుల్లో వారితోనే కూర్చుండి చదువాల్సి ఉంటుంది. లేదనుకుంటే అజ్ఞానులుగా, మూర్ఖులుగా ఉండి పోతారు. పెద్దపెద్ద తుఫానులొచ్చి ఢీకొన్నా, తమ స్థానం నుండి అంగుళమైనా కదలని కొండలుగా మిమ్మల్ని మీరు మలుచుకోండి. పెద్దపెద్ద నదులొచ్చి కలిసినా వాటన్నిటిని తనలోనే ఇముడ్చుకోగలిగే సముద్రంలా మారండి. అది ఎప్పుడూ తన తీరాన్ని తెంచుకొని బయటికి రాదు. అంగడిలోని తిట్టు పట్టించు కుంటే ఒట్టు' అనే చందాన ఈ తిట్లను, దూషణల్ని అసలే ఖాతరు చేయవద్దు. దీనితోపాటు, తిట్టుకు జవాబు తిట్టుతో ఇవ్వరాదని అమ్మీజాన్ మమ్మల్ని కఠినంగా ఆదేశించారు. ఆమె ఇంకిలా అనేవారు. మౌనమనేది వెయ్యి ప్రశ్నలకు సమాధానం. బురదలో రాయి విసిరితే మీ బట్టలే పాడయిపోతాయి. అందుకని ఎప్పుడూ ఎవరి పరుషపదాలకూ సమాధానమివ్వకండి.

అబ్బాజాన్‌తో ప్రత్యక్షంగా విద్యనభ్యసించిన గౌరవం కూడా మా అన్నా చెల్లెళ్ళలో కేవలం నా ఒక్కదానికే దక్కింది. మెట్రిక్ నేను పారశీక భాషలో చేశాను. కాలేజీలో చేరగానే, అమ్మీజాన్ అరబ్బీబాషను నిర్బంధ సబ్జెక్టుగా ఇప్పించారు. దివ్యఖుర్‌ఆన్‌ను అనువాదయుక్తంగా చదివిఉన్నాను కనుక

కొద్దిపాటి అరబ్బీభాష నాకు ముందే వస్తుండేది. ఫస్ట్ ఇయర్‌లో కోర్సు అవసరాల దృష్ట్యా అబ్బాజాన్‌తో అరబ్బీ నేర్చుకున్నాను. మధ్యాహ్నం పూట అబ్బాజాన్ భోజనం చేసి విశ్రాంతి తీసుకునే సమయంలో కోర్సు పుస్తకాలు తీసుకొని ఆయన వద్ద కూర్చునేదాన్ని. అప్పుడాయన అరబ్బి గ్రామర్, సంబంధిత పాఠాలు చదివించారు. కొన్ని 'గర్ధానులు' (వ్యాకరణ సంబంధమైన పదజాలం) కూడా జ్ఞాపకం చేయించారు. ఇదేవిధంగా ఇస్లామిక్ స్టడీస్‌కు సంబంధించి 'అహ్‌జాబ్ సూర' అనువాద, వ్యాక్యానాల్ని కూడా ఆయన వద్దనే నేర్చుకున్నాను.

మధ్యాహ్నం పూట లేక రాత్రిసమయంలో అబ్బాజాన్ భోజనం కోసం ఇంట్లోకి వచ్చినప్పుడు పెన్నూ, కాగితాలు, స్క్రిప్టులు అలాగే టేబుల్ మీద వదిలివచ్చేవారు. స్కూల్లో చదివే రోజుల్లోనైతే ఆ సమయాల్లో నేను అబ్బాజాన్ గదిలోకి వెళ్ళి ఆయనేం రాస్తున్నారో అని కాగితాల్ని తిరగేసి చదివేదాన్ని. జ్ఞాపకశక్తిమెండుగా ఉండేది. కాబట్టి ఒకటికి రెండుసార్లు చదవగానే ఆ పంక్తులు జ్ఞాపకమైపోయేవి. అయితే నా ఈ చిలిపిచేష్టలపై ఎవరీ దృష్టిపడ లేదు. ఒకరోజు భోజనం చేస్తున్న సమయంలో ఏదో విషయంలో వాదన జరిగింది. సందర్భాన్ని అనుసరించి నేను ఉండబట్టలేక అబ్బాజాన్ రాసిన ఒక్క పారాను అచ్చం ఆయన స్టైల్లోనే వినింపించాను. అంతే! అబ్బాజాన్ నిర్ఘాంతపోయారు. "అరెరె! ఈ విషయం నీకెలా తెలిసింది? ఇది నిన్నటిరాత్రే రాశానే." "అవును నేనూ రోజూ మీ ఆఫీసులోకిదూరి మీ కాగితాలన్నీ చదువు తున్నాను. ప్రస్తుతం మీరేం రాస్తున్నారో నేను చెప్పగలను?" అంటూ సగ ర్వంగా చెప్పుకున్నాను. అబ్బాజాన్ అలాగా! అలాగా! అంటూ అమాయకంగా నావైపు చూస్తుండిపోయారు. పైకి కోపగించుకున్నట్లు కనిపించినా, లోలోన ఆయన సంబరపడుతున్నారనే విషయం నాకు తెలుసు.

ఈ సంఘటన జరిగిన కొన్ని రోజుల తరువాత, దాదిఅమ్మా అబ్బా జాన్‌తో 'అబ్బాయ్! పై అంతస్తులో భూతముంది' అని అన్నారు.

అమ్మీజాన్! మీరు ఏ భూతం గురించి మాట్లాడుతున్నారు. ఇక్కడ తొమ్మిది భూతాలున్నాయని నేనంటున్నాను. ఇందులో ఒక రకం ఇంకా విచిత్ర మైనది, అది నా కాగితాలను కూడా వదిలిపెట్టడం లేదు. నేను లేని సమ యంలో నేను రాసిందంతా చదివి, జ్ఞాపకంచేసి నా స్టైల్‌లోనే నాకు వినిపించటం కూడా జరుగుతున్నది. నా రాతల్ని సైతం కాపీకొట్టే జిన్నాతున్నా యమ్మా! తలకట్టు, సున్నల్లో కూడా పొరపాటు చేయని జిన్నాతులు.

ఇది జరిగిన ఎన్నో సంవత్సరాల తరువాత, వేసవి సెలవుల్లో జిద్దా నుండి పాకిస్తాన్ వచ్చాను. అమ్మీజాన్ తానివ్వవలసిన దర్సెఖుర్‌ఆన్ ఇవ్వ డానికి తనకు బదులు నన్ను పంపారు. లాహోర్‌లో అది నేనిచ్చిన మొట్ట మొదటి దర్సెఖుర్‌ఆన్. అది జరిగిన తరువాత నేను ఇంటికి వచ్చేశాను. చాలాసేపటి తరువాత అక్కడినుండి అమ్మీజాన్‌కు ఒక ఫోన్‌కాల్ వచ్చింది. బేగం సాహిబా! మీ అమ్మాయి దర్సెఖుర్‌ఆన్ చాలా చక్కగా ఇచ్చిందండి. ఈ అమ్మాయి ఆంగ్లంలో ఎంఎ చేసింది, ఇంగ్లీష్ చదివిస్తోంది. ఈమె దర్సెఖుర్‌ఆన్ ఎలా ఇస్తుందబ్బా! అని మేమనుకున్నాము. బేగంసాహబ మాట నిలబెట్టుకో వాలని అమ్మాయిని పంపించి ఉంటారని మేము భావించాము. కాని 'దర్స్' విన్న తరువాత మేము నిర్ఘాంతపోయాము. నిజం చెప్పాలంటే ఖుర్‌ఆన్, హదీసుల జ్ఞానం మీ ఇంటి వారసత్వమే అనాలి!

ఈ మాట అబ్బాజాన్ చెవిలో పడగానే ఆయన పిలిచి, 'నిజం చెప్పు! అక్కడేమైనా అవకతవకలైతే చేయలేదు కదా!' అని అడిగారు.

'లేదు, స్కూలు కాలంలో మీరు రాసిన ఏ పేరాగ్రాఫ్‌లైతే జ్ఞాపకం ఉన్నాయో అదే తిరిగి అప్పగించాను. కొన్ని హదీసులు, అల్లామా ఇక్బాల్‌గారి కొన్ని కావ్య పంక్తులు జ్ఞాపకమున్నాయి. మిగిలిన చోటల్లా మీ పేరాగ్రాఫ్‌లు సహాయపడ్డాయి. ఎక్కడైనా దిగబడిపోతే, వీటినే మననం చేసుకొని ముందుకు సాగుతాను. ఈ పేరాగ్రాఫ్‌లు రాయడంలో కూడా పనికివస్తాయి. దర్స్‌లోనూ ఉపకరిస్తాయి'

నా ధోరణిలో నేను చెప్పుకుంటూపోతున్నాను. అబ్బాజాన్ రెండు చేతుల్లో తలపట్టుకొని ఆశ్చర్యచకితులై నావైపే చూస్తుండిపోయారు. తరువాత నా సోదరి అస్మా ఇలా అంది: 'అబ్బాజాన్‌తో కేవలం నీవు మాత్రమే ఇలా మాట్లాడ గలుగుతావు.

'తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్'ను నేను అది వ్రాయబడుతున్నప్పుడే చదివిన దాన్ని, అందుకని నేడు కూడా అందులోనిభాగాలను చదువుతున్నప్పుడు, దానిరచయిత రాస్తూ, రాస్తూ కలం పక్కన పెట్టి ఇప్పుడిప్పుడే ఎటోవెళ్ళారని, తిరిగి వచ్చి రాయడం ప్రారంభిస్తారని, ఆయనీ లోకంలోనే ఉన్నట్లుగా అనుభూతి పొందుతాను.

అబ్బాజాన్ వ్యక్తిత్వంలోని ఒక సుగుణాన్ని నేనసలే మరిచిపోలేదు. ఎలాంటి అతిశయోక్తి లేకుండా చెబుతున్నాను. ఇతరులు తల్లిదండ్రుల్ని ఎంతగా గౌరవిస్తారో, అబ్బాజాన్ పిల్లల్ని అంతగా గౌరవించేవారు. సామాన్య పరిస్థితుల్లో ఆయన మమ్మల్ని, 'బేటీ' అని పిలుస్తుండేవారు. కాస్త అసంతృప్తి చెందినప్పుడు 'సాహెబ్‌జాదీ' అని పిలిచేవారు. ఇక అత్యధికంగా అసంతృప్తులై ఉంటే 'సాహెబ్‌జాదీ సాహెబా' అంటూ సంబోధించేవారు. పిలుపులోని ఈ సరళే మమ్మల్ని హెచ్చరించేది. సాహెబ్ జాదీ సాహెబా అనే కొరడా పడే పరిస్థితి రాకుండా మేమంతా జాగ్రత్తపడేవాళ్ళం.

# 12. తిట్లు

నా కుమార్తె, 'రాబియా' (జననం 1967, జనవరి21,లాహోర్)ను అబ్బాజాన్ అమితంగా ప్రేమించేవారు. ఇది 1970 నాటి మాట. మేము షాపింగుకని ఆమెతోపాటు 'అనార్కలీ' బజారుకెళ్ళాము. ఎదురుగా 'పీపుల్స్ పార్టీ'వారి జులూస్ (ఊరేగింపు) వస్తోంది. వారు అబ్బాజాన్‌ను తిడుతున్నారు. ఇది చూసినంతనే మేము వెనుదిరిగి ఇంటికొచ్చేశాము. మధ్యాహ్న భోజన సమయంలో అబ్బాజాన్ ఇంట్లోకి వచ్చినప్పుడు నా కుమార్తె ఆయన్ను పరీక్షగా

చూస్తూ ఇలా అడిగింది. 'నానా అబ్బా! మౌలానా మౌదూదీ అంటే మీరే కదా?' అవునమ్మా! నేనే' అబ్బాజాన్ సమాధానమిచ్చారు. 'నానా అబ్బా! అనార్కలీలో నైతే మౌలానా మౌదూదీని తిడుతున్నారు. మనుమరాలి నోట ఈ మాటలు విన్న అబ్బాజాన్ ఎంతో సంబరపడ్డారు. చిరునవ్వుతో ఇలా అడిగారు. 'అలాగా! మీరు విన్నారా బేటీ!'అని. అంతలోనే నేను కలిపించుకొని రాబియాను చివాట్లు పెట్టి మాట్లాడకుండాజేశాను. మీరు కూడా మరీనూ అబ్బాజాన్! అవి తిట్టుగాక, నిధి దొరికినట్లుగా సంతోషపడిపోతున్నారే!' అంటూ అబ్బాజాన్‌ను మృదువుగా అడిగాను. నా మాట విన్నంతనే అబ్బాజాన్ ముఖంలో గాంభీర్యం ఉట్టి పడుతూ, 'బేటీ! దైవమార్గంలో నేనింతవరకు కేవలం తిట్లను మాత్రమే పడ్డాను. దైవప్రవక్తలు, దైవదాసులు రాళ్ళదెబ్బలు కూడా తిన్నారు. ఇవి దైవమార్గంలో లభించిన తిట్లు సుమా! ఇది దైవప్రవక్తల సంప్రదాయం. ప్రతి ఒక్కరికీ లభించే సౌభాగ్యం కాదమ్మా!ఇది' అని పలికారు.

ఒకసారి ఓ పెద్దమనిషి మా ఇంటికొచ్చాడు. ఆయన అబ్బాజాన్‌కు ఒక విదేశీ పెన్నును కానుకగా ఇస్తూ ఇలా అన్నారు 'మౌలానాగారు! ఈ పెన్నును ఒక రష్యన్ జాతీయుడు మీకివ్వమని ఇచ్చాడు. గడిచిన రోజుల్లో నేను తాష్కెంట్ వెళ్ళాను. అక్కడో వ్యక్తి ఏకాంతంలో నన్ను కలిసి తానో ముస్లింనని తెలుపుకున్నాడు. ఆ తరువాత ఈ పెన్నును ఇస్తూ పాకిస్తాన్ వెళ్ళిన తరువాత ఇది మీకివ్వమని కోరాడు.

1968లో జుల్ఫికర్అలీ భుట్టో (మరణం 1979, ఏప్రిల్) విద్యార్థుల్ని కాలేజీల్లో నుండి బయటికి తీసి, వారిచేత రోడ్లపై ప్రదర్శనలు చేయించారు. ఇదేవిధంగా కార్మికుల్ని ఫ్యాక్టరీల నుండి తీసి రోడ్లపై నినాదాలు ఇప్పించారు. దీనిపై అబ్బాజాన్ ఎంతోబాధపడి ఇలా అన్నారు. 'ఒకసారి విద్యార్థుల్ని క్లాసు రూముల్లోనుండి బయటికి తీసి వారితోప్రదర్శనలు చేయించడం, నినాదా లిప్పించడం సులువే. కాని రేపు మీరు ఈ విద్యార్థులు క్లాసు రూముల్లో కూర్చుని బుద్ధిగా చదువుకోవాలనుకుంటే అది అసంభవం. ఈ భూతాన్ని సీసాలోనే ఉండనివ్వాలి. ఒకసారి ఇది బయటికొచ్చిందంటే, తిరిగి లోపలికి

పంపించడం దుర్లభం. అలాగే కార్మికుల్ని ఒకసారి ఫ్యాక్టరీల నుండి బయటికి తెచ్చి వారిచేత నినాదాలిప్పించడం, నిరసన ప్రదర్శనలు చేయించడం కష్టమేమీ కాదు. కాని ఆ తరువాత వారిని తిరిగి ఫ్యాక్టరీల్లోకి వెళ్ళమని, కష్టపడి పనిచేయమని కోరితే అది అసాధ్యమైపోతుంది. దయచేసి జాతి స్వభావంలో అలజడిని, అల్లకల్లోలాల్ని జొప్పించకండి. ఇది విద్యను, పరిశ్రమల్ని నాశనం చేసిగాని విడిచిపెట్టదు. అంటూ అబ్బాజాన్ ఓ విజ్ఞప్తి పత్రాన్ని జారీచేశారు. కాని ఆ కాలంలో అలజడి, అల్లరి, అల్లకల్లోలాల ఏ స్వభావమైతే జాతి మనస్తత్వంలో నాటుకు పోయిందో, అది నేటికీ నలువైపులా కనిపిస్తూనే ఉంది.

అబ్బాజాన్‌ది ఒక బహుముఖమైన వ్యక్తిత్వం. నిస్సారమైనవి, భారమైన పనులుగా వేటినైతే ఇతరులు భావిస్తారో, అలాంటి గంభీరమైన పనులెన్నో చేశారాయన. అయితే వ్యక్తిగత జీవితంలో ఆనందోత్సాహాలు నిండిన వ్యక్తిత్వం ఆయనది. ఈ అన్నికోణాల దృష్ట్యా అబ్బాజాన్ నాకు ఆదర్శ నీయుడు, నా ఐడియల్ ఆయనే.

ఇంట్లో సుఖసంతోషాల్లోను, దుఃఖ విషాద సందర్భాల్లోనూ మేమాయన్ను చూశాము. కాని మూడు సందర్భాల్లో మాత్రం దుఃఖచ్ఛాయలు ఆయన ముఖంపై ప్రస్ఫుటంగా కనబడ్డాయి.

- ఆగస్టు 1947 తరువాత, సర్వస్వం కోల్పోయి, అనాథలుగా మిగిలి పోయిన స్త్రీల విషాధగాథలుప్రత్యక్షంగా విన్నప్పుడు, హింసా దౌర్జన్యా లకు గురయిన పీడిత, బాధిత, నిస్సహాయులైన అమ్మాయిల దీన స్థితిని తన కళ్ళతో చూసినప్పుడు.
- ఈజిప్టుకు చెందిన సయ్యద్ ఖుతుబ్ (రహ్మ)ను, ఈజిప్ట్ అధ్యక్షుడు కర్నల్ నాసర్ (మరణం 1970 సెప్టెంబరు) 1966 ఆగస్టు 25వ తేదీన ఉరి తీసినప్పుడు.
- ఇక మూడవ సందర్భం. 1971 డిసెంబరు నెలలో 'ఢాకా' పతనమై నప్పుడు.

ఈ విషాద సంఘటన ఆయన హృదయాన్ని ఎంతగా కలిచివేసిందంటే, ఇది జరిగిన కొన్ని రోజులకే మొదటిసారి ఆయన గుండెపోటుకు గురయ్యారు. ఆయనిలా అంటుండేవారు. 'ఢాకా' పతనం అనేది కేవలం ఒక దేశ ఓటమి మాత్రమేకాదు, ఒక ఉమ్మత్ పతనం, ఒక సిద్ధాంత పతనం. తూర్పు పాకిస్తాన్ ఎన్నడూ విడిపోయేదికాదు, కాని పశ్చిమ పాకిస్తాన్ అధికారవర్గాలు దాన్ని నెట్టినెట్టి మరీ దూరం చేశాయి.

1974 ఫిబ్రవరి నెలలో, లాహోర్‌లో ఇస్లామిక్ దేశాల శిఖరాగ్ర సమావేశం జరుగుతున్నప్పుడు, సౌదీ అరేబియా పరిపాలకుడు కింగ్‌ఫైసల్ బిన్ అబ్దుల్ అజీజ్ (నిర్యా: 1975 మార్చి 25) అబ్బాజాన్ గురించి ప్రత్యేకంగా వాకబు చేశారు. అందుకని భుట్టోగారు చివరి ఘడియల్లో కాన్ఫరెన్స్‌లో పాల్గొనాల్సిందిగా అబ్బాజాన్‌కు ఆహ్వానం పంపారు. కాన్ఫరెన్స్ ప్రారంభమయింది. కాన్ఫరెన్స్‌లో పాల్గొనటానికి కాన్ఫరెన్స్ హాల్ మెట్లు ఎక్కుతుండగా, ఈ కాన్ఫరెన్స్‌లో షేక్ ముజీబుర్ రహ్మాన్ సమక్షంలో భుట్టోగారు బంగ్లాదేశ్‌ను గుర్తిస్తున్నట్లు ప్రకటించనున్నారని తెలియగానే, అబ్బాజాన్ వెంటనే అక్కడి నుండి వెనుదిరిగారు. పాకిస్తాన్‌ను విడగొట్టడంలో ఒక పావుగా పనిచేసిన షేక్ ముజీబుర్ రహ్మాన్‌తో కలిసి కూర్చుండడం నా వల్ల అయ్యేపని కాదు. నా కళ్ళ ముందు బంగ్లాదేశ్‌ను గుర్తిస్తున్నట్లు లేచే చేతుల దృశ్యాన్ని కూడా నేను భరించలేను' అంటూ ఆయన అక్కడినుండే వెనుదిరిగి వచ్చేశారు.

## 13. పూర్తిఅయిన తఫ్‌హీముల్ ఖుర్ఆన్ రచన

1972 జూన్ 7వ తేదీనాటికల్లా తఫ్‌హీముల్ ఖుర్ఆన్ ఆరవ, చివరి సంపుటం రచన పూర్తయింది. ఈ శుభసందర్భాన్ని పురస్కరించుకొని 1972 జూన్ చివరితేదీల్లో లాహోర్‌లోని 'ఫ్లిటేజ్ హోటల్' కాన్ఫరెన్స్ హాలులో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. ఆ సమావేశంలో ఎ.కె. బరూహీ

(నిర్యా: 1987 సెప్టెంబరు13) ఆ గ్రంథాన్ని పరిచయం చేస్తూ ఇలా ప్రసంగించారు:

మౌలానా మౌదూదీగారి తఫ్‌హీముల్ ఖుర్‌ఆన్, ఆయన రాసిన లిటరేచర్ ద్వారా పాశ్చాత్య వ్యామోహానికి గురైపోయిన లక్షలాది మంది ముస్లిం యువకులు ఇస్లాం ఆత్మను అర్థం చేసుకోగలిగారు. వారి జీవితాల్లో గొప్ప విప్లవం వచ్చింది. మానవునిలో అత్యంత విలువైనవి అతని నడవడికలు, నైతికతలు. ఒక వ్యక్తి నడవడికల్ని, నైతికతల్ని తీర్చిదిద్ది అతని జీవితంలో విప్లవాన్నేగనక తేగలిగితే, ఈ పనిని నిర్వర్తించిన ఆ వ్యక్తి అతని జీవిత నిర్మాతగా పేర్కొనబడతాడు. నైతిక సంస్కర్తగా గుర్తింపబడతాడు. ఈ దృష్టికోణంతో నేడు పాకిస్తాన్‌లో అందరిలోకెల్లా మహోన్నత వ్యక్తి మౌలానా మౌదూదీగారే! పాకిస్తాన్ ప్రజల నీతినడవడికల్ని, ఎంతగానో ప్రభావితం చేసి, తీర్చిదిద్దిన వ్యక్తి ఎవరనే ప్రశ్నేగనక వస్తే, అది మౌలానా మౌదూదీగారు తప్ప ఇంకెవరూ కాదనేది నా సమాధానం. ఒకవేళ ప్రళయదినాన దైవం నా సాక్ష్యాన్నేగనక అడిగినట్లయితే, నేడు చెబుతున్న విషయాన్నే ఆ రోజూ సాక్ష్యం పలుకుతాను...

సమావేశంలో పాల్గొన్న ఇతర వక్తలంతా కూడా అబ్బాజాన్ ధార్మిక సేవల్ని వేనోళ్ళ కొనియాడారు. ఇక అబ్బాజాన్ వంతు వచ్చినప్పుడు అత్యంత వినయ వినమ్రతలతో ఆయనిలా అన్నారు.

ఒక పనిని ప్రపంచమంతా కూడా ప్రశంసించినా అది దైవం వద్ద స్వీకరించబడకపోతే ఆ పనంతా నిష్ప్రయోజనమైనదే. అయితే ప్రపంచం దృష్టిలో దానికి ఏ మాత్రం విలువ లేకపోయినా దైవం దృష్టిలో మాత్రం అది అతి ప్రీతిపాత్రమైతే అదే నిజమైన సాఫల్యం. దైవం ఈ చిరుసేవను స్వీకరించాలని, ఈ గ్రంథం ద్వారా ఏ ఒక్కవ్యక్తి మార్గదర్శనం, సాఫల్యం పొందినా, అది నా ముక్తికి సాధనంగా మార్చాలని నేనూ ఆ దైవాన్ని వేడుకుంటున్నాను, అలా నా కోసం 'దుఆ' చేయండని మిమ్మల్ని కోరుకుంటు న్నాను. ఆయన ఇంకిలా అన్నారు. ఒక దాసుడు అత్యంత వినయ వినమ్రతలతో కొన్ని కాగితాలు తీసుకొని తన ప్రభువు ముందు నిల్చున్నాడు. ఈ వ్యాఖ్యానం, ఈ వివరణ

సత్యం కోసమే. సత్యానికి సాక్ష్యమివ్వడానికి తప్ప ఈ జీవితం ఏ ఇతర పనికీ కేటాయింపబడలేదు. ఇక ఇలాంటి పనికి తన దాసులకు సద్బుద్ధిని ప్రసాదించే దైవం కూడా ఒక్కడే.

ఆత్మపరిశుద్ధత, సత్యసాక్ష్యం మరియు ధర్మసంస్థాపనకై అబ్బాజాన్ బహుముఖమైన పోరాటం సలిపారు. ఇందులో ఆయనకు:

- ఆయనకు పూర్తి వ్యతిరేకంగా పరిపాలనా యంత్రాంగాన్ని ఉపయోగిస్తున్న అధికార వర్గం ఒకవైపుంది.
- రెండవవైపు భూస్వామ్య, పెట్టుబడిదారి వ్యవస్థ తన ధనసంపద, శక్తిసామర్థ్యాలతో ఆయన్ను అణచాలని ప్రయత్నిస్తున్నది.
- మూడవ వైపు కమ్యూనిస్టుల, సోషలిస్టుల అనైతిక దాడుల్ని ప్రపగండాను ఆయన ఎదుర్కొంటున్నారు.
- నాలుగవ వైపు కుహనా ధార్మిక గురువులు, నేతల వ్యతిరేకత ఉంది. అబ్బాజాన్ లేపిన ధార్మిక, నైతిక విప్లవమే గనుక సఫలమైతే తమ ధార్మిక పీఠాలు, గద్దెలు తలకిందులవుతాయోమోనని వారి భయం.
- ఐదవ పక్షంగా ఖాదియానీలు నిలబడిఉన్నారు. వీరు అత్యంత నీచమైన, తుచ్ఛమైన నిందారోపణలతో ముందుకొచ్చారు.
- ఆరవ పక్క ఇస్లాంను అపకీర్తి, అవమానాల పాల్జేయాలని దుష్ట పన్నాగంతో ఇస్లాంను వక్రరీతిలో అధ్యయనం చేసినపాశ్చాత్య విద్వాంసులు, వారి అనుచరులైన హదీసు వ్యతిరేకుల వర్గమూ ఉంది. వీరు ఇస్లాంకు, ఖుర్ఆన్‌కు, దైవప్రవక్త(స)కు వ్యతిరేకంగా ఏ చిన్న అవకాశం దొరికినా జారవిడుచుకోదలుచుకోలేదు.

ఈవిధంగా ఈ పోరాటం బహుముఖమైపోయింది. బలహీనమైన ఆరోగ్యంతోనూ, తరచూ వ్యాధి దాడిని ఎదుర్కొంటూనే ఆయన ఎంత గొప్ప కార్యం చేశారు! ఎన్నో సంస్థలు, అనేక పార్టీలు కలిసికట్టుగా చేయవలసిన పనిని ఆయన ఏకాకిగా చేసి చూపారు.

ఆయన ఏకకాలంలో శ్రేష్టమైన ధార్మికవేత్త, రీసెర్చ్ స్కాలర్, ఖుర్ఆన్ వ్యాఖ్యాత, వేదాంతి, చరిత్రకారుడు, ధార్మిక ప్రచారకుడు, ఉపన్యాసకుడు, జ్ఞాని, పత్రికా విలేకరి, రచయిత- వీటన్నింటితోపాటుగా పరిపక్వమైన రాజకీయవేత్త కూడా.

1977 మార్చినెల 7వ తేదీన జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో పీపుల్స్‌పార్టీ అవినీతికి, అక్రమానికి పాల్పడింది. దీనికి వ్యతిరేకంగా, 'పాకిస్తాన్ నేషనల్ అలయన్స్‌లో చేరిన రాజకీయ పార్టీలన్నీ భుట్టో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆ ప్రభుత్వాన్ని దించివేయాలని దేశవ్యాప్తంగా తీవ్ర ఆందోళనను లేవదీశాయి. ఏప్రిల్ 12వ తేదీన అబ్బాజాన్ వివాదాస్పద ఈ ఎన్నికల్ని రద్దుచేసి, తిరిగి ఎన్నికలు జరుపటానికి ఒప్పుకోండని భుట్టోగారికి ఒక ప్రతిపాదన చేశారు. కాని ఆయన తన అధికార గర్వంలో నా గద్దెను కదిపేవాడెవడు?' అనుకొని ప్రజలపై లాఠీలు, బుల్లెట్ల వర్షం కురిపించసాగారు. దీంతో పరిస్థితి ఇంకా తీవ్ర రూపం దాల్చింది. చివరికి ఏప్రిల్ మధ్యభాగంలో అబ్బాజాన్‌ను కలువడానికి ఆయన 'అఛ్రా'లోని మా ఇంటికొచ్చారు. ఆయన్ను చూసిన ప్రజలు పెద్ద సంఖ్యలో గుమిగూడి, ఆయనకు వ్యతిరేకంగా నినాదాలు చేయసాగారు. అబ్బాజాన్ బయటికొచ్చారు. "భుట్టోగారు నా అతిథి. ఆయన గౌరవమర్యాదలు, నా గౌరవ మర్యాదల్లాంటివి. దయచేసి ఈ నినాదాలు ఆపేయండి." అని వారికి విజ్ఞప్తిచేశారు. అబ్బాజాన్‌తో కలిసిన సందర్భంలో భుట్టో, మీపై నాకు సంపూర్ణ విశ్వాసముంది, తెల్లకాగితంపై సంతకం చేసి మీకివ్వడానికి సిద్ధంగా ఉన్నాను. మీరు ఏ షరతులు విధించినా నాకు అంగీకారమే. అని అనడం జరిగింది.

దానికి అబ్బాజాన్ ఇలా అన్నారు. 'మీరు రాజీనామా రాసివ్వండి. మీరు ఎంతదూరం పోయారంటే, మీ రాజీనామా కన్నా తక్కువైనదేదీ జాతిని శాంత పరచజాలదు. ఆ తరువాత స్పష్టంగా జరిగే ఎన్నికల్లో మీరు విజయం సాధించి అధికారంలోకి రండి. ప్రస్తుత పరిస్థితుల్లో ఇంతకుమించిన పరిష్కారం వేరొకటి లేదు.

45 నిమిషాలు జరిగిన సుదీర్ఘ సమావేశంలో భుట్టోగారే అత్యధికంగా మాట్లాడారు. ఒకసారి అఫ్ఘానిస్తాన్ పరిస్థితులిలా ఉన్నాయని, ఇండియాలో ఇలా జరుగుతున్నదని, బెలుచిస్తాన్‌లో అసంతృప్తి రాజుకుంటుందని, ఇరాన్ పరిస్థితులు చెడిపోవచ్చని, ఇలాంటి పరిస్థితుల్లో జాతికి తన అవసరం ఎంతో ఉందని చెప్పుకొచ్చారు. ఇవన్నీ చెప్పిన తరువాత తిరిగి ఆయనే అడిగాడు. ఈ పరిస్థితుల్లో నేనేం చేయాలో మీరే చెప్పండి?' అని.

అవన్నీ విన్న తరువాత అబ్బాజాన్ ఇలా అన్నారు. 'మీరు వివరించిన పరిస్థితుల దృష్ట్యా కూడా మీరు రాజీనామా చేయడమే సమంజసం. ఆ తరువాత నిష్పక్షపాతంగాను, స్వచ్ఛందంగానూ ఎన్నికలు జరుపండి. ఒకవేళ మీరు గెలిస్తే అధికారంలోకి రండి. ఈ విధంగానే మీ ప్రభుత్వానికి నైతిక బలం చేకూరుతుంది. అందులోనే దేశం, జాతి ప్రయోజనాలున్నాయి. దీనిద్వారానే మీరు శక్తిపుంజుకుంటారు. మీరింతకు ముందు వివరించిన అంతర్గత, బాహ్య ప్రమాదాల్ని ఎదుర్కొనే పద్ధతి కూడా ఇదే. కాని భుట్టోగారు ఈ విషయం వైపుకు మొగ్గుజూపడమే లేదు.

ఆ తరువాత ఆయన జాతికోసం తాను చేసిన సేవల్ని ఏకరువు పెట్ట సాగారు. దానిపై అబ్బాజాన్ ఇలా అన్నారు. మీరుచేసిన సేవల్ని నిరాకరించడం లేదు. కాని జరిగిన తప్పుకు, మీ పాత సేవల ప్రస్తావన ఉపశమనం కాజాలదు. జాతి ఇంకేదో పెద్ద విపత్తుకు గురికావడం నాకు ఇష్టంలేదు. నేడు రోడ్లమీద తిరుగుతూ మీ రాజీనామాను కోరుతున్న ప్రజలు,రేపు అంతకుమించిన డిమాండు చేసే ప్రమాదం కనబడుతున్నది నాకు. ఈ ఉద్యమం, అరాచకత్వం ఇంకా పెరిగిపోతే దురదృష్టవశాత్తుగా మార్షల్ లా విధించే ప్రమాదాన్ని కూడా విస్మరించలేము. ఇక మార్షల్ లా యే స్వయంగా ఒక పెద్ద ఉపద్రవానికి నాంది కాగలదు.

ఈ సమావేశం జరిగిన కొన్ని గంటల తరువాతనే అబ్బాజాన్ ఒక ప్రెస్ కాన్ఫరెన్స్‌ను ఏర్పాటు చేసి, సమావేశంలో జరిగిన చర్చల వివరాలను వెల్లడించారు. అయితే ఓవారం రోజులు గడిచాయో లేదో భుట్టోగారు,

లాహోర్, కరాచి, హైదరాబాద్ (సింద్)లలో మార్షల్ లా విధిస్తూ, తానే సైన్యానికి త్రోవను సుగమం చేశారు.

పెద్ద వారితో రవ్వంత కూడా ప్రభావితం కాకపోవడం అబ్బాజాన్‌లోని ఒక ప్రత్యేక గుణం. అంతేకాకుండా మాకు ఈవిధంగా హితోపదేశం చేస్తుండేవారు. 'మనిషిని ఒక మనిషిగా మాత్రమే చూడాలి. అతని దుస్తులు, అతని వాహనం, అతని ఇంటినిచూసి గొప్పవాడని, అల్పుడని నిర్ధారించ కూడదు. ఇక ఈ పెద్దపెద్ద అందమైన బంగళాలు కనబడుతున్నాయో, అవి వట్టి మృత గృహాలు, ఒక గొప్పింట్లో ఉంటున్న వ్యక్తి నైతికతలు కూడా గొప్పగా ఉంటాయనుకోవడం శుద్ధ పొరపాటు.

ఒకసారి సౌదీ అరేబియా అధినేత కింగ్ ఫైసల్ బిన్ అబ్దుల్ అజీజ్, అబ్బాజాన్‌కు ఒక ప్రతిపాదన చేశారు. మీరు నాకు సలహాదారుగా ఉండండి. ఇంకా సౌదీ జాతీయతను కూడా స్వీకరించండి'అని. దానికి అబ్బాజాన్ ఇలా సమాధానమిచ్చారు. 'ధార్మికాభిమానంతో, పాకిస్తాన్ జాతీయతను కలిగి, నేనిక్కడ లాహోర్‌లో ఉంటూనే ఎల్లవేళలా మీకు సలహాదారుగా ఉన్నాను. మీరు కోరుకున్నప్పుడల్లా మీ రాయబారి ద్వారాగాని, లేదా డైరెక్టుగా గాని నాతో సంప్రదించవచ్చు. న్యాయమన్పించినదాన్ని నిర్మోహమాటంగా తెలియ జేస్తాను. కాని మీ పాలితునిగా మారి, మీ ఉద్యోగాన్ని స్వీకరిస్తే బహుశ సరియైన సలహా ఇవ్వలేనేమో!

ఇదేవిధంగా 1974లో జోర్డాన్ రాజు అయిన కింగ్ హుస్సేన్ బిన్ తిలాల్ (నిర్యాణం 2000) అబ్బాజాన్‌కు ఫోన్‌చేశారు. కింగ్ హుస్సేన్ మీతో ఏ విషయంలో మాట్లాడారు అని మేమడిగినప్పుడు ఆయన పెద్దగా పట్టిం చుకోకుండా అత్యధికంగా ప్రాధాన్యత ఇవ్వదగిన మనుషులు కారు వీరు. చెవులకింపైన మాటలైతే మాట్లాడుతారు గాని, అది వారి ప్రయోజనాలకు అడ్డు తగలనంతవరకే. ఇక ఎప్పుడైనా వీరికి లేదా వీరి సంతాన ప్రయోజ నాలకు ఏ కాస్త విఘాతం కలిగే సూచనలు కనబడ్డా, వీరు సబ్బు నురుగులా

క్షణాల్లో కుప్పకూలిపోతారు. కాస్సేపాగి ఆయన ఇంకిలా అన్నారు. అల్లాహ్ ధర్మానికి విశ్వాసపాత్రులై, దానికోసం ఏ త్యాగానికైనా సిద్ధపడేవారే అసలైన విలువగల మనుషులు. మీ సమక్షంలో మిమ్మల్ని విమర్శించి మీ వెనకాల మిమ్మల్ని సమర్థించే వ్యక్తులే గౌరవించటానికి అర్హులు.

నేను 'రియాద్' (సౌదీ అరేబియా)లోని మహిళా కళాశాలలో బోధిస్తున్నప్పుడు, సౌదీ అరేబియాకు చెందిన ఒక మహిళా లెక్చరర్ నన్నీవిధంగా తూలనాడింది. 'నేను సౌదీ జాతీయతను కలిగిన దాన్ని. సౌదీయేతరులు (విదేశీయులు) నా ముందు నిలువలేరు. స్టాఫ్ మీటింగ్‌లోనే ఆవిడగారి సమాచారార్థం నేనిలా తెలిపాను.

సలహాదారు హోదాతోపాటుగా సౌదీ జాతీయతను కూడా మీ కింగ్ ఫైసల్ మా నాన్నగారికి ప్రసాదిస్తామన్నారు. కాని మా నాన్నగారు దాన్ని స్వీకరించలేదు. ప్రజలు వేటికోసమైతే పరుగెత్తుతారోఅలాంటి హోదాలు మా నాన్నగారి పాదాల వద్ద పడిఉంటాయి. కాని ఆయన వాటిని ఎన్నడూ స్వీకరించలేదు.

హోదాలు, అధికారాలవైపు ఏమాత్రం మొగ్గుచూపని వ్యక్తి కుమార్తెను నేను అని ఆ సౌదీ మహిళకు స్పష్టం చేయడానికే అలా చెప్పాల్సి వచ్చింది. ఈ వాదోపవాదాలు జరిగినప్పుడు కింగ్ ఫైసల్ ఇంకా బ్రతికే ఉన్నారనే విషయాన్ని మరువరాదు.

ఈజిప్ట్‌కు చెందిన ధార్మిక ఉద్యమం ఇఖ్వానుల్ ముస్లిమూన్‌కు ద్వితీయ అధ్యక్షుడైన షేక్ హసన్ అల్ హుజేబి (నిర్యాం 1973)గారి కుమార్తె ఆ కాలంలో వృక్షశాస్త్ర విభాగానికి అధిపతిగా పనిచేస్తుండేవారు. స్టాఫ్ మీటింగ్ అయిపోయిన తరువాత ఆమెగారు ప్రత్యేకంగా నావద్దకు వచ్చి ఇలా అన్నారు. 'నిజంగానే నీవు ఎంతో మహోన్నతమైన తండ్రి పుత్రికవు' ఆమెగారు హజ్రత్ అలీ(రజి)నుడివిన ఒక సూక్తిని వినిపించారు. ప్రపంచ వాస్తవికత ఏమిటి? నీవు దీన్ని కాలితో తన్ని వదిలేసినా అది తిరిగి నీ కాళ్ళమీద వచ్చిపడుతుంది'

ఈ సంఘటన జరిగిన తరువాత సౌదీ అరేబియాలో ఉన్నంత కాలం, నన్ను 'సౌదీయేతర వనిత' అని దెప్పిపొడిచే సాహసం ఎవరూ చేయలేకపోయారు.

స్వర్గీయ కింగ్ ఫైసల్ గారికి అబ్బాజాన్ ఇంకొక అమోఘమైన సలహా ఇచ్చారు. అదేకనుక కార్యరూపం దాల్చిఉంటే, నేడు ఇస్లామీయ ప్రపంచ పరిస్థితులే భిన్నంగా ఉండేవేమో అనిపిస్తోంది నాకు.

అబ్బాజాన్ ఫైసల్ రాజుగారితో ముఖాముఖిగా మాట్లాడుతున్న సందర్భంలో ఇలా అన్నారు.

"ఏ విధంగానైతే అమెరికా 'డాలర్' బలంతో ప్రపంచమంతటిలోని మహోన్నత మేథావుల్ని అమెరికా రప్పించుకోగలిగిందో, కేవలం ఐదువందల సంవత్సరాల క్రితమే కనుగొనబడిన దేశాన్ని, సాటిలేని అభ్యున్నత శిఖరాలకు చేర్చగలిగిందో, అలాగే మీరు కూడా మీవద్దనున్న 'రియాల్' సహాయంతో- వాటికి మీవద్ద కొదువలేదు, విస్తీర్ణానికీ మీ దేశంలో కొరతలేదు- ముస్లిం ప్రపంచంలోని మహోన్నత మేథావుల్ని ఆకర్షించుకొని, మీ దేశంలో రప్పించుకోవచ్చు. బహుముఖ ప్రజ్ఞాశాలురైన ఇలాంటి డాక్టర్లు, ఇంజనీర్లకు, సైంటిస్టులకు సామాజిక సాంఘిక శాస్త్రాల్లో మేథావులైనవారిని, ఉన్నతశ్రేణికి చెందిన పరిశోధకుల్ని ప్రోగుచేసి వారికి సౌదీ పౌరసత్వంతోపాటే మౌలిక హక్కుల్ని కూడా ప్రసాదించండి. ఇక చూడండి! సామాజికంగా, విద్యాపరంగా, పారిశ్రామికంగా, ఆర్థికంగా రక్షణ విషయాల్లోనూ, సైన్స్, టెక్నాలజీ రంగాల్లోను సౌదీ అరేబియా ఎంతగా ప్రగతి సాధిస్తుందో అభివృద్ధి పురోగమనాల్లో అదెంత ముందంజలో ఉంటుందో మీరే చూస్తారు. ఇంకా ఈ పురోగమనం కేవలం ఒక్క సౌదీ అరేబియా పురోగమనమే కాకుండా మొత్తం ఇస్లామీయ ప్రపంచ పురోగమనంగా పరిగణింపబడుతుంది.

"ఇదంతా విన్న తరువాత కింగ్ ఫైసల్ బిన్ అబ్దుల్ అజీజ్ ఇలా సమాధానమిచ్చారు. రియాల్ శక్తితో ఇస్లామీయ ప్రపంచంలోని బుద్ధిజీవుల్ని, మహోన్నత మేథస్సుల్ని సౌదీయాకు రప్పించుకోగలను, వారికి పౌరసత్వంతో

పాటు మౌలిక హక్కుల్ని కూడా ఇవ్వగలను. కాని అలా జరిగితే మొరటు వాళ్ళయిన నా అరబ్బు దేశీయులు తమ మేకల్ని తోలుకొని, ఒంటెలపై ఎక్కి తిరిగి గుడారాల్లోకి వెళ్ళిపోతారు. ఆ తరువాత వారు ఎడారుల్లో ఆచూకీ లేకుండా మాయమై పోతారు."

విచారకరమైన విషయం ఏమిటంటే, కింగ్ ఫైసల్ తరువాత కూడా గల్ఫ్ ఏలికలు దూరదృష్టిని ప్రదర్శించలేకపోయారు. ఫలితంగా చమురు, రియాల్ రూపంలో లభించిన ఈ అపార సంపదను పెద్దపెద్ద ఖరీదైన కార్లు, ఏసీలు విలాసవంతమైన కట్టడాలు, ఆకాశ హర్మ్యాల నిర్మాణంలో దుర్వినియోగం చేశో లేదా పాశ్చాత్య బ్యాంకుల్లో పెట్టో దానితో ఎలా లాభపడాలో అలా లాభపడలేకపోయారు. నేడు పరిస్థితి ఏమిటంటే రక్షణ బాధ్యతను అమెరికా చేపడితే, ఆర్థిక వ్యవహారాలు పాశ్చాత్య నిపుణుల చేతుల్లో ఉన్నాయి.

అబ్బాజాన్ ఒక విషయం తరుచుగా చెబుతుండేవారు. 'దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ 'తోరా' గ్రంథ భవిష్యవాణిని పేర్కొన్నాడు. దానిప్రకారం, మహాప్రవక్త(స) అనుచరుల్లో ఉండే ఆ ప్రత్యేక గుణాన్ని ఈ ఉమ్మత్ తమలో పెంపొందించుకో నంతవరకు ఈ ధర్మం ఆధిక్యతను సాధించలేదు. అదేమిటంటే,

"ముహమ్మద్ అల్లాహ్ ప్రవక్త, ఆయన వెంట ఉన్నవారు అవిశ్వాసుల పట్ల కఠినులుగానూ, పరస్పరం కరుణామయులుగానూ ఉంటారు. నీవు వారిని చూసినప్పుడు వారు రుకూ, సజ్దాలలో అల్లాహ్ అనుగ్రహాన్ని ఆయన ప్రసన్నతనూ అర్థించటంలో నిమగ్నులై ఉండటం కనిపిస్తుంది. సజ్దా గురుతులు వారి నొసటన కానవస్తాయి. వాటివల్ల వారు ప్రత్యేకంగా గుర్తించబడతారు.' (అల్ ఫతేహ్- 29)

ప్రస్తుతమున్న ముస్లిం దేశాల పాలకుల్లో దాదాపు అందరూ అవిశ్వాసుల్ని చూడగానే ఆనందభరితులవుతారు, వారి వెనకాముందు తచ్చాడుతారు. కాని ఎప్పుడైతే వీరు ముస్లింలను కలుసుకునే అవవసరం ఏర్పడుతుందో ముఖం చిట్లించుకుంటారు. కళ్ళు నెత్తిపైకెక్కి కూర్చుంటాయి.

అబ్బాజాన్ ఒకచోట ఇలా వ్రాశారు : అల్లాహ్ మెచ్చిన ధార్మిక జీవన విధానం, గాలివాటాన్ని సైతం మార్చే దృఢ సంకల్పం గల వీరకిషోరాల కోసం అవతరించింది. అల్లాహ్ కోరిన స్వభావాన్ని అన్నిస్వభావాలకన్నా, అన్ని రంగుల కన్నా మిన్నగా ఎంచుతారు. ఈ రంగులోనే ప్రపంచాన్నంతటిని ముంచెత్తేసే ధైర్యం కలిగి ఉంటారు. ముస్లిం అనేవాడు నీటి ప్రవాహంలో కొట్టుకు పోవడానికి పుట్టించబడలేదు. అతని విశ్వాస నమ్మకాల ప్రకారం, సరియైన దిశలో జీవిత ప్రవాహాన్ని మళ్ళించటమే అతని జన్మలక్ష్యం. సన్మార్గం! తిన్నని మార్గం!! వంకలు, డొంకలు లేని రుజుమార్గం!!!

ఒకసారి లాహోర్ వచ్చినప్పుడు అబ్బాజాన్‌తో ఇలా మొరపెట్టుకున్నాను. 'సౌదీ అరేబియాలో ఇంగ్లీషు సిలబస్ మరీ హీనదైన, నిష్ప్రయోజనమైనది గానూ ఉంది. ఈజిప్షియన్, పాకిస్తాన్ అధ్యాపకులు ఇంకా ఉప్పూ మసాలాలు కలిపి దాన్ని మరింత ఖూనీజేసేశారు. దానిపై అబ్బాజాన్ ఒక అధ్యాపకుని బాధ్యత, ప్రత్యేకించి ఒక ధార్మిక ఉద్యమంతో సంబంధమున్న అధ్యాపకుని బాధ్యతలకు సంబంధించి నాకు హితోపదేశం చేస్తూ ఇలా అన్నారు.

"పాఠ్యపుస్తకాల్లో ఉండే సిలబస్ ఒకటైతే, అధ్యాపకుని మస్తిష్కంలో ఉండే సెలబస్ మరొకటి. అధ్యాపకుని మస్తిష్కంలో నున్న సిలబసే అత్యంత ప్రాముఖ్యమైనది. తన ధర్మంలో లీనమైపోయిన అధ్యాపకుడు గీత ద్వారా కూడా ఖుర్‌ఆన్ పాఠాలు చెప్పగలుగుతాడు. కాస్సేపాగి ఇంకిలా అన్నారు. గత్యంతరం లేని అనివార్య పరిస్థితుల్లో లభించిన అత్యంత చెడ్డ సిలబస్ సైతం ఒకవేళ సక్రమమైన పద్ధతిలో బోధిస్తే అది విద్యార్థుల సంస్కారానికి ఉపకరిస్తుంది.

# 14. ఒక స్వప్నం - దాని అంతర్భావం

1978 వేసవి సెలవుల్లో జిద్దా నుండి నేను పాకిస్తాన్ వచ్చినప్పుడు ఒక సంఘటన జరిగింది. మగ్రిబ్ నమాజ్ తరువాత పాకిస్తాన్ ఎయిర్‌ఫోర్స్‌కు

చెందిన ఇద్దరు స్క్వాడ్రన్ లీడర్లు 'సర్గోధా' నుండి అబ్బాజాన్‌ను కలువడాని కని వచ్చారు. అబ్బాజాన్ తమ కార్యాలయంలో కూర్చుని పనిచేసుకుంటు న్నారు. వారిని అక్కడికే పిలిపించుకున్నారు. వారిలో ఒకాయన మరీ కలత చెందినవానిలా కనబడుతున్నాడు. ఆయనే ఇలా ప్రారంభించాడు. 'మౌలానా గారు! నేనొక కలగన్నాను. ఆ స్వప్నం చూసినప్పటి నుండి ఎంత వ్యాకులంతో ఉన్నానంటే నాకు నిదుర కూడా పట్టడంలేదు. ఆకలి వేయడమూలేదు. అంతేకాదు ఏ పనైనా తృప్తిగా, నిండు మనస్సుతో చేయలేకపోతున్నాను. నేను చూసిన స్వప్నమేమిటంటే, నేను మదీనా నగరం వెళ్ళాను. మదీనా నగర మంతా బాంబింగ్ వల్ల పూర్తిగా ధ్వంసమైపోయింది. మస్జిదె నబవీ లేదు, గుంబదె ఖిజ్రా (పచ్చటి గోపురమూ) లేదు. ఏ ఒక్క ఇల్లుగాని, కట్టడంగాని తన స్థానంలో నిలబడి లేదు. అంతా ధ్వంసమైపోయింది. ప్రవక్త మహనీ యుల(స) సమాధి ఉన్న స్థలానికి వచ్చి చూడగా, దైవప్రవక్త మహనీ యులు(స), అప్పుడే పూడ్చిన ఓ మట్టిసమాధి వద్ద నిలబడి నమాజ్ సలుపు తున్నారు. దగ్గరి నుండే ఎంతోమంది మాట్లాడుకుంటున్న శబ్దాలు వినబడు తున్నాయి. ప్రక్కకు చూస్తే భూగర్భంలోకి (నేల మాలియలోకి) వెళుతున్న మెట్లు కనబడ్డాయి. వెంటనే ఆ మెట్ల ద్వారా నేను అందులోకి దిగాను. సగం మెట్లు దిగానో లేదో, కేవలం డ్రాయర్లు (చెడ్డీలు) మాత్రమే తొడిగి శరీరమంతా నగ్నంగా ఉన్న ఆరేడుగురు యూదులపై నా దృష్టిపడింది. వారు తమ చేతుల్లో పొడువాటి కత్తులు పట్టుకొని మానవ కళేబరాల్ని ముక్కలు ముక్కలుగా నరుకుతూ గుట్టగా వేస్తున్నారు. ఇంకా గోడలకు (మదీనా నగరవాసుల) అసంఖ్యాకమైన మానవ కళేబరాలు వ్రేలాడు తున్నాయి. నేనా దృశ్యాన్ని చూసి, వీరు నన్ను కూడా నరికి పారేస్తారేమోననే భయంతో వెనుదిరిగి పైకి పరుగెత్తు కొచ్చాను. పైకి వచ్చిచూస్తుంటే ప్రవక్త మహనీయులు(స) అత్తిహియ్యాత్ చదివి సలాంతో నమాజ్ ముగిస్తున్నారు. నమాజ్ ముగించిన తరువాత ఆయన(స) నా వైపుకు చూస్తూ "భయపడకు ఈ మాంసం అమ్ముడుపోదు" అని చెప్పారు. అంతే! వెంటనే నాకు మెలుకువ వచ్చేసింది. ఇంతే! మౌలానా, ఈ కలగన్న

రోజునుండి ప్రతిదినం నా చింతా వ్యాకులతలు పెరుగుతూనే పోతున్నాయి. మీరే చెప్పండి మౌలానా! ఈ కలకు అర్థం ఏమై ఉంటుంది.

నిజానికి అబ్బాజాన్‌కు కలల ప్రపంచానికి ఎలాంటి సంబంధం లేదు. అంతేకాక వాటి అర్థం, తాత్పర్యాల పట్ల కూడా ఆయనకు అభిరుచి లేదు. ఆయన వాస్తవ ప్రపంచాన్ని, తార్కికమైన, హేతుబద్ధమైన సూత్రాలను, విశ్వాస పరిధిలోకి తెచ్చి జీవించాలనే సిద్ధాంతానికి ప్రచారకుడు. అయినప్పటికీ ఈ స్వప్నాన్ని విని అబ్బాజాన్ కూడా నిర్ఘాంతపోయారు. ఇలాంటి స్వప్నాన్ని కనే భాగ్యం గొప్ప గొప్ప వలీలకు (దైవ మిత్రులకు) కూడా లభించదే! గడ్డం, మీసాలు గీసుకున్న యువకుడైన ఈ పైలట్‌కు వచ్చిందేమిటి? గొప్ప గొప్ప ఖాన్‌ఖాహ్ (మఠాల)లలో ఉంటున్న మఠాధిపతులకు, ఉద్దండుడైనా ఏ ధార్మికవేత్తకూ, ధార్మిక శాస్త్రాల్లో ఆరితేరిన ఏ విద్వాంసునికీ కనిపించని ఈ స్వప్నం, నీలాకాశంలో విహరించే ఈ ముజాహిద్ చూశాడే! అంటే భవిష్యత్తులో ఖాన్‌ఖాహ్‌లలో, మఠాలలో నివసిస్తున్న గురువులకు బదులు, ప్రాణార్పణ కోసం సదా సర్వసన్నద్ధంగా ఉండే ఇలాంటి యువకులే ఇకపై మిల్లతె బైజా (ముస్లిం ఉమ్మ)కు నాయకత్వం వహిస్తారన్నమాట! ఇంకా ఇలాంటివారే హరమైన్ షరీఫైన్ (మక్కా, మదీనాలోని దివ్యక్షేత్రాల)ల రక్షణ బాధ్యతల్ని స్వీకరిస్తారన్న మాట! అని అనుకున్నారు.

అబ్బాజాన్ నవయువకులైన ఆ పైలెట్లను సంబోధిస్తూ ఇలా అన్నారు. 'మహాప్రవక్త(స) గారి ప్రవచనాన్ని హజ్రత్ అబూహురైరా (రజి)ఇలా ఉల్లేఖించారు. 'యుద్ధాలపై యుద్ధాలు జరుగుతున్నప్పుడు అరబ్బేతర జాతుల నుండి అల్లాహ్ ఒక జాతిని లేపుతాడు. వీరు వీరత్వంలో అరబ్బులకు మించి, ఆయుధాల్లో వారికన్నా ఆధిక్యతలో ఉంటారు. వీరి ద్వారా దైవం తన ధర్మానికి సహాయం తీసుకుంటాడు. (మిష్కాత్)

ఆయన ఇంకిలా అన్నారు. 'మీ స్వప్నం, హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఉల్లేఖనం వైపుకు కూడా దృష్టిని మళ్ళిస్తోంది. ఆయనిలా అన్నారు.

'(చివరి కాలంలో) పక్షుల్లాగా వేగంగావెళ్ళే మృగాల్లాంటి క్రూరత్వం కలిగిన మనుషులు వస్తారు. 'నేడు దీనికి మనకు తెలిసే అర్థం ఏమిటంటే యుద్ధ విమానాల్లో తమ దేశాల (స్థావరాల) నుండి బయలుదేరి, అత్యంత క్రౌర్యంగా తమ వ్యతిరేకుల పిల్లల్ని, స్త్రీలను, వృద్ధుల్ని ఇంకా సర్వసృష్టితాల్ని నాశనం చేసి వెళ్ళిపోతారు. వీరి ద్వారా ఎవరి ధన, మాన, ప్రాణాలు కూడా సురక్షితంగా ఉండజాలవు. మూడవ హదీసులో ప్రవక్త మహనీయులు(స) హజ్రత్ అబూజర్ గిఫ్ఫారి(రజి)ను సంబోధిస్తూ ఇలా అన్నారు. మదీనాలో విపరీతమైన కరువు, ఆకలి ఏర్పడినప్పుడు, నీవు మంచం మీదనుండి లేచి మస్జిద్ వరకు కూడా వెళ్ళలేనప్పుడు, ఈ ఆకలి నిన్ను కష్టంలో పడేస్తుంది. ఇంకా ఓ అబూజర్! మదీనాలో ఎంత రక్తపాతం జరుగుతుందంటే అహ్‌జారుజ్జైత్ (నున్నటి కుండ) ఆ రక్తంలో మునిగిపోయినప్పుడు నీ పరిస్థితి ఎలా ఉంటుందో.

ఇదేవిధంగా దజ్జాల్ హదీసును వినిపిస్తూ ఆయనిలా అన్నారు: 'మున్ముందు సంభవించబోయే శిలువ నెలవంక యుద్ధాల్లో ఏర్‌ఫోర్స్ నిర్ణ యాత్మక పాత్ర పోషిస్తుందనే విషయానికి కూడా మీ స్వప్నంలో సూచన లున్నాయి. అందుకోసమే దైవం ఇలాంటి స్వప్నాన్ని ఒక యుద్ధపైలట్‌కు చూపించాడు. మీ విమాన కాక్‌పిట్‌లో అజాన్ ఇచ్చే సమయం ఆసన్నమైంది. మీ విధి మిమ్మల్ని పిలుస్తోంది. ముస్లిం ఉమ్మత్, హరమైన్ షరీఫైన్‌ల రక్షణ బాధ్యత ఒక మీపైనే ఉంది. ఇంకొక హదీసును అనుసరించి హజ్రత్ ఈసా(అలై) (ఏసుక్రీస్తు) అవతరించిన తరువాత, అరబ్బేతర ప్రాంతాలనుండే సైన్యాలు ఆయన సహాయానికి వెళతాయి. వారు అస్త్రశస్త్రాల్లోను, వీరత్వం లోనూ అరబ్బులకన్నా శ్రేష్టులై ఉంటారు. ఒక విషయం జ్ఞాపకముంచుకోండి! మీ మొదటి, మౌలిక విశ్వాస విధేయతలు దైవం, దైవప్రవక్త(స)పట్లే ఉండాలి. ఆ తరువాత హరమైన్ పట్ల, ఆ తరువాత మీ మాతృదేశం పట్ల, ఈ విధేయ తల్ని ఈ విశ్వాసపాత్రతలను మీరు ఏక కాలంలో నెరవేర్చటానికి దైవంతోనూ, ఖుర్‌ఆన్‌తోనూ మీ సంబంధాన్ని సుదృఢపరుచుకోండి. ఇంకా దైవంతోనే సహా యాన్ని అర్థిస్తూ ఉండండి.

స్వప్నానికి సంబంధించిన ఈ తాత్పర్యం విన్న తరువాత ఆ పైలట్లు ఊరట చెందారు. ఇక సెలవు తీసుకొని వెళ్ళటానికి లేచినప్పుడు, అనారోగ్యం వలన అత్యంత బలహీనంగా ఉన్నప్పటికీ అబ్బాజాన్ లేచి నిలబడి వారితో కరచాలనం చేశారు. వారిస్తున్నా వినకుండా వారిని సాగనంపటానికి ద్వారం వరకు వచ్చి ఇలా అన్నారు. మీరు స్వప్నంలో ప్రవక్త మహనీయుల్ని(స) చూశారు. కాబట్టి మీరు కూడా గౌరవార్హులే. మీరుపడిన కలతను, వ్యాకులతను నాకిచ్చిపోతున్నారు. నేనీస్థితిలో ఎప్పటివరకుంటానో, నాకే తెలియదు.

ఆరోజు రాత్రి భోజనానికి అబ్బాజాన్ లోపలికి వచ్చినప్పుడు ఆయన ముఖంమీద ఆందోళనాఛాయలు కనబడసాగాయి. ఈ స్వప్నం, దానికి ఆయన చెప్పిన తాత్పర్యం విని, మేము కూడా తీవ్ర భయాందోళనలకు గురయ్యారు. నా మస్తిష్కంలో అల్లామ ఇక్బాల్ కవితా పంక్తులు మెదిలాయి. దాని భావం మీరూ వినండి.

'ఓప్రభూ! నీవు నిరపేక్షాపరుడవు. ఎవరి అక్కరలేనివాడవు. అయినా కూడా నీ ప్రేమికులు తమ రక్తాన్ని ధారపోసి నీ ఏకత్వపు సాక్ష్యం ఇవ్వాలని కోరుతున్నావు. దాస్యత స్థానం వేరు, ప్రేమ స్థానం వేరు. దాస్యత దృష్ట్యా దైవ దూతలు అందరికన్నా ముందున్నారు. ఓ పరాత్పరా! నీ దివ్య సృష్టితాలతో నైతే కేవలం సజ్దా కోరుతున్నావు. కాని ఈ మట్టితో సృజించిన మానవునితో అంతకు మించి కోరుతున్నావు.

'మసీహుద్దజ్జాల్' బయల్పడే సమయం, హజ్రత్ ఈసా(అలై) (ఏసుక్రీస్తు) అవతరించే తరుణం ఆసన్నమైందని అంతరాత్మ ఘోషిస్తోంది. ఒక ప్రసంగంలో దైవప్రవక్త ఇలా ఉపదేశించినట్లు ఉంది: దైవం, ప్రపంచాన్ని, ఆదం సంతానాన్ని సృష్టించినప్పటి నుండి దజ్జాల్ పీడను మించిన పీడన ఈ భుమిపై సంభవించి ఉండలేదు... అతను సిరియా, ఇరాక్‌ల మధ్య ప్రాంతం నుండి బయలు దేరుతాడు. అతి శీఘ్రంగా నడుస్తూ నలువైపులా కల్లోలాన్ని లేపుతాడు. కుడి ఎడమ అన్ని పక్కల నుండి వస్తాడు. అందుకని 'ఓ ప్రజలారా!

దృఢనిశ్చయంతో ఉండండి. ఇంకా వినండి! అతని ఉపద్రవాల్లోని ఓ ఉప ద్రవం స్వర్గం నరకం అతని వెంట ఉండడం. నిజానికి అతని నరకం స్వర్గమూ, స్వర్గం నరకమూను అయిఉంటాయి. మీలో ఎవరికైనా ఇలాంటి పరిస్థితి ఎదురై దజ్జాల్ అతను తన నరకంలో మిమ్మల్ని పడేయదలిస్తే, దైవసన్నిధిలో మొరపెట్టుకొని 'కహఫ్ సూరా'లోని మొదటి పది ఆయత్‌లు చదవాలి. ఆ నరకాగ్ని హజ్రత్ ఇబ్రాహీం(అలై)కు శాంతిని, చల్లదనాన్ని ప్రసాదించినట్లే, అతనిపట్ల కూడా అలాగే మారిపోతుంది. '(మిష్కాత్- వాల్యూం-2, పేజీ 73)

అబ్బాజాన్ చెప్పిన మాటల్ని మననం చేసుకుంటూ నా జ్ఞాపకాలను నెమరువేసుకున్నప్పుడు ఆ స్వప్నంలో ఉద్దేశింపబడిన భావార్థం ఇంకా స్పష్టమై నా కళ్ళ ముందు మెదలసాగింది. నేడు మనం ఏ పరిస్థితులనైతే ఎదుర్కొంటున్నామో, ఈ స్వప్నం స్వయంగానే తన భావాన్ని బయల్పరు స్తుంది. కాబూల్, కాందహార్‌ల విధ్వంసం, బగ్దాద్ బస్రాల వినాశనం, పాలస్తీనా మొదలుగాగల ప్రాంతాల్లో జరుగుతున్న రక్తపాతం, 'గ్వాంటనామోబె', అబూగరీబ్ జైల్లలో జరుగుతున్న అమానుషాలు, చెచెన్యా బోస్నియా ముస్లింలపై జరుగుతున్న ఘోరమైన హింసాదౌర్జన్యాలను చూసిన తరువాత కూడా అనుమాన సందేహాలకు ఆస్కారమేముంటుంది... ప్రవక్త మహనీయుల(స) అనుచరగణంపై జరుగుతున్న ఈ ఘోర హింసాదౌర్జన్యాల కథనం ఒక వైపైతే, వేరొక వైపు ఆశను రేపే శుభవార్త, కార్యోన్ముఖులవడానికి ప్రేరణ... నిజంగా మనకు గుణపాఠం గరిపేదిగా ఉంది.

ఇస్లాం ఘనతను, గౌరవోన్నతులను ఇనుమడింపజేయడంలో అరబ్బేతర ప్రాంతాలనుండి లభించే శక్తి బలాల గురించి అబ్బాజాన్ ఆ పైలెట్లకు ఏదైతే సూచన ఇచ్చారో, అది ఈజిప్ట్‌కు చెందిన ప్రఖ్యాత దినపత్రిక 'అల్ అహ్‌రాం'లో ప్రచురింపబడిన, ఈజిప్ట్ మాజీ చీఫ్ ఆఫ్ ఆర్మీస్టాఫ్ జనరల్ అల్ ముషీర్ అబూగజాల వాంగ్మూలం ద్వారా ధృవపడుతుంది. ఆయనిలా అన్నారు.

'అరబ్బుల సంరక్షణకు పాకిస్తాన్ సైనికదళాలు బాధ్యత తీసు కుంటాయి. వాటి పట్టు ఇస్రాయీల్ వరకుంది. అందుకని ఆర్థిక సంక్షోభం నుండి పాకిస్తాన్ బయటపడడానికి అరబ్బులు దానికి తగిన సహాయం అందించాలి. పాకిస్తాన్ సఫలత సర్వ అరబ్బు ప్రపంచం విజయంగా గుర్తిం చాలి.

ఆ తరువాత, అరబ్బు దేశాల్లో ప్రఖ్యాతిగాంచిన 'అల్ ఇత్తెహాద్' అనే పత్రికలో ఒక విశ్లేషణాత్మక వ్యాసంలో జనరల్ అల్ ముషీర్ అబూ గజాల ఇలా రాశారు. ''పాకిస్తాన్ ఒక గొప్ప సైనికశక్తి, దానివద్ద అటామిక్ వార్ హెడ్స్ ఉన్నాయి. అందుకని పాకిస్తాన్‌కు ఏదైనా నష్టం వాటిల్లితే దాని ప్రత్యక్ష ప్రభావం అరబ్బు దేశాల పరిస్థితిపై పడుతుంది." జనరల్ అబూగజాల వెలిబుచ్చిన పై అభిప్రాయాల ద్వారా కూడా పైనుదహరించిన స్వప్నం తాత్పర్యం ఇంకా ప్రస్ఫుటమై మనముందుకొస్తుంది.

# 15. అబ్బాజాన్ చివరి వ్యాధి

పదేపదే జైలుకు వెళ్ళడం మూలంగా అబ్బాజాన్ ఆరోగ్యం బాగా దెబ్బ తింది. అందుకని దర్సెఖుర్‌ఆన్‌కు సంబంధించిన కార్యకలాపాల్ని అమ్మీజాన్ బాగా తగ్గించుకున్నారు. ఆమె గడిచిన 25సంవత్సరాల నుండి మాడల్ టౌన్ లేడీస్ క్లబ్‌లో క్రమం తప్పకుండా దర్సెఖుర్‌ఆన్ ఇస్తూ వచ్చారు. అక్కడ శిష్యుల ఒక టీంను తయారుచేసుకున్నారామె. చివరికి దర్సెఖుర్‌ఆన్ కార్యక్రమాల్ని తన శిష్యురాండ్లకు అప్పగించి రాత్రింబవళ్ళు అబ్బాజాన్ సేవల్లోనే గడపసాగారు. అక్కడే ఓసారి దర్సెఖుర్‌ఆన్ సమావేశంలో ఒకావిడ అమ్మీజాన్‌ను ఇలా అడి గింది. మీరెన్ని సబ్జెక్టుల్లో ఎం.ఎ చేశారూ?'అని.

ఎం.ఏలు, బి.ఎలైతే మీరు చేశారమ్మా! నేనైతే ఢిల్లీలోని క్వీన్‌మేరీ స్కూల్‌లో మిడిల్‌క్లాసు వరకే చదివాను.

అలాగేత్తై మీలో ఇంతటి విద్యాజ్ఞానాలు ఎలా వచ్చాయి?' తిరిగి ప్రశ్నించారామె.

ఈ ప్రశ్నకు అమ్మీజాన్ ఒక చారిత్రాత్మకమైన సమాధానమిచ్చారు.

'రాత్రంతా మేల్కొని గొప్పగొప్ప గ్రంథాలు చదివితే ఏ జ్ఞానమైతే వస్తుందో, కేవలం ఒక్క గంటసేపు మాట్లాడితే అంత జ్ఞానం వచ్చే ఒక ధార్మికవేత్తతో నేను జీవితం గడిపానమ్మా!'

ఒకసారి కొందరు మహిళలు అమ్మీజాన్ వద్దకు వచ్చారు. మాటల సందర్భంలో వారు, మన జాతిలో జ్ఞానులు, నాయకులు, ఉన్నత వ్యక్తుల కరువు ఏర్పడిందని విశ్లేషించుకుంటున్నారు. వారు చెప్పదలుచుకున్నంత చెప్పుకునేవరకు అమ్మీజాన్ మౌనంగా వింటూ పోయారు. ఆ తరువాత ఇలా చెప్పుకొచ్చారు : జాతిలో ఏర్పడిన ఇలాంటి ఉన్నత వ్యక్తుల కరువుకు జాతి స్వయంగా తానే బాధ్యత వహించాల్సి ఉంటుంది. కాకపోతే ఇతర జాతులకు బహుఅరుదుగా లభించేటటువంటి లీడర్లు, నాయకులు ఈ జాతికి ఎందరో లభించారు. ప్రపంచముస్లింలంతా కూడా ఎవరినైతే తమ నాయకునిగా, గురువుగా అంగీకరిస్తారో, అలాంటి అల్లామ ఇక్బాల్(రహ్మ) వీరికి నాయకులుగా లభించలేదా? మౌలానా మౌదూదీ(రహ్మ) రూపంలో ఈ జాతికి మరొక మార్గదర్శకుడు లభించాడే! ఆయన సైద్ధాంతిక ప్రపంచంలో ఒక విప్లవాన్నే లేవదీశారు. ఆధునిక కాలానికి సంబంధించిన మౌలిక సమస్యలన్నింటిపై ఉదాహరణకు కలత, కల్లోలాలు, హింసా, దౌర్జన్యాలు, స్త్రీ పురుషుల విశృంఖల కలయిక, వడ్డీ, పాశ్చాత్య ప్రజాస్వామ్యం, కుటుంబ నియంత్రణ, ఈ సమస్యల వల్ల ఉత్పన్నమైన తీవ్ర సంక్షోభం- ఇలాంటి సర్వరోగాల్ని నిశితంగా పరీక్షించి, రోగ నిర్ధారణ చేసి ఖుర్ఆన్ మరియు ప్రవక్త మహనీయుల(స) సంప్రదాయాలను అనుసరించి సరైన, అమోఘమైన చికిత్సను ప్రతిపాదించారు. ఆయన చేసిన ఈ ఘనకార్యం అమోఘమైనదీ, సాటిలేనిది. కాని జాతి ఆయన సేవల్ని గుర్తించి గౌరవించలేకపోయింది."

అబ్బాజాన్ వ్యాధి పెరుగుతూనే పోతుంది. అప్పుడాయన మాతో ఇలా అన్నారు. 'నా శరీరాన్ని నేను అత్యధికంగా హింసించాను. నా ఈ ఎముకలపై నేను ఏమాత్రం కనికరం చూపలేదు. నా కళ్ళకు నిదురలాంటి ప్రకృతి సహజమైన అవసరం నుండి దూరం చేశాను. అవి నిదురపోదలిచేవి. కాని నేను రాయదలిచేవాణ్ణి. పగలంతా నా సామూహిక బాధ్యతలు నన్ను రాయడానికి అనుమతించేవికావు. ఇక మిగిలింది రా త్రి సమయం ఒక్కటే! అప్పుడే నేను నిశ్చింతగా కూర్చుండి రాయగలిగేవాణ్ణి. రాత్రి భోజనాలు, ఇషా నమాజ్ ముగించుకున్న తరువాత కూర్చుంటే ఫజర్ అజాన్ అయ్యేంతవరకు లేవని సందర్భాలు ఎన్నో ఉన్నాయి. నేనొకవేళ అలా చేయకపోతే ఈ తఫ్హీముల్ ఖుర్ఆన్ ఎలా పూర్తయ్యేది? అంతే! ఇప్పుడీ కళ్ళు నాతో పగతీర్చు కుంటున్నాయి. నేనిప్పుడు నిదురపోవాలనుకుంటున్నాను. కాని అవి మూత పడడానికి ససేమిరా ఒప్పుకోవడంలేదు. వాటిని నేను మేల్కొని ఉండే అలవాటు ఎంతగా చేశానంటే అవిప్పుడు నిదురించటానికి సిద్ధపడడంలేదు. నా మస్తిష్కం ఆలోచించడం మానేసి నేను ప్రశాంతంగా నిదురపోవాలని ఎంతగా ప్రయత్నించినా, అది ఆలోచించడం మానడం లేదు. దానికలా అలవాటు చేశాను నేను! నా ఎముకలు ప్రతీకారం తీర్చుకుంటున్నాయి. అప్పుడు నేను వాటికి విరామం ఇవ్వలేదు. ఇప్పుడవన్నీ నన్ను విశ్రాంతి తీసుకో నివ్వడం లేదు.

నొప్పులు తగ్గించే మందుల వాడకం వల్ల అబ్బాజాన్ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. ఒకరోజు మాటల సందర్భంలో అమ్మీజాన్ ఇలా అన్నారు. వాతావరణం మార్పుల వల్ల బహుశ మీ ఆరోగ్యం కుదుటపడుతుందేమో! అందుకని మిమ్మల్ని అమెరికా తీసుకెళ్ళమని అమ్మన్ (అహ్మద్ ఫారూఖ్)కు కబురంపుతాను. అక్కడ శ్రద్ధగా ట్రీట్‌మెంట్ తీసుకోవచ్చు.

దినదినం అబ్బాజాన్ వ్యాధి తీవ్రరూపం దాల్చసాగింది. చివరికి మా సోదరుడు డాక్టర్ అహ్మద్ ఫారూఖ్ వచ్చి పట్టుబట్టి అబ్బాజాన్‌ను ఒప్పించి అమ్మీజాన్‌తో సహా అమెరికా తీసుకెళ్ళారు. అమెరికాలో నెలరోజులున్న తరువాత ట్రీట్‌మెంట్‌లో కొంచెం మార్పులు చేసిన పిదప ఆయన బాగా

కోలుకున్నారు. ఆరోగ్యం కొంచెం కుదుటపడిన తరువాత ఆయన పూర్తి ఏకాగ్రతతో మహాప్రవక్త (స) జీవిత చరిత్ర (సీరతె సర్వరె ఆలం) వ్రాయడానికి ఉపక్రమించారు.

దీనితోపాటే అమెరికా, కెనడాలో ఉంటున్న దగ్గరి దూరప్రాంతాల నుండి అభిమానులు ఒక ప్రవాహంలాగా రాసాగారు. అబ్బాజాన్ రాసిన లిటరేచర్‌ను చదివి ఇస్లాం స్వీకరించిన నవముస్లింలు గొప్పసంఖ్యలో వచ్చి కలిశారు. ప్రఖ్యాత 'నవల' The Roots రచయిత 'అలక్స్ హేలె' (Alex Haley) ఎంతో దూర ప్రాంతంనుండి వ్యయ ప్రయాసలకోర్చి అబ్బాజాన్‌ను కలువడానికని వచ్చారు. తనగ్రంథాన్ని, తన ఆటోగ్రాఫ్‌తో సహా అబ్బాజాన్‌కు సమర్పించారు. కలిసేవారిలో తెల్లవారూ, నల్లవారూ అందరూ ఉండేవారు. ముస్లిం దేశాలకు చెందినవారు అత్యధిక సంఖ్యలో వచ్చి కలిశారు. మేము నామమాత్రంగానే ముస్లింలై ఉండేవాళ్ళం. మీ లిటరేచర్ చదివిన తరువాతనే నిజమైన అర్థంలో ముస్లింలయ్యాము' అంటూ చెప్పుకొచ్చారు.

మహాప్రవక్త(స) జీవితచరిత్ర (సీరతె సర్వరె ఆలం)ను పూర్తి చేయ గలనని అబ్బాజాన్‌కు పూర్తి విశ్వాసం ఉండేది. కాని 1979 సెప్టెంబరు8న ఆయనకు తీవ్రమైన గుండెపోటు వచ్చింది. ఇంకా ఆరోగ్యం పూర్తిగా కోలుకోక ముందే సెప్టెంబరు 21న పరిస్థితి తిరిగి చెడిపోయి ప్రమాదకర స్థాయికి చేరు కుంది. కాలేయం, మూత్రపిండాలు అకస్మాత్తుగా పనిచేయడం మానేశాయి. చివరికి ఎవరికీ తప్పని ఆ ఘడియరానే వచ్చింది. 1979 సెప్టెంబరు 22వ తేదీన 'బఫెల్లో' ఆసుపత్రిలో పాకిస్తాన్ సమయాన్ని అనుసరించి సాయంత్రం 5.45 నిమిషాలకు అబ్బాజాన్ తన ఆత్మను, పరమాత్మకు అప్పగించుకున్నారు. ఇన్నాలిల్లాహి వ ఇన్నాఇలైహి రాజివూన్. యా అయ్యుతు హన్ నఫ్సుల్ ముత్మ ఇన్నహ ఇర్జియీ ఇలా రబ్బికి రాజియతం- మర్జియ్యహ్ ఫద్‌ఖులీ ఫీ ఇబాదీ వద్‌ఖులీ జన్నతి. (అల్‌ఫజ్ర్ 27-30)

'మేమంతా అల్లాహ్‌కే చెందినవారం, అల్లాహ్ వైపునకే మరలి పోవలసిన వారము (అల్‌బఖర- 153) తృప్తిచెందిన మనసా! పద నీ

ప్రభువు సన్నిధికి. (నీకు లభించే సత్ఫలానికి) ఆనందిస్తూ, నీ ప్రభువుకు ఇష్టమైనదానివై చేరిపో (పుణ్యాత్ములైన) నా దాసులలో, ప్రవేశించు నా స్వర్గంలో. (అల్ ఫజ్ర్- 27-30)

ఈ విషాదకరమైన ఈ వార్తను మోసుకొని ఇంటికొచ్చిన అహ్మద్ ఫారూఖ్ పరిస్థితి అత్యంత దయనీయంగా ఉంది. దుఃఖం, బాధతో ఆయన సొమ్మసిల్లి పడిపోయారు. అమ్మీజాన్ అత్యంత ధైర్యస్థైర్యాలను కూడగట్టుకొని రాత్రంతా నిదుర మాని నీరసంగా పడిపోయిన కుమారునికి ధైర్యం చెప్పి బిస్కట్లు తిని పించి టీ త్రాగించి తన దుఃఖాన్ని దిగమింగుకొని కుమారునికి ఇలా ధైర్యం చెప్పారు.

బేటా! దైవానికి కృతజ్ఞతలు తెలుపుకో! నీ తండ్రిని నీవు చూడగలిగావు. ఆయన నీడలో పెరిగి ఇంతపెద్ద వాడయ్యావు. ఆయనైతే 1953లోనే ఉరి కంబం ఎక్కడానికి సంసిద్ధులయ్యారు. ఆ రోజే గనుక ఆయన్ను ఉరితీసి ఉంటే నీ తండ్రిగారు ఎలా ఉండేవారు, ఆయన ఎలా మాట్లాడుతుండే వారనేది కూడా నీకు జ్ఞాపకం ఉండకపోయేది!

అల్లాహుఅక్బర్! ఎంత ధైర్యం!! దైవంపై ఎంతటి అచంచల విశ్వాసం!!!

ఆ తరువాత అమ్మీజాన్ అందరినీ ఓదారుస్తూ సహనం వహించాలని, హితోపదేశం చేస్తూ ఇలా అన్నారు. 'ఇన్నాలిల్లాహి చదవండి, మాట్లాడకండి!' ఇది చూసి అక్కడ పోగైన స్త్రీ పురుషులందరూ నిర్ఘాంతపోయారు.

మా మామయ్య డాక్టర్ జలాల్ షమ్సి టోరంటో (కెనడా) నుండి స్వయంగా కారు నడుపుకుంటూ అమ్మీజాన్‌ను చేరేసరికి, అమితమైన బాధతో సొమ్మసిల్లిపోయారు. అమ్మీజాన్‌ను చూసి ఆయన నిర్ఘాంతపోయారు. 'ఆపా జాన్! నేను టోరంటో (కెనడా) నుండి బఫెల్లో (అమెరికా) వరకు ఏడుస్తూ వచ్చాను. మిమ్మల్ని ఎలా ఎదుర్కోగలను? మిమ్మల్ని ఎలా ఓదార్చగలను? అనే ఆలోచన రాగానే కంపించిపోయాను. కాని మిమ్మల్ని చూసినంతనే నా అశ్రువులే ఇంకిపోయాయి. ఇంతటి ధైర్యం మీకెక్కడి నుండి వచ్చింది? భాయి

సాహెబ్ (బావగారు) జైలుకు వెళ్ళినప్పుడు చిన్న చిన్న పిల్లల్ని తీసుకొని అప్పుడు కూడా మీరెంత ప్రశాంతంగా ఉండేవారు? నిజం చెప్పండి. మీలో ఈ శక్తి, ఈ బలం ఎక్కడినుండి వస్తుంది? మీరు ఇదంతా ఎలా భరించగలుగుతారు?'

దానికి అమ్మీజాన్ ఇలా సమాధానమిచ్చారు. "దైవం ఉనికిపై పరిపూర్ణ విశ్వాసం, దైవాన్నే నమ్ముకోవడం, ఓర్పు, సహనం- ఈ గుణాల ద్వారానే ఒక మనిషి కఠినాతికఠినమైన పరిస్థితుల్లో నుండి క్షేమంగా బయటపడ గలుగుతాడు.

మా సోదరుడు అహ్మద్ ఫారూఖ్ విమానాన్ని చార్టర్డ్ చేయించుకొని శవాన్ని న్యూయార్క్ చేర్పించాడు. ఇంతలోనే అమెరికాలోని వివిధ టీవి ఛానెళ్ళు అబ్బాజాన్ మరణవార్తను ప్రసారం చేశాయి. ఇది విని అమెరికాలో ఉంటున్న వివిధ దేశాల ముస్లింలు జనాజా నమాజ్‌లో పాల్గొనటానికి పెద్ద సంఖ్యలో న్యూయార్క్ ఎయిర్‌పోర్ట్‌లో గుమిగూడారు. అహ్మద్ ఫారూఖ్ అమ్మీజాన్‌ను ప్యాసింజర్ లాంజ్‌లో కూర్చోబెట్టారు. ఇంతలోనే పాకిస్తాన్, ఇండియా, టర్కీ అరబ్బు, ఆఫ్రికన్ దేశాలకు చెందిన స్త్రీలు ఆ లాంజ్‌లోకి వచ్చారు. వారితో పాటుగా వచ్చిన పురుషులు బయట జనాజా నమాజ్ కోసం నిరీక్షిస్తున్నారు. అమ్మీజాన్‌కు సమీపంలోనే కూర్చున్న కొందరు పాకిస్తానీ స్త్రీలు పరస్పరం మాట్లాడుకోసాగారు. 'బఫెల్లో నుండి బాడీ (మృతదేహం) ఇంకా రావాల్సి ఉంది. ఎప్పుడొస్తుందో ఏమో తెలియదు!అని.

'మృతదేహం వచ్చేసింది!' అమ్మీజాన్ ముక్తసరిగా సమాధానమిచ్చారు.

వారంతా ఉలిక్కిపడి అమ్మీజాన్ వైపుకు చూస్తూ 'శవం వచ్చిందని మీకెలా తెలుసు? అనడిగారు.

'శవంతోపాటు నేనూ వచ్చాను' అమ్మీజాన్ ప్రశాంతంగా సమాధానమిచ్చారు.

'శవంతో మీకేదైనా సంబంధముందా?

'ఆయనగారు నా భర్త!' ఇది విని స్త్రీలంతా అవాక్కైపోయారు.

'క్షమించండి బేగం సాహెబా! మేము మిమ్మల్ని గుర్తుపట్టలేక పోయాము. ఇంత పెద్ద విషాదాన్ని, దుఃఖాన్ని గుండెలో దాచుకొని మీరు ఎంత ప్రశాంతంగా, ఎంత ఓర్పుతో ఉన్నారు. మేమూ, మా పురుషులు త్రోవంతా కన్నీరు కారుస్తూ వచ్చాము. కాని మిమ్మల్ని చూసినంతనే దైవమే జ్ఞాపకం వచ్చేశాడు.

ఆ తరువాత అక్కడున్న టర్కీ, ఇండోనేషియన్, అరబ్బు, ఆఫ్రికన్ దేశాల స్త్రీలకు కూడా ఈమెగారే మౌలానా మౌదూదీ గారి సతీమణి అని తెలిసి పోయింది. వారంతా కూడా అమ్మీజాన్‌ను పరామర్శించారు. ఇక్కడ లోపల ప్యాసింజర్ లాంజ్‌లో ఈ సంభాషణ జరుగుతూ ఉంటే, బయట జనాజా నమాజ్ జరుగుతోంది. స్థలాభావం కారణంగా న్యూయార్క్ ఎయిర్ పోర్ట్‌లో ఆరు పర్యాయాలు జనాజా నమాజ్ చేయాల్సి వచ్చింది.

విమానం లండన్ చేరుకున్నప్పుడు, అక్కడ యూరోప్‌లోని దాదాపు అందరూ ముస్లిం ప్రతినిధులు హాజరయ్యారు. అక్కడ కూడా అనేకసార్లు జనాజా నమాజ్ సలుపాల్సి వచ్చింది. క్లుప్తంగా చెప్పవచ్చేదేమంటే అబ్బాజాన్ మూడు ఖండాల ప్రజల్ని మేల్కొలుపుతూ, రీవి, దర్పాలతో తన అంతిమ విశ్రాంతి గృహానికి చేరుకున్నారు. ఆయన చేసిందంతా ఇతరుల కొరకే. తనకోసం, తన సంతాన భవిష్యత్తు కోసం ఆయన కించెత్తు కూడా ఆలోచించనే లేదు.

భౌతికకాయాన్ని తీసుకొని లాహోర్ చేరిన రోజు అమ్మీజాన్ పిల్లలంద రినీ ఓదార్చుతూ ఓర్పు, సహనం వహించాలని హితబోధ చేస్తూ ఇలా అన్నారు:

'ఆయన కోసం రోధించకండి, శరీరం ఆత్మకు ఆచ్ఛాదనం (దుస్తుల) లాంటిది. మట్టితో చేయబడిన ఈ శరీరం మాసిన దుస్తుల్లాంటిది. ఒకప్పుడు ఈ ఉడుపు కొత్తగా ఉండేది, అందగాఉండేది, చూపరులకు కనువిందు

గావించేది. అయితే ఆ తరువాత ఇది పాతబడిపోయింది. పాలిపోయింది. ఎన్నో చోట్ల అతుకులు వేయాల్సి వచ్చింది. చివరికది ధరించలేని స్థితికి వచ్చేసింది. అందుకని ఆత్మ దాన్ని విడిచేసింది. ఇప్పుడు ఆత్మ దైవప్రసాదితమైన మహో జ్వల ఉడుపుల్ని ధరించింది. ఇకిప్పుడు మీ అబ్బాజాన్ పూర్తిగా స్వస్థ లయ్యారు. ఆయన అత్యంత సౌఖ్యంతో ఉన్నారు. తన సేవలకు పరిపూర్ణ గుర్తింపునిచ్చే నిజ ప్రభువు వద్దకు చేరుకున్నారు. శవపేటికలో ఉంచబడి అమెరికా నుండి వచ్చిన ఈ శరీరాన్ని మీరు చూస్తున్నారుగా! ఇది ఆ ఆత్మయొక్క మాసిన దుస్తులు మాత్రమే. మాసిపోయి, చిరిగిపోయిన దుస్తుల కోసం కూడా ఎవరైనా ఏడుస్తారా?'

ఈవిధంగా తనదైన శైలిలో ఆమె పిల్లలందరినీ ఓదార్చారు. వారందరినీ ఓర్పు, సహనం వహించాలని హితబోధ చేశారు. ఆ మాటల్లో, ఆ ఓదార్పులో ఏ మహాత్మముందోగాని అది వినగానే మా అందరి అశ్రువులు కళ్ళలోనే ఇంకిపోయాయి. ఆమె అత్యంత ధైర్యంతో ఈ దుఃఖాన్ని అధిగమించారు. కాని కొన్నిరోజుల తరువాత ఉదాసీనతకు లోనైపోయారు.

ఆ రోజుల్లో నేను జిద్దాలోని సౌదీకాలేజీ 'కుల్లియతుల్ బనాత్' (బాలికల కాలేజీ)లో ఆంగ్లభాషా, సాహిత్యాన్ని బోధిస్తుండేదాన్ని. వేసవి సెలవుల్లో లాహోర్ వచ్చాను. అమ్మీజాన్ పరిస్థితి చూసి పట్టుబట్టి నాతో పాటుగా జిద్దా తీసుకెళ్ళాను. మొదట్లో నాతో రావడానికి అసలామె ఇష్టపడనే లేదు.

'కూతురింటికి ఎలా వెళ్ళగలను?' అంటూ అభ్యంతరం తెలిపారు. కాని ఆమెకు బాగా నచ్చజెప్పాను. "మమ్మల్ని మీరు కొడుకుల్లాగే పెంచిపోషిం చారు. కొడుకుల్లాగే చదివించారు. ఇకిప్పుడు నేను కొడుకుల్లాగే సంపాది స్తున్నాను. అందుకని నన్ను కూతురుగా కాకుండా కుమారునిగా చూడండి. మీ ఈ ఉదాసీనతకు చికిత్స మందుల్లో లేదు. మక్కా, మదీనాలలో వీచే గాలులే మీకు ఉపశమనాన్ని కలిగిస్తాయి." ఇలా నచ్చజెప్పిన తరువాత నాతో రావ డానికి అంగీకరించారామె. అక్కడికి చేరుకున్న తరువాత రాకపోకల్లో ఎలాంటి

ఆటంకం ఉండకూడదని ఆమె 'అఖామ' (Residencial Permit) చేయించు కున్నాను. మొదటి 'ఉమ్రా'నే చేసివచ్చిన తరువాత ఇక ఈ మందులు తనకవసరం లేవని వాటన్నింటిని తీసి అల్మరాలో పెట్టేశారు.

రంజాన్ మాసంలో అనేక 'ఉమ్రా'లు నెరవేర్చారు. రంజాన్ చివరి దశకంలో (చివరి పదిరోజులు) ఆమెను తీసుకొని మేము మదీనా వెళ్ళాము. పాకిస్తాన్ హౌజ్‌లో దిగాము. ఆ కాలంలో అది 'మస్జిదె నబవీ'లోని 'బాబున్నిసా' స్త్రీలకోసం ప్రత్యేకించిన ద్వారానికి ఎదురుగా ఉండేది. మొదటి వరుసలో స్థానం సంపాదించాలని అమ్మీజాన్ పట్టుబట్టేవారు. అందుకని మేము తొందర పడి శీఘ్రంగా వెళ్ళి మొదటి వరుసలో కూర్చుండేవాళ్ళం. ఈ తొందరలో అనేకసార్లు అమ్మీజాన్ 'సహ్రీ' సమయంలో తీసుకోవలసిన ఉబ్బసం మందో, బ్లడ్‌ప్రెషర్ మందో, గుండెదడ మందో ఏదో ఒకటి మరిచిపోయేవారు. అది జ్ఞాపకం వచ్చేసరికి సహ్రీ సమయం దాటిపోయేది.

ఒకరోజు అమ్మీజాన్‌తో ఇలా విన్నవించుకున్నాను. "మందులన్నీ, ప్రత్యేకించి గుండె జబ్బుకు సంబంధించిన మందుల్ని తీసుకోవడం మీరు అసలే మరువకూడదు. ఎప్పుడైనా మస్జిదె నబవీ ద్వారం వరకు వెళ్ళిలోపలికి వెళ్ళలేని పరిస్థితి ఏర్పడకూడదు." ఈ మాటలకు ఆమె నావైపు చూస్తూ దుః ఖస్వరంతో ఇలా అన్నారు. "వొజో బేచ్‌తేథే దవాయె దిల్- వో దుకాన్ అప్నీ బఢాగయె." (గుండెకోసం ఎవరైతే మందు అమ్మేవారో, వారు తమ దుకాణాన్ని ఎత్తివేశారు.)

దేనికోసమనో, నేను క్షణం అక్కడి నుండి జరిగి, తిరిగి వచ్చి చూసే సరికి నా కుమారుడు అత్‌హర్ (జననం 1971 నవంబర్ 16, లాహోర్) అమ్మీ జాన్‌తో ఇలా అడుగుతున్నాడు. "నానాఅబ్బా పుస్తకాలు రాసేవారని అమ్మీ అంటుంది. మీరేమో ఆయన గుండె మందు అమ్మేవారని చెబు తున్నారు." అమ్మీజాన్ అత్యంత ప్రేమతో తన మనవనికి ఇలా వివరిస్తున్నారు. 'ఆయన ఏదైతే రాసేవారో, అందులోనే గుండెకు మందుండేది.

ఇక రంజాన్ నెల 29వ రాత్రి వచ్చింది. ఇది ఖుర్ఆన్ పారాయణం ముగించే చివరిరాత్రి. మదీనా నగరమంతా కూడా ప్రత్యేకించి మస్జిదె నబవీలో ఇసుకవేస్తే రాలనంత జనం. అందుకని మేము కూడా ఇషా నమాజుకంటే ఎంతోముందుగా మస్జిద్‌వెళ్ళి, మొదటి వరుసలో స్థానం సంపాదించు కున్నాము. 'ఇఖామత్'కంటే కొంచెం ముందుగా, అకస్మాత్తుగా మస్జిద్ పర్యవేక్షకులైన ఇద్దరు స్త్రీలు ఒక ఆడ పోలీసుతో వచ్చి అత్యంత కఠినస్వరంతో గట్టిగా ఇలా ఆదేశించసాగారు. 'వెనుకకు తప్పుకోండి, వెనుకకు తప్పుకోండి' మేము వెనుదిరిగి చూస్తే పరిస్థితి వర్ణనాతీతం. నేల కూడా కనిపించనంత జనం కిక్కిరిసిఉన్నారు.

నేను ఉండబట్టలేక అంతే ఉచ్ఛస్వరంతో అదే కఠినశైలిలో మేమెందుకు వెనకకు జరగాలి? అంటూ అరబ్బీలోనే ప్రశ్నించాను. వారు నన్ను సౌదీ మహిళగా భావించి 'బహ్రైన్ నుండి ప్రత్యేక అతిథులొచ్చారు' అంటూ సమాధానమిచ్చారు. నేనూ అదే కఠినశైలిలో బిగ్గరగా వారినుద్దేశిస్తూ ఇలా అన్నాను. మేమంతా ప్రత్యేక అతిథులమే. ఇది ప్రవక్త మహనీయుల(స) మస్జిద్. మేమంతా దైవప్రవక్త(స) అతిథులం. ఇది మస్జిదె నబవీ వారి మహలేంకాదు.

నా నోటినుండి ఈ వాక్యాలు వెలువడగానే, నమాజ్ కోసం వచ్చిన సౌదీ మహిళలంతా ముక్తకంఠంతో నన్ను సమర్థిస్తూ హోరెత్తించారు. నిజం, నిజం. దైవసాక్షిగా నీవు చెప్పింది ముమ్మాటికీ నిజం! ఇంతలోనే ఇఖామత్ పలకడం ప్రారంభమయింది. మేమంతా నమాజు కోసం నిలబడ్డాము. గత్యంతరం లేక లేడీపోలీస్, మస్జిద్ నిర్వాహక స్త్రీలు వెనుదిరిగిపోయారు. నమాజ్ ముగిసిన తరువాత, సౌదీ మహిళలు నా పాకిస్తాన్ దుస్తులు చూసి ఆశ్చర్యంగా ఇలా అడిగారు. దైవసాక్షిగా! నీవు పాకిస్తానీవా? అయితే ఈ అరబ్బీ ఎక్కడ నేర్చుకున్నావు' నేను అమ్మీజాన్‌ను చూపిస్తూ 'నా తల్లిదండ్రులనుండి' అని సమాధానమిచ్చాను. ఇది విని ఆ స్త్రీలు అమ్మీజాన్ చేతిని అందుకని ముద్దాడారు. ఈద్ నమాజ్ ముగించుకొని మేము జిద్దాకు బయలుదేరాము.

ఇంటికి చేరిన తరువాత అమ్మిజాన్‌తో'మీరు మదీనాలో చేసిన ఆరాధనలకు తృప్తిపడ్డారు కదా? అని అడిగితే ఒక దీర్ఘశ్వాస విడుస్తూ, కావ్యరూపంలో "తనివి తీరా మేము పుష్పాన్ని చూడకమునుపే వసంతకాలం సమాప్తమై పోయింది" అంటూ ముక్తసరిగా సమాధానమిచ్చారు.

ఆ రోజుల్లో నా కుమార్తె రాబియా మెట్రిక్ పరీక్ష రాయబోతున్నది. ఆమెకు నేను తరుచుగా హెచ్చరిస్తూ ఉండేదాన్ని. "బేటీ! ఎట్టిపరిస్థితుల్లోనూ నీవు 'ఎ'గ్రేడ్ సాధించి తీరాలి. అందుకని నీవు సంపూర్ణంగాను, బహుముఖంగా కష్టపడాల్సి ఉంటుంది. మెట్రిక్ ఫలితాల మీదనే నీ మొత్తం భవిష్యత్తు క్యారియర్ ఆధారపడి ఉంటుంది. అమ్మాయికి చెప్పిన ఈ మాటల్ని బహుశ అమ్మీజాన్ విని ఉంటారేమో. దాన్ని గట్టిగా పట్టుకున్నారు. ఆ తరువాత ఆమెగారు చేసే నమాజ్‌లు ఎంత సుదీర్ఘంగా ఉండేవంటే, ఒక పట్టాన సమాప్తమయ్యేవి కావు."

ఒక రోజు ఉండబట్టలేక అడిగేశాను. ఈ మధ్య మీరు చేసే నమాజులు సుదర్ఘీమైపోతున్నాయి. అత్యధికంగా శ్రమపడుతున్నారు. ఇంత సుదీర్ఘమైన నమాజులు సలుపుతూ ఉంటే మీ ఆరోగ్యం చెడిపోయే ప్రమాదముంటుంది సుమా!'అని. దానికి ఆమె ఇచ్చిన సమాధానం, వారంరోజుల క్రితం నా కూతురు రాబియాకు చెప్పిన విషయాన్నే తలపించింది. "నేను కూడా పరీక్ష ఇవ్వాల్సి ఉంది. అదెలాంటి పరీక్షఅనుకుంటున్నావు? మొత్తం పరలోక జీవితమే దానిపై ఆధారపడి ఉంది. ప్రతి పేపరులో నేను కూడా 'ఎ' గ్రేడు రావాలని కోరుకుంటున్నాను. అంటే ప్రతి నమాజ్ 'ఎ'గ్రేడ్‌దై ఉండాలి. ప్రతి ఉపవాసం, ప్రతి ఉమ్రా 'ఎ'గ్రేడ్‌దై ఉండాలి."

ఎప్పుడైనా మేము సుదూర ప్రయాణాలు చేస్తున్నప్పుడు అంటే మదీనా నగరానికో, లేక తాయిఫ్‌కో పోతున్నప్పుడు, కారు డేష్‌బోర్డుపై అమ్మీజాన్ తప్పకుండా ఖుర్‌ఆన్‌ను పెట్టుకుంటుండేవారు. త్రోవంతా ఎవరితోనూ మాట్లాడకుండా ఖుర్‌ఆన్‌లోని ఏదో ఒక సూరాను కంఠస్తం చేస్తుండేవారు.

ఎల్లవేళలా తన విద్యాజ్ఞానాల్ని పెంపొందించుకునే ప్రయత్నం చేసేవారు. ఈ ప్రయత్నంలోని ఒక భాగంగా, ఒకసారి సూరె 'ఫత్హ్'ను, ఇంకొకసారి సూరె కహఫ్‌లోని మొదటి పది, చివరి పది ఆయత్‌లను కంఠస్థం చేసేవారు. మస్జిదె నబవీ చేరిన తరువాత కొత్తగా కంఠస్తం చేసిన ఆయత్‌లను నమాజ్‌లో పఠించారు. ఆ తరువాత ఈ హదీసును వినిపించారు. నమాజ్‌లో నిలబడి పారాయణంచేసే ఖుర్‌ఆన్ పారాయణం అన్నింటిలోకెల్లా శ్రేష్టమైనది. సూరె కహఫ్‌లోని మొదటి పది, చివరి పది ఆయత్‌లు కంఠస్తం చేసిన తరువాత, కొత్తగా కంఠస్తం చేసిన ఈ ఆయత్‌లను, మస్జిదె నబవీలో చేసిన నమాజులో చదివాక ఏదో ఒక గొప్ప పెన్నిధిని నాలో ఇమిడ్చుకున్నట్లు అనుభూతి పొందు తున్నాను' అని అన్నారు. కాస్సేపాగి తిరిగి 'సర్వసంపద, భౌతిక శక్తి, సౌందర్యం, అలంకరణ, పరిపూర్ణత అన్నీ కూడా మనిషి అంతర్భాగంగానే ఉంటాయి. బాహ్యంలో ఏదీ ఉండదు. బయట ఈ విషయాలను వెతుక్కునే అనేకమంది వాస్తవంలో లోపలినుండి అత్యంత దరిద్రులు, ప్రబల బలహీనులు, పరమ వికృత రూపులై ఉంటారు. అందుకే వారీ విషయాల్ని బయట వెతుక్కోవాల్సి వస్తుంది' అని అన్నారు.

ఆరోజుగాని నాకు అర్థం కాలేదు. అమ్మీజాన్ అబ్బాజాన్‌ని ఎందుకని ఏ డిమాండూ చేయలేదో, ఎన్నడూ మేకప్ చేయలేదో, ఎన్నడూ నగానట్రా కావాలని కోరి ఉండలేదో అని. ఆమెకి ఇలాంటి కృత్రిమ వస్తువుల అవసరమే లేదు. ఆమెలోని అంతరంగం ఎంత కాంక్షరహితమైనది, ఎంత పరిపూర్ణమైనది, ఎంత అందమైనదంటే, బాహ్యంలోని ఏదీ ఆమెకు అవసరమే లేదు అన్నది అసలు విషయం.

పవిత్ర మక్కానగరంలో కూడా ఒక రెండు వారాలుండి, ఇలాగే తనివితీరా ఆరాధనలు చేసుకోవాలని అమ్మీజాన్ ప్రగాఢ కోరిక. దీనికోసమని డాక్టర్ హాఫిజ్ అబ్దుల్ హఖ్ గారి సతీమణి 'ఫర్హానా' సోదరితో మాట్లాడాను. మక్కాలో ఆమెకు బంధువులూ ఉన్నారు. సంబంధాలూ ఉన్నాయి. ఆమె ఒక

ఫ్లాట్ బందోబస్తు చేసి, స్వయంగా తాను కూడా అమ్మీజాన్‌తోపాటుగా రెండు వారాలు గడిపి, ఆమెకు ఎంతో సేవ చేశారు.

ఇటు పాకిస్తాన్‌లో ఉంటున్న నా సోదరీసోదరులు అస్మా, ఖాలిద్, ఆయెషా (జన: 1956 మార్చి 4, లాహోర్)లు పదేపదే పిలుస్తుండడం వల్ల అమ్మీజాన్ లాహోర్ వచ్చేశారు. కాని మక్కా మదీనాల్లో గడిపిన ఆ రోజుల్ని ఆమె ఎన్నడూ మరువలేకపోయారు.

# 16. అమ్మీజాన్

అబ్బాజాన్ ఓసారి చెప్పిన మాటలు తరుచుగా నాకు గుర్తు కొస్తుంటాయి. అమ్మీజాన్ ఓసారి తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్నప్పుడు ఆమెను చూసి పరామర్శించిపోదామని వచ్చిన మా మామయ్య 'మర్‌హూమ్' ఖాజా ముహమ్మద్ షఫీ'గారితో ముచ్చటిస్తూ అబ్బాజాన్ ఇలా అన్నారు.

'ప్రజలు మౌలానా మౌదూదీ జిందాబాద్, జమాఅతె ఇస్లామీ జిందాబాద్'అంటూ నినాదాలిస్తున్నప్పుడు నేను నా మనసులో 'మహ్‌మూదా బేగం జిందాబాద్' అంటుంటాను. ఎప్పుడైనా ఓ సైన్యం విజయం సాధించినప్పుడు దాని సైన్యాధిపతిని పూలమాలతో ముంచెత్తడం అలవాటు. అలాంటి సమయంలో తన ప్రాణాలను సైతం అర్పించి విజయాన్ని సమకూర్చిపెట్టిన ఆ అనామక సైనికుణ్ని ఎవరు గుర్తుంచుకుంటారు? మిన్ను ముట్టే జిందాబాద్ నినాదాల్లో, తెరవెనుక ఉండి అపూర్వత్యాగం, నిస్వార్థత, ఆత్మాభిమానం, విశ్వసనీయత కనబరిచి, సాంత్వనం పలికి తృప్తిని కలిగించే వారిని ఎవరు పట్టించుకుంటారు? ఈ సద్గుణాల్ని కలిగిన వారిని ఎవరు గుర్తుంచుకుంటారు? వారిని జ్ఞాపకముంచుకొనేది ఎవరు??

అమ్మీజాన్ తన గురువుల్ని అమితంగా గౌరవించేవారు. దారుల్ ఇస్లాంలో ఉంటున్నప్పుడు మౌలానా అమీన్ అహసన్ ఇస్లాహి (నిర్యా: 1997,

డిసెంబరు 15) ప్రతిరోజు అస్ర్ నమాజు మొదలుకొని మగ్రిబ్ నమాజ్ వరకు దర్సె ఖుర్ఆన్ ఇస్తూ ఉండేవారు. అమ్మీజాన్ క్రమం తప్పకుండా దర్సె ఖుర్ఆన్‌కు హాజరయ్యేవారు. అంతేకాకుండా ఇంటికొచ్చి ఆ ఖుర్ఆన్ పాఠాల్ని మననం చేసుకునేవారు. ఇదేవిధంగా మౌలానా అబ్దుల్ గఫార్ హసన్ గారితో హదీసులు నేర్చుకున్నారు. విద్యాజ్ఞానాల దీపికలైన ఈ ఇద్దరు పెద్దల్ని అమితంగా గౌరవించేవారు, వారిని తమ గురువులుగా చెప్పుకునేవారు. ఆ తరువాత ఈ ఇద్దరూ జమాఅత్‌ను వీడిపోయినప్పుడు ఆమె అమితంగా బాధపడ్డారు. మౌలానా ఇస్లాహి గారి కనిష్ట పుత్రికకు ఆమె పాలు కూడా పట్టారు. అందుకని ఆమె తనకు ముగ్గురు కాదు, నలుగురు కుమార్తెలని చెప్పుకుంటుండేవారు.

ఆమె తన మహోన్నత భర్త పేరుప్రతిష్టల్ని క్యాష్ చేసుకోవడానికి బజారులో అమ్ముకోవడానికి ఎన్నడూ సిద్ధపడకపోవడం ఆమెలో నాకు నచ్చిన మరో మహోన్నత సుగుణం. ఈ సందర్భాన్ని నేను జీవితాంతం మరిచిపోలేదు. అబ్బాజాన్ పరమపదించిన తరువాత, అధ్యక్షులు ముహమ్మద్ జియావుల్ హఖ్ (నిర్యా: 1988, ఆగస్టు) అమ్మీజాన్‌ను సెనెట్ సభ్యత్వాన్ని స్వీకరించమని సెనెట్‌కు డిప్యూటి చేర్‌పర్సన్‌గా ఉండమని ఆహ్వానం పంపారు. దీనికోసం ముందు శ్రీమతి అతియా ఇనాయతుల్లాగారిని, ఆ తరువాత స్వర్గీయ సోదరి నిసార్ ఫాతిమా గారిని పంపించారు. అతియా ఇనాయతుల్లా గారి ప్రతిపాదనలను అమ్మీజాన్ మృదువచనాలు చెప్పి దాటవేశారు. కాని ఎప్పుడైతే సోదరి నిసార్ ఫాతిమా తిరిగి ఇదే ప్రతిపాదనను తీసుకొచ్చారో, ఆమె "సౌదాగరీ నహీ! యెహ్ ఇబాదత్ ఖుదాకి హై" (వ్యాపారం కాదిది, ఇది దైవారాధన) అంటూ తనకుఇష్టమైన పద్యపాదాన్ని చెప్పి ఇలా అనడం జరిగింది.

"ఖుర్ఆన్, హదీసుల ఈ జ్ఞానం, ప్రపంచం సంపాదించటానికి, ప్రపంచ హోదాలు అనుభవించటానికి కాదు. ఇది పరాన్ని కూడాబెట్టుకొనే సాధనం! అదేకాకుండా ఆమె ఇంకా ఇలా అన్నారు కూడా. 'నేను పుణ్య

స్వభావుడైన నా భర్త పేరును బజారులో అమ్ముకునే వస్తువుగా మార్చలేను. ప్రజలు తమ తమ సంతాన భవిష్యత్తు తీర్చిదిద్దుకోవడానికి బ్రతుకుతారు. కాని మౌలానా గారు దైవధర్మోన్నతి కోసం, దాని సేవకోసమే జీవించారు. ఆయన పరిస్థితి ఎలా ఉండేదనటానికి నస్రుల్లాఖాన్ అజీజ్‌గారి ఈ కావ్య పంక్తి అర్థం పడుతుంది.

మేరీ జిందగీ కా మఖ్‌సద్ తేరే దీఁకీ సర్‌ఫరాజీ

మై ఇసీలియే ముసల్మాఁ మై ఇసీ లియె నమాజీ!

నా జీవిత పరమార్థం (ఓ అల్లాహ్) నీ ధర్మోన్నతే- నేను నమాజీగా, ముస్లిమ్‌గా మారింది అందుకే.

ఆ తరువాత ఆమె ఇలా అన్నారు; ఈ ప్రపంచంలో నేనుగాని, నా సంతానంగాని 'ఆ పేరును' క్యాష్ చేయించుకునే అవసరం ఎంతమాత్రం లేదు. మాపై దేవుని కనికరం ఎంతో ఉంది. ఆయన తన వద్ద నుండే మాకెంతో ఇచ్చాడు. 'ఈ పేరును' ఉపయోగించుకునే అవసరం గురించి మాకు దైవం తనగ్రంథంలో ఇలా వాగ్దానం చేసి ఉన్నాడు- ఆ రోజు తప్పకుండా వస్తుంది.

"విశ్వాసుల సంతానం కూడా విశ్వాసం విషయంలో దాదాపు వారి అడుగుజాడలలో నడిచిఉంటే, వారి ఈ సంతానాన్ని కూడా మేము (స్వర్గంలో) వారితో కలుపుతాము. ఇంకా వారి కర్మలలో వారికి ఏమాత్రం నష్టం కలుగ జేయము' (అత్‌తూర్-21)

అందుకని నా అంతాన్ని, నా సంతానపు అంతాన్ని నా భర్తతో పాటే చేయాలని నేను దైవాన్ని వేడుకుంటున్నాను. మమ్మల్నందరినీ దైవమార్గంలో పరిశ్రమించటంలోనూ, దైవమార్గంలో ఖర్చుచేయటంలోనూ ఆయనకు నిజమైన వారసులుగాను, ఫిర్‌దౌస్‌గా పిలువబడే స్వర్గంలో మమ్మల్నందరినీ

కలపడానికి దైవాన్ని వేడుకుంటున్నాను. ఆమీన్! మౌలానా గారు తన దైవాన్ని మెప్పించుకున్నారు. సృష్టితాల్ని, మానవ మాత్రుల్ని ఏమాత్రం ఖాతరు చేయలేదు. ప్రపంచమంతటితో వైరం తెచ్చుకున్నారు కాని సృష్టికర్తను అసంతృప్తి పరిచి, సృష్టితాలను సంతృప్తి పరచటానికి ఆయన ఏనాడూ అంగీకరించలేదు.

మౌలానా ముహమ్మద్ అలీ గారన్నట్లు

తౌహీద్ తొ యెహైకె ఖుదా హశ్ర్ మెం కహ్‌దే

యే బందా దో ఆలం సే ఖపా మేరే లియే హై.

ప్రళయం రోజు స్వయంగా దేవుడే అనాలి,

ఈ వ్యక్తి కేవలం నా కోసమే సర్వప్రపంచంతో విభేదించాడని,

అసలైన ఏకేశ్వరోపాసన అంటే ఇదే.

# 17. అమ్మీజాన్ చివరి రోజులు

జీవితపు చివరి రోజుల్లో అమ్మీజాన్ తరచుగా అబ్బాజాన్‌ను తలుచు కుంటుండేవారు. ఒకరోజు బాగా వేడిగా, ఉక్కగా ఉంది. అంతలోనే కరెంటు కూడా పోయింది. ఎంతసేపటికీ కరెంటు రాలేదు. అమ్మీజాన్ మొదటే ఉబ్బసం రోగి. అందుకని వేడి, ఉక్కతో విపరీతంగా బాధపడసాగారు. కరెంటు జాడేలేదు. అంతలోనే ఆమెకు నిదురపట్టేసింది. మెలుకువ వచ్చిన తరువాత ఆమె ఇలా అన్నారు:

ఇప్పుడిప్పుడే మీ నాన్నగారి కంఠం వినిపించింది. అక్కడ ఉక్కలో నీవెందుకు కూర్చున్నావు. పైకి రారాదూ; చూడు! ఎంతటి చల్లని గాలి వీస్తుందో!

అని. ఆ తరువాత ఆమె బాధగా ఇలా అన్నారు : నేనై ఎలా వెళ్ళను? దైవం తరపునుండి పిలుపు రాకుండానే!'

ఆరోగ్యం ఇంకా చెడిపోయినప్పుడు, మా చెల్లాయి అస్మా, అమ్మీజాన్‌ను తన ఇంటికి తీసుకెళ్ళింది. ఆమె ఇల్లు అబ్బాజాన్ ఇంటిని ఆనుకునే ఉండేది. కొన్ని రోజుల తరువాత నేనామెను కలువడానికని వెళ్ళాను. ఉదయం నుండి అమ్మీజాన్ మాట్లాడడంలేదు, ఏమీ తినడమూ లేదు అని తెలిసింది. నేను ఆమెను సమీపించి కేవలం ఇలా పలికాను: 'దిల్లీ జో ఏక్ షహర్‌థా ఆలం మె ఇన్తిఖాబ్'

అంతే! అమ్మీజాన్ వెంటనే దానికిలా బదులిచ్చారు.

రహ్‌తే థే ముంతఖిబ్ హి జహాఁ రోజ్‌గార్ కె

ఇస్‌కో ఫలక్‌నె లూట్ కె వీరాన్ కర్‌దియా

హమ్ రహ్నె వాలె హైఁ ఇసి ఉజ్‌డే దయార్ కె.

అది విన్న నేను, 'అమ్మీజాన్ మీరు అనారోగ్యంగా ఉన్నారని ఎవరంటారు? మీరు పూర్తి ఆరోగ్యంగా ఉన్నారు. ఇదిగోండి! భోజనం చేయండి. అని అన్నాను. ఆ తరువాత ఆమె ఢిల్లీ ముచ్చట్లు చెప్పుకుంటూ సంతోషంగా భోంచేసేశారు.

ఇదేవిధంగా ఒకసారి ఆమె తీవ్ర అస్వస్థకు గురయ్యారు. ఎవరినీ కూడా గుర్తుపట్టడంలేదు. 'కోచయె పండిట్' వెళ్ళాల్సి ఉంది. అంటూ పదేపదే ఈ ఒక్క వాక్యాన్నే వల్లిస్తున్నారు. నేనక్కడికి వెళ్ళగానే చెల్లాయి అస్మా 'ఈ కోచయె పండిట్ ఏమిటి? అనడిగింది. ఇది ఢిల్లీలోని ప్రఖ్యాత వీధి. అక్కడామె అత్తవారిల్లు అంటే అబ్బాజాన్ ఇల్లు ఉంటుండేది. అని వివరించాను. ఆ తరువాత నేను ఢిల్లీలోని అనేక వీధుల పేర్లు చెప్పాను. చాందినీ చౌక్ గురించీ చెప్పాను.

అత్యంత సంబరపడిపోయారు.కాని భోంచేయటానికి అసలే ఒప్పుకోలేదు. మెల్లగా నేనిలా పల్లవి ఎత్తాను 'సౌదాగరి నహీఁ యెహ్ ఇబాదత్ ఖుదాకి హై'

అమ్మీజాన్ కాస్సేపాగి ఆలోచించసాగారు. మస్తిష్కంపై ఒత్తిడి వేయసాగారు. చివరికి ఇలా అన్నారు. ఓ బేఖబర్ జజాకి తమన్నా భీ ఛోడ్ దె

వాయెజ్ కమాలె తర్కెమె మిల్తిహై య్హాఁ మురాద్

దునియా భీ ఛోడ్ దీ హై తో ఉఖ్ బా భీ ఛోడ్‌దే అంటూ నాచేత్తో సూప్ త్రాగేశారు.

చివరి రోజుల్లో ఎవరినీ కూడా గుర్తించడం కష్టతరమైపోయింది. ఒక రోజు మగ్రిబ్ సమయంలో ఇలా చెప్పసాగారు. "ఉపవాసం విడువండి, తొందరగా తెమలండి, 'మస్జిదె నబవీ'లో తరావీహ్ చేయాల్సి ఉంది. నేడు ఖుర్‌ఆన్ పఠనం ముగిస్తున్న చివరిరోజు. తొందరపడండి, మొదటి వరుసలో స్థానం సంపాదించాలి." ఆ తరువాత ఇంకిలా అన్నారు : చూడండి! ఇంత కష్టపడి మొదటి వరుసలో స్థానం సంపాదించుకున్నాం. ఇప్పుడేమో వెనుకకు జరుగమంటున్నారు. ప్రత్యేక అతిథులొచ్చారట! అబ్బెబ్బె! మేమంతా ప్రత్యేక అతిథులమే. ఇది దైవప్రవక్త(స) మస్జిద్, ఎవరి మహలూ కాదు.

చుట్టుపక్కల ఉన్నవారు అర్థంకాక ఒకరి ముఖాలు ఒకరు చూసుకోసాగారు. కాని ఆమెగారి ఆత్మ, కాలం స్థానాల ఖైదును తెంచుకొని ప్రస్తుతం మస్జిదె నబవీలో ఉందని, దీన్ని ఆమె రంజాన్ నెల 29వ తేదీగా భావిస్తున్నారని నేను మాత్రం అర్థం చేసుకోగలిగాను. ఈ లోకంలో ఆమె నోటినుండి వెలువడిన చిట్టచివరి మాటలివి. ఆ తరువాత ఆమె శాశ్వతంగా మౌనముద్రలో ఉండిపోయారు. ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్.

కథనాలననుసరించి మౌలానా రూం (నిర్యా: 1273) చివరి ఘడియలో ధార్మికవేత్త ఆయన్ను పరామర్శించటానికి వచ్చి ఇలా అన్నారు. చింతించ

కండి! దైవచిత్తమయితే, స్వస్థత చేకూరుతుంది'అని. దానికి మౌలానా రూమ్ (రహ్మ) ఇలా బదులిచ్చారు. 'ఇక స్వస్థత మీకు చేకూరుగాక! వెంట్రుకవాసి బేధముండిపోయింది. ఆ తరువాత కాంతి, కాంతిలో కలిసిపోతుంది, మట్టి మట్టిలో కలిసిపోతుంది.

అబ్బాజాన్ 1979 సెప్టెంబరు 22న పరమపదించారు, అమ్మీజాన్ 2003 ఏప్రిల్ 14 శుక్రవారం ఎనిమిది గంటల ఇరవై నిమిషాలకు ఈ ప్రపంచాన్ని వీడిపోయారు. మరుసటి రోజు శనివారం పదకొండుంబావుకు ఖననం చేయబడ్డారు.

-: సమాప్తం :-